# హిందూ విజయ దుందుభి



రచన

శ్రీ రామ్ సాఠే

నవభారతి ప్రచురణలు
హైదరాబాద్

ద్వితీయ ముద్రణ

2,000

అక్టోబరు, 1984



ప్రచురణ :

నవభారతి ప్రచురణలు

3-4-705/4, నారాయణగూడ,

హైదరాబాదు - 500 029

ప్రతులకు :

సాహిత్య నికేతన్,

3-4-852, బరకత్‌పుర,

హైదరాబాద్ - 500 027

సాహిత్య నికేతన్,

ఏలూరు రోడ్డు,

విజయవాడ - 520 002

ముద్రణ :

భారత ముద్రణాలయము

3-4-705/4, నారాయణగూడ,

హైదరాబాద్ - 500 029

మూల్యం : రు. 12-00 లు

# తొలి పలుకు

ఆంగ్లేయులు మనహిందూదేశచరిత్రను ప్రాచీనయుగం,మహమ్మదీయ యుగం బ్రిటీషుయుగమనే భాగాలుగావిభజించి మనకు నేర్పారు. అందులో హిందువులకు ప్రాముఖ్యమే లేదు. దానితోబాటు ఆర్యులు ఈ దేశం వెలుపలి నుంచి వచ్చి, ఈ దేశంలో అదివరకు నివసిస్తున్నవారిని అణచివేసే పరిపాలన చేయనారంభించారని కూడా ఆంగ్ల చరిత్రకారులు ప్రచారం చేశారు. ఈ దేశపు కుగ్రామంలో కూడా భారతీయ జీవిత విధానం ఆర్యత్వలక్షణ లక్షితం. కాని, ఆర్యులు ఈ దేశవాసులు కారనీ, అసలు చారిత్రకంగా పరిశీలిస్తే ఇక్కడ 'స్వదేశీయులు' ఎవ్వరూ లేరని నమ్మించడమే ఆంగ్లేయుల ఉద్దేశం. సుమారు పదివేల కిలోమీటర్ల దూరం నుంచి వచ్చి, ఈ దేశంలో తమ స్వంతరాజ్యాన్ని స్థాపించుకొని, సుస్థిరంగా జీవించాలంటే, ఇక్కడి రాష్ట్రీయుల మనస్సులలో స్వదేశంపట్ల ఉన్న ఆత్మీయతా భావాన్నీ, శ్రద్ధాభక్తులనూ, సడలింపజేయడం అత్యవసరమని వారు గుర్తించారు. అతి చాకచక్యంతో దానిని సాధించారు కూడా. ఈ దేశపు యజమానుల మనస్సులందే "ఈ దేశం మనదా? లేక ఇక్కడ నివసించే అందరదీనా? ఇది ఒకే దేశమా? లేక అనేక దేశాలు గల ఖండమా? అథమ పక్షం, ఇది ఒక ఉపఖండమా? అసలు దేశంలో రాష్ట్రీయతాభావం ఎప్పుడైనా భాసించిందా!" మొదలగు సందేహాలను ఆంగ్లేయులు కల్గింపగలిగారు. ఇంగ్లీషు చదువులలో మున్కలు వేస్తున్న స్వదేశీయులే, అనేక రాజ్యాలుగా కన్పించే ఈ భూభాగాన్ని, ఆంగ్లేయులు ఒకే పరిపాలన క్రింద సమీకరించడం వలననే దీనికి దేశపు స్వరూపం లభించిందనీ అట్టి ఆంగ్లేయుల బారి నుంచి విముక్తి కలిగించి, దేశంలో అభివృద్ధి సాధించడానికి చేసిన ప్రయత్నాల వలననే ఇప్పుడిప్పుడే ఇదొక వినూత్న రాష్ట్రంగా రూపొందుతుందని చెప్పనారంభించారు. అలాంటి వారందరూ "This is a nation in making" అని సగర్వంగా చాటుకొనేవారు.

కాని ఆంగ్లేయుల విద్యాపద్ధతికీ, వారి ప్రభావానికీ లొంగనివారు కూడ మన దేశంలో లేకపోలేదు. వారి ఆలోచనా విధానం పై విధానానికి పూర్తిగా భిన్నంగా ఉండేది. "ఆంగ్లేయులు ఈ భూభాగంపై అడుగు పెట్టకముందు ఇదొక దేశంగా, రాష్ట్రంగా పరిణతి చెందకున్నట్లయితే ఇక్కడ ఆవిర్భవించిన వివిధ మతాల నవలంభించేవారి పుణ్యక్షేత్రాలు దేశమంతటా ఎందుకు నెలకొల్పబడ్డాయి ? స్నానం చేసే సమయంలో వివిధ ప్రాంతాలలోని ముఖ్యమైన నదులను అందరూ ఎందువలన స్మరి స్తారు ? ఈ దేశమందలి ప్రాంతీయ భాష లన్నింటిలో సంస్కృత పదాలు విరివిగా ఎందుకు విన్పిస్తున్నాయి ? ఇక్కడి ప్రజల మనస్సులలో వేద శాస్త్రాలపట్ల అనన్య సాధారణమైన ఆదరాభిమానాలు ఉట్టిపడటానికేమి కారణం ? అడుగడుగునా ఈ దేశ జీవితంతో ఆధ్యాత్మికవాదము పెన వేసుకొని ఉండడం వాస్తవమే కద ! నాలుగువేల సంవత్సరాల క్రితం ప్రప్రథమంగా ఈ దేశంపై దండెత్తి వచ్చిన పర్షియా దేశపురాణి సెమిరా మిస్ మొదలుకొని ఈ శతాబ్దం వరకు దండెత్తిన అసంఖ్యాకులైన విదేశీ యులతో మనం కాషాయ ధ్వజచ్ఛాయల క్రింద పోరాటం కొనసాగిం చటం ఇంకా మరచిపోలేదే !" అని చరిత్రపుటలు తిరగవేయసాగారు.

ఇట్టి జాతీయ భావాలు ఆంగ్ల విద్యలో పెరిగిన మన దేశ నాయ లలో కూడ అప్పుడప్పుడు బయల్పడుతున్నాయి ఆంగ్లేయులు మన దేశం వదలిపోవడంతో సర్దార్ వల్లభ్ భాయి పటేల్ గారు గుజరాతు ప్రాంతంలోని సోమనాథ మందిరాన్ని పునరుద్ధరిస్తూ "వేయేండ్లపాటు మన జాతికి జరి గిన అవమానాన్ని దీనితో కడిగివేశా"మని ప్రకటించారు. అంటే వేయి సంవత్సరాల పూర్వం కూడా ఈ దేశం ఒక రాష్ట్రంగా ఉండేదనీ, సోమ నాథ దేవాలయాన్ని మహమ్మదీయులు ధ్వంసం చేయడం ఈ రాష్ట్రానికి అవమానకరమనీ పటేలుగారి అభిప్రాయం. ఇదే విధంగా ఔరంగజేబు కుతంత్రాల వలన ఆగ్రా జైలులో నిర్బంధింపబడిన శివాజీ 1666లో

అక్కడి నుంచి తప్పించుకొని బయటపడ్డారు. 1966లో ఢిల్లీలో జరిగిన త్రిశత వార్షికోత్సవాలకు అధ్వర్యం వహిస్తూ శ్రీ యశ్వంతరావ్ చవాన్ శివాజీ లేనియెడల హిందూ దేశమంతా ఆనాటికే పాకిస్తాన్ అయివుండేదనీ, దాని నాపడంలోనే శివాజీ మహారాజు కీర్తి సార్థకమైందనీ ఉద్ఘాటించారు. ఒకవేళ అలా జరగకపోయి ఉంటే ఈ జాతికి తీరని నష్టం కలిగి ఉండే దని చవాన్‌గారి అభిప్రాయమన్నది సుస్పష్టం.

వాస్తవానికి మనదేశ చరిత్ర చాల పురాతనమైనది. చాలాకాలం క్రితమే మనమొక జాతిగా రూపొంది ఉన్నాము. మనుస్మృతి సమగ్ర భారతదేశాన్ని వర్ణిస్తూ దీనిని పుణ్యభూమి అని పేర్కొన్నది. తక్కిన దేశాలు మ్లేచ్ఛ దేశాలని నిర్ణయించింది. "భారతం నామతద్వర్షం, భారతీ యత్ర సంతతిః" ఈ వాక్యం భారతదేశాన్నీ, దాని ప్రజల్నీ ఎత్తి చూపు తుంది భారత సంతతిని వర్ణిస్తూ మనువు అంటాడు

శ్లో॥ ఏతద్దేశ ప్రసూతస్య సకాశా దగ్ర జన్మః॥
స్వం స్వం చారిత్ర్యం శిక్షేరన్,
పృధివ్యాం సర్వమానవాః॥

ఇటువంటి ఉన్నత స్థాయికి సమాజము పోగల్గు శీలయోగ్యతలు పొందడం కోసం అతడు నియమాలు రచించాడు. ఇతర స్మృతికారులు కూడా ఇటువంటివే ప్రసాదించారు. అవి ఇచ్చటి ప్రజల ఆచార, విచా రాల కనుగుణంగా సహజమైనవిగా అగుపడ్డవి. అవి అన్నియు ఒకే అచ్చులో పోతపోసినవి. ప్రజలు వెంటనే వాటిని తమ జీవనంలో చేర్చు కున్నారు. దాని పరిణామం భారతదేశమంతటా ఒకేరీతి, ఒకేనీతి, ఒకే నియమం, ఒకే వ్యవహారం ఏర్పడ్డాయి. ఈ నీతి శాస్త్రకారులే మన గ్రామపంచాయితీలు సృష్టించారు. దేశమంతటా వీటిస్వరూపం ఒక్క

మాదిరిగానే ఉండేది. పైదట, పరిపాలనలో పరివర్తన జరిగినా, భార తీయాత్మను స్వతంత్రంగానూ, ఒకటిగానూ ఉంచాయి యివి. మిక్కిలి బలిష్ఠము అయిన భారతదేశంలో ఈ చివరనుంచి ఆ చివరి వరకు వ్యాపించి ఉన్న హిందూసంఘం యావత్తూ ఒకే విధమయిన ఆలోచన, ఒకే విధమయిన కర్తృత్వం అవలంభించింది. జీవనంలో సమరసతత్వం నిండించుకుంది. ఒకే సంస్కృతి మీద ఆధారపడింది. అఖండమైన జాతీ యత సాధించింది. అందుకే అరిభయంకరులని పేరు మోసిన గ్రీకు, శక, హూణులను, యూదులను, కుషానులను తనలో జీర్ణించుకుంది.

ఈ సమయంలో క్రీ. శ. ఎనిమిదో శతాబ్ది ఆరంభంలో అరే బియా నుంచి తుఫాను రేగింది. అది యూనాను, ఈజిప్టు, స్పెయిను పర్షియావంటి పెద్దపెద్ద దేశాలు శాశ్వతంగా తుడిచిపెట్టేసింది. క్రీ. శ. 712లో సింధు ప్రాంతంలో మహమ్మదీయుల పరిపాలన ప్రారంభమ యింది. మదమత్తులై వారు హిందూ దేశమంతా విలయతాండవం చేయా లనుకున్నారు. ఏది ఏమైనా, పూర్తి దేశం మాత్రం వారి పాలనకు ఏనాడూ లోబడియుండలేదు. ఆక్రమణకారులందరినీ సమాజము శత్రువులుగానే ముక్తకంఠంతో నిర్ణయించింది. వాళ్ళ కబంధ హస్తాలనుంచి దేశాన్ని విడిపించటం కోసం అన్నిచోట్లా ప్రయత్నాలు జరిగాయి. రాష్ట్రీయశక్తుల విజృంభణతో మహమ్మదీయులు వారితో నిరంతరం యుద్ధం చేస్తూ తమ జీవిత కాలమంతా వ్యర్థం చేయాల్సివచ్చింది.

దక్షిణ హిందూ దేశమందలి బిజాపూరు, గోల్కొండ రాజ్యాలు పతనంజెందిన తరువాత మనదేశంలో మిగిలి ఉన్న ఏకైక ముస్లింరాజ్యం మొగలులది. మొగలు పాదుషాలు ఇతరులకన్న ఎక్కువ శక్తిమంతులు, యుక్తిమంతులు; ఇతరులకన్న ఎక్కువ భూభాగాన్ని ఆక్రమించుకొన్నారు. వారిలో చివరి పాదుషా ఔరంగజేబు. అతని

కాలంలో ఉవ్వెత్తున లేచిన జాతీయశక్తులు మొగలు సామ్రాజ్యాన్ని ఏ విధంగా తుత్తునియలు చేశాయో తెలిపే కథల సంపుటియే ఈ పుస్తకం.

ఈ కథలను శ్రీరామ్‌సాఠేగారు హిందీలో రచించగా డాక్టర్ కొత్తపల్లి ఘనశ్యామల ప్రసాదరావు గారు తెలుగులోకి అనువదించారు. శ్రీ సాఠేగారికీ, డాక్టర్ ఘనశ్యామల గారికీ మా ధన్యవాదాలు.

ప్రకాశకులు

## ఇందులో...

* లాచిత్ బడ్‌ఫుకన్
* దక్షిణ భారతంలో ఔరంగజేబు పరాజయం
* రాజా ఛత్రసాల్ బుందేల్
* దుర్గాదాసు రాఠోడు
* గురుగోవింద సింహుడు
* బందాసింగ్ బహదూర్

# లాచిత్ బడ్ ఫుకన్

సుమారు మూడువందల సంవత్సరాల మహమ్మదీయుల పరిపాలన తర్వాత దక్షిణాపథంలో ఛత్రపతిశివాజీ తిరిగి హిందూసామ్రాజ్యాన్ని స్థాపించాడు. అదే సమయంలో అస్సాంలో కొలదిభాగం మాత్రం కొద్దిసంవత్సరాలవరకు మహమ్మదీయుల పాలనలో ఉండేది. ఆ కొలదిభాగం కూడా అనతికాలంలోనే అస్సాం హిందువులు తిరిగి స్వాధీన పరచుకొనగలిగారు. అట్టి ఖ్యాతిని పొందగల్గిన అస్సాం హిందూ సేనలకు సర్వసైన్యాధిపతిగా నుండిన వీరుడే "లాచిత్ బడ్ ఫుకన్". అట్టి లాచిత్ బడ్ ఫుకన్‌ను కొందరు చరిత్రకారులు "అస్సాం శివాజీ" అనికూడా అంటారు.

మొగలు వంశమునందు బుట్టిన జహంగీరు అస్సాం ప్రాంతాన్ని తన పరిపాలనలోనికి తెచ్చుకొనేందుకు ప్రయత్నించాడు. కాని ఫలితం మాత్రం పొందలేకపోయాడు. తరువాతి కాలములో ఢిల్లీ నేలిన ఔరంగజేబు, తన తండ్రి షాజహానును కారాగారమందుంచి క్రీ.శ. 1657 లో ఢిల్లీ సింహాసనాన్ని అధిష్టించిన నాటినుండి, మీర్ జుమ్లా అను సర్దారు ద్వారా అస్సాం మీదకు అనేక దండయాత్రలు జరిపి మొత్తం అస్సాంను స్వాధీనపరచుకొనేందుకు ప్రయత్నించాడు. అస్సాంలో ఉన్న హిందూ

రాజులు అనేక సార్లు మీర్ జుమ్లాను తరిమివేశారు. కాని చివరకు మీర్ జుమ్లా సైన్యం చాలా పెద్దది కావటంవలన అతడు అస్సాం రాజధాని యైన గౌహతిని పట్టుకొని దానిపై ముస్లిం జెండాను ఎగురవేశాడు. అప్పుడు అస్సాం ప్రభువైన జయధ్వజసింహుడు తన రాజధానిని వదలి తన రాజ్యంలో తూర్పువైపుకు పారిపోవలసి వచ్చింది. గౌహతిలో మీర్ జుమ్లా శాసనం ఉన్నప్పటికీ, అస్సాం హిందూ సైనికులు మీర్ జుమ్లాను ప్రశాంతంగా ఉండనీయలేదు. వీరు వృకయుద్ధ పద్ధతిలో (గెరిల్లా) దాడులు జరుపుతూనే ఉన్నారు. అస్సాములోని ప్రతి హిందూ సైనికునకు ఆ ప్రాంతంలో ఉన్న పర్వత శ్రేణులలో ప్రతి అంగుళం తెలుసును. వారు మొగలు సేనను ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీరు త్రాగించారు. మీర్ జుమ్లా అస్సాంమొత్తం జయించలేనని నిరాశచెంది, ఆక్రమించిన గౌహతి తన స్వాధీనంలో ఉంటే చాలునని—ఆవిధంగా జయధ్వజ సింహునితో ఒప్పందం చేసుకోవాలని ప్రయత్నించాడు. జయధ్వజసింహునికి అప్పటికే చాలా నష్టం కలిగింది. కాబట్టి అప్పుడు ఖానుతో యుద్ధం చేసే కంటే- గౌహతిని వదిలి మిగిలిన అస్సామునంతా తన చేతిలో ఉంచుకొని, సమయం చూచి గౌహతిని జయించవచ్చనే ఉద్దేశ్యంతో జయధ్వజ సింహుడు ఆ ఒప్పందాని కంగీకరించాడు. ఈ ఒప్పందం క్రీ.శ. 1663లో ఘిలాఝుర్ అను గ్రామంలో జరిగింది. దీని ప్రకారం అస్సాం రాజధానియైన గౌహతి ముస్లిముల కివ్వబడింది. అట్లాగే అస్సాం యొక్క హిందూ రాజ్యమునకు ముస్లిం రాజ్యమునకు మధ్యలో సరిహద్దుగా 'బర్' నది నిర్ణయింపబడింది. ఇవికాక ఢిల్లీ సుల్తానైన ఔరంగజేబుయొక్క సార్వభౌమత్వాన్ని జయధ్వజసింహుడు ఒప్పుకొనినందుకు చిహ్నంగా ప్రతి సంవత్సరం ఎక్కువ సంఖ్యలో ఏనుగులను, గుఱ్ఱములను, కొన్ని మణుగుల బంగారమును అతడు ఢిల్లీకి పంపవలెనని కూడా నిర్ణయించబడింది. గౌహతిని అవకాశం దొరికినప్పుడు జయించవలెననే దృష్టితో యీ ఒప్పం

దాన్ని అంగీకరించినప్పటికీ గౌహతిని తురుష్కులకు స్వాధీన పరచవలసి వచ్చినందుకు జయధ్వజసింహుడు చాలా విచారించాడు. ఆ మనోవ్యధతో సుస్తీచేసి అతడు అవసాన దశకు వచ్చాడు. అప్పుడు తన మంత్రులను తన వద్దకు పిలిపించి "మీరు అస్సాం ప్రజలకు ప్రాప్తించిన యీ బాని సత్వమనే కళంకాన్ని తొలగిస్తామని నాకు మాట యిచ్చినట్లయితే నేను నిశ్చింతగా ప్రాణం వదులుతాను" అని పలికాడు. అప్పుడు మంత్రులు తమ ఖడ్గములపై చేతులనుంచి జయధ్వజ సింహుని ముందు అతడు కోరిన విధంగా శపథం చేసారు. ఆ తర్వాత జయధ్వజ సింహుడు సుఖంగా ప్రాణత్యాగం చేసాడు.

జయధ్వజ సింహుని మరణానంతరము అతని తమ్ముడు చక్రధ్వజ సింహుడు సింహాసనమెక్కాడు. అతని మనస్సు ఔరంగజేబు యొక్క సార్వభౌమత్వాన్ని అంగీకరించటంలేదు. అతని రాజ్యాభిషేకం తర్వాత అతనికి ఔరంగజేబు వద్ద నుండి కానుకగా కొన్ని వస్త్రాలు పంపబడ్డాయి. ఆ వస్త్రాలు తెచ్చిన దూత ముందు వాటిని ధరించినట్లయితే ఔరంగజేబు యొక్క సార్వభౌమత్వాన్ని అంగీకరించినట్లే ఔతుంది. అందువల్ల ఆ వస్త్రాదులను ధరించక పోగా మహారాజ చక్రధ్వజ సింహుడు వాటిని తెచ్చిన ఆ దూతతో "ఈ వస్త్రములను ధరించుటకంటె మరణించుట మేలు. అస్సాంలో వున్న హిందువుల్లో యింకా ఉడుకురక్తం ఉందని నీవు వెళ్ళి నీ పాదుషాతో చెప్పు" అని కఠోరంగా పలికాడు.

గౌహతిని మొగలుల నుండి తిరిగి స్వాధీనం చేసుకొనవలెనని చక్రధ్వజ సింహుని వాంఛ. సింహాసనమెక్కిన వెంటనే గౌహతి మీద దాడిచేయాలని అతడుద్దేశించాడు. అప్పుడు అతని మంత్రియైన 'అతన్ బడ గోహిన్' "మహారాజా! ఇప్పటివరకు జరిగిన యుద్ధంలో మనకు బాగా నష్టం కలిగింది; ధనధాన్యాలు, శస్త్రాస్త్రాల కొరత మనకు చాలా

ఉంది. ముందుగా అవి సమకూర్చుకోవాలి. ఆపైన మొగలులను ఓడించ టానికెక్కువ సమయం అక్కరలేదు" అని సలహా యిచ్చాడు.

చక్రధ్వజ సింహుడు మంత్రిమాటలను అర్థం చేసుకున్నాడు. వెంటనే తనసైన్యాన్ని బలపఱచుటకు, ధనధాన్యాలను, యుద్ధసామగ్రిని అభివృద్ధి చేయుటకు ప్రయత్నించ సాగాడు. యుద్ధకాలంలో తురకల భయంవలన చాలామంది ప్రజలు తమతమ నివాసగ్రామాలను వదలి వెళ్ళి పోయారు. ఇప్పుడు వారు తిరిగి స్వస్థలాలకువచ్చి నివసింపనారంభించారు. ప్రతి గ్రామాన్ని సంరక్షించేందుకు, అభివృద్ధిపరచేందుకు అవసరమైన ఏర్పాట్లు చేయబడ్డాయి. వ్యవసాయదారులు తమవృత్తిపట్ల తిరిగి ఉత్సాహం కలిగి మరల నాగళ్ళు చేపట్టి వ్యవసాయం చేయటం ప్రారంభించారు. స్వయంగా రాజు తరఫున ఆయుధసామగ్రిని ఉత్పత్తి చేసేందుకు ప్రయ త్నాలు మొదలయ్యాయి. చాలామంది సైన్యంలో చేర్చుకోబడ్డారు. పరిసర ప్రాంతాల్లోవున్న హిందూరాజులతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగు తున్నాయి. చక్రధ్వజ సింహునికి, జయంతియా రాజు "అస్సాంకుపట్టిన ఈ ముస్లిం గ్రహణం ఎక్కువకాలం ఉండటానికి వీల్లేదు. దాన్ని తొల గించేందుకు మీరు చేసే ప్రయత్నం తప్పక కొనసాగుతుంది. దానికి నేను కూడా నా పూర్తిశక్తితో మీరుకోరినప్పుడు మీకు సహాయం చేసేందుకు రాగల"నని వ్రాశాడు. కూచ్‌బిహార్ రాజు చక్రధ్వజ సింహుని ఉత్తరానికి జవాబిస్తూ "దక్షిణాదినుండి శివాజీ మహారాజు విదేశీయులయిన మొగలుల సామ్రాజ్యముపై దండయాత్రలు జరిపి మొగలురాజ్యాన్ని క్షీణింపజేస్తు న్నాడు. నేను ఆయనకుకూడా ఉత్తరం వ్రాశాను. మనం అందరం కలిసి ఈ తూర్పుదిశనుండి మొగలులపై దండయాత్ర జరిపి వారిని వెనుకకు తరిమివేయాలి" అని వ్రాశాడు. వీరేకాకుండా కాచార్ రాజు మరికొందరు కూడా సహాయం చేయుటకు సిద్ధ పడ్డారు. అస్సాంలోని శిథిలదుర్గాలను, కోటలను అన్నిటిని తిరిగి బాగుపరచారు. అన్నిటినీ ధనధాన్యాదులతో,

శస్త్రాస్త్రములతో స్వయం సమృద్ధం చేశారు. చాలాయేళ్లు యుద్ధం సాగి నప్పటికి కొఱతరానంత ధాన్యం రాజభాండారంలో నిల్వచేశారు. లాచిత్ బడ్ ఫుకన్‌ను సర్వసైన్యాధిపతిగా నియమించి మహారాజైన చక్రధ్వజ సింహుడు అతనిని గౌరవించి బంగారుపిడి గల్గిన ఖడ్గమును స్వయంగా అతని నడుమున కలంకరించాడు.

లాచితుడు లఖురాఖున్ వంశీయుడు. అతని తండ్రిపేరు సూక్తి. సూక్తికి మొమాయీతాములీయను మరియొకపేరు కూడ వుంది. సూక్తికి లాచితుడు చివరికొడుకు. జహంగీరు కాలంలో మొగలుల నెదిరిస్తూ జరిగిన యుద్ధంలో సూక్తి ఒక సేనాపతిగా ఉన్నాడు. తన ప్రజ్ఞవల్ల దక్షతవల్ల అతడా పదవి పొందగలిగాడు. అస్సాంయొక్క శాసనపద్ధతి యితని వలననే సుసంఘటితంగాను, సువ్యవస్థితంగాను రూపొందించ బడ్డది. ప్రతి గ్రామంలోనూ వివిధవృత్తులు చేపట్టినవారి కందరికీ అనుకూలంగా ప్రణాళికలను రచించి, ప్రతిగ్రామం స్వయం సమృద్ధంగా ఉండేట్లు తయారు చేశాడు. ఇతనికి తమరాజుపై ప్రగాఢ భక్తివిశ్వాసాలుండేవి. ఇతడు దక్షిణ అస్సాంకు సుబేదారుగా ఉన్నప్పుడు కాచార్ రాజైన ఇంద్రబల నారాయణుడు ఒకలేఖ వ్రాస్తూ "దక్షిణఅస్సాం ప్రభూ" అని సంబోధించగా, ఆ ఉత్తరం చూచి కోపోద్రిక్తుడై "అస్సాం సమ్రాట్టును ఈ విధంగా మరియెన్నడూ అవమానింప తగ"దని ప్రత్యుత్తరమిచ్చాడు.

ఇట్టి గుణవంతుడు, ప్రభుభక్తి పరాయణుడు, స్వీయ కర్తవ్యత త్పరుడూ అయినా తండ్రికి తగిన గుణవంతుడైన పుత్రుడు లాచితుడు. లాచితునికి రాజకీయ శాస్త్రంలోను, యుద్ధశాస్త్రంలోను మంచి పరిజ్ఞానముంది. అందుచేతనే లాచితుడు మంత్రియైన అతన్ బడ్ గోహిన్‌కు అంతరంగిక కార్యదర్శిగా నియమింపబడ్డాడు. ఈ పదవినుండి సర్వసైన్యాధిపతిగా నియమింపబడుటకుపూర్వ మితడు ఘోడా బారువా, (అశ్వదళాధి

పతి) సీమాలు గుడియాపుకన్ ('సీమాలు' దుర్గాధిపతి), దో లక్ష లియా బారువా (రాజుయొక్క విశిష్ట సైన్య దళాధిపతి) మొదలగు చాలా పదవులలో పనిచేసి యశస్సు గడించాడు. హిందూ రాజశాసన విధాన మందును, అర్థశాస్త్రమందును, ఇతనికి చక్కటి పరిజ్ఞాన ముండేది. ఇట్టి యోగ్యుడైన వ్యక్తి సర్వసైన్యాధిపతిగా నియమింపబడ్డాడు. అస్సాం యొక్క భవిష్యత్తును ఉజ్జ్వలంగా చేసే బాధ్యత అతనికీయబడింది.

గౌహతిలో ఔరంగజేబు తరఫున సుబేదారులుగా సయ్యద్ ఫిరోజ్, సయ్యద్ శానా అను ఇద్దరు ముస్లిం సర్దారులు శాసనం సాగిస్తున్నారు. గౌహతి వీరి అధీనంలో ఉండటం అస్సాం రాజుకేగాక హిందూ ప్రజలందరకూ చాలా బాధాకరంగా ఉండేది. గౌహతినుండి ముస్లిములను తరిమి వేయాలని అందరూ ఎదురు చూస్తుండిరి. లాచితుడు సర్వసైన్యాధిపతి అయిన వెంటనే దూతలను పంపించి చుట్టు ప్రక్కలనున్న రాజులందరు ఎవరెంతగా, ఏ విధంగా సహాయం చేయగలరనే విషయాన్ని గ్రహించాడు. కొత్త కొత్త కోటలను కట్టించాడు పర్వత నదీ నద ప్రదేశాలతో సన్నటి బాటలున్న స్థలాల్లో అస్సాం యుద్ధరీతి ననుసరించి పెద్ద పెద్ద గోడలు కట్టించాడు. ఈ ప్రదేశాలన్నీ స్వయంగా పర్యటించి ప్రజలందరిలోను నూతనోత్సాహాన్ని కలుగజేశాడు. తత్ఫలితంగా ప్రతివ్యక్తి దేశభక్తితో పనిచేయ నారంభించాడు. చక్కగా పనిచేసేవాళ్ళకి బహుమానాలూ, వెనుకంజ వేసే వారికి తగు శిక్షలుకూడ విధించబడ్డాయి. అప్పటికి అస్సాం పూర్తిగా యుద్ధానికి సిద్ధమైంది. గూఢచారులు శత్రు శిబిరములనుండి సమాచారం గ్రహించి ఎప్పటికప్పుడు తెల్పుతూండేవారు. శత్రువులను తరిమివేసేందుకు తగిన శక్తి సముపార్జింపబడిందనే నమ్మకం కల్గిన తరువాత, సర్వసైన్యాధిపతియైన లాచితుడు మొత్తం సైన్యాన్ని గడ్‌గావ్‌లో సమావేశపరచాడు. అప్పుడు సైన్యాన్నుద్దేశించి మహారాజు చక్రధ్వజ సింహుడు "గో బ్రాహ్మణులను, దేవతలను, స్త్రీలను సంరక్షించేం

దుకు మీరు యుద్ధం చేయబోతున్నారు. మొగలాయీలను అస్సాంనుండి బయటకు తరిమివేసి అస్సాంయొక్క గౌరవాన్ని కాపాడుకోవటమే మీ పని. ఇతాఖురీ (గౌహతి కోట)లో మీ శౌర్యము పరీక్షింపబడుతుంది. యుద్ధంలో మరణిస్తే వీరస్వర్గము లభిస్తుంది. శత్రువులకు భయపడి పారి పోయారా అస్సాం పూర్తిగా ధ్వంసం చేయబడుతుంది. అస్సాంకు ఇక భవిష్యత్తు ఉండదు" అని గంభీరంగా ఉపన్యసించాడు. మహారాజు యొక్క యీ యుద్ఫోధ అందరికీ స్ఫూర్తిని కలిగించింది. 'గౌహతిమీద ఎగిరే నెలవంక చిహ్నంగల ఆకుపచ్చని ముస్లింజండాను ఎప్పుడు క్రిందికి దించు దామా' అని అందరూ ఆ శుభసమయానికి ఎదురు చూడసాగారు.

అది శాలివాహన శకం. 1589 భాద్రపదశుద్ధ తదియ (క్రీ. శ. 20-8-1667) నాడు హిందూసేన బ్రహ్మపుత్రానది నుండి గౌహతివైపు బయలు దేరింది. కాలియాబారు చేరిన తరువాత సైన్యం రెండుగా విభజిం చబడి ఒకభాగం నదిలో నుండి నౌకలమీద, రెండవభాగము పదాతిదళ ముగా భూమి మీదా ముందుకు సాగింది. మొగలు సైన్యంమీద రెండు వైపులనుండి ఆక్రమణ చేయాలని వారు నిర్ణయించారు. అంతవరకు గౌహతి లోనున్న మొగలు సుబేదారుకి విషయం తెలియనే తెలియదు.

మొదటిదెబ్బకే బాహంబారి అనే కోటను దింఘియా ఫుకన్ జయిం చాడు. కాజలికోట గూడా చేజిక్కింది. అప్పుడు సర్వసైన్యాధిపతి లాచి తుడు మణికర్ణేశ్వర పర్వతం మీద శాహబురుజులో తన సైనికశిబిరాన్ని ఏర్పాటు గావించాడు. అక్కడి నుండి గౌహతివైపున ఆక్రమణలు ప్రారం భించాడు. ఈ ఆకస్మికదాడివల్ల మొగలుసైనికులలో కలవర మేర్పడింది. ఆయినప్పటికీ ఒకరోజు రాత్రిసమయంలో మొగలుసేన ఇతాఖులీ కోట నుండి బయలుదేరి శాహబురుజు మీదనున్న హిందూసైన్యంపై దాడిచేసింది. కాని "కలాంచు సంధికె" కుమారుడు బేతమేలా ఆ మొగలు సైన్యాన్ని

ఎదుర్కొని వెనుకకు తరిమివేశాడు. మొగలులకు బంగాళములో రంగమతిలోను, ఢాకాలోను సైనిక శిబిరాలున్నాయి. కాని అక్కడనుండి సహాయాన్ని పొందుటకు తగిన వ్యవధి లేనందున మొగల్ సుబేదారైన సయ్యద్ ఫిరోజ్ ఇతాఖుర్ కోటను స్థావరముగ జేసికొని ఎదిరించాలని నిశ్చయించాడు. బ్రహ్మపుత్రకు ఉత్తరపుటొడ్డున కూడా యుద్ధం జరుగుతూనే వుంది. అస్సాంలోని భయంకరమైన అడవులలో కుంభ వృష్టిలో, మెఱుపులాంటి వేగంతో గంభీరపోరాటం సాగిస్తున్న అస్సామీయుల నాపుట మొగలుసైనికుల కెలా సాధ్యం? మొగలులు సమతలభూమిపై నిదానంగా జరిపే యుద్ధానికి మాత్రమే అలవాటుపడినవారు. ఇది యిట్లా వుండగా లాచితుడు మొగలుసేనపై నలువైపులా దాడులు జరిపించి వారి కందవలసిన ధన ధాన్య శస్త్రసహాయం అందనీయకుండా నిరోధించాడు. శాలివాహనశకం 1589 కార్తీక బహుళ విదియ (2-11-1667) రోజున గౌహతిమీద అంతిమదాడిని నదిపైనుండీ, భూమిపైనుండీ జరిపారు. అస్సామీయులు ఆ రాత్రి తెల్లవార్లూ మొగలులను హతమార్చారు అంతకుముందే వీరి గూఢచారులు మొగలుసైన్యంలో ప్రవేశించి వారి ఫిరంగులను పనికి రాకుండా చేశారు. చివరకు మొగలులు ధైర్యసాహసములను కోల్పోయి పలాయనమంత్రం పఠింప నారంభించారు. వారిలో చాలామందిని అస్సామీయులు చంపివేశారు. మిగిలినవారిని బందీచేశారు. వారిలో ముఖ్యులైన సయ్యద్ ఫిరోజ్, సయ్యద్ శానా, సయ్యద్ సర్దార్, మీర్ బక్షీలు బందీ చేయబడ్డారు. నాల్గు సంవత్సరాల క్రితం గౌహతిమీదనుంచి తొలగింపబడిన హిందువుల అరుణారుణ భగవపతాకం తిరిగి దిగ్విజయంగా ఈనాడు మళ్ళీ ప్రతిష్ఠించబడింది.

గౌహతి స్వాధీనమైన తర్వాత చక్రధ్వజ సింహుడు ఒక రాజసభ నేర్పాటుచేసి సభాసదులందరియెదుట యుద్ధంలో చక్కగా పోరిన వీరులందరికి తగిన బహుమతులిచ్చి గౌరవించాడు. నాడు "లాచిత్ బడ్ ఫుకన్

యొక్క పరాక్రమం వల్లనే మనకు మన గౌహతి తిరిగివచ్చింది. ఇక నుండి నేను చాలా సంతోషంగా భోజనం చేయగల్గుతా" నని రాజు సభలో పొగడగా "మహారాజా! ఈ విజయం నా పరాక్రమం వల్ల లభించలేదు. మీ నేతృత్వంయొక్క, సైనికుల పరాక్రమముయొక్క ప్రతిఫల మిది. ఈ విధంగా విజయం లంభించటం అందరికీ సంతోషదాయకమే. కాని మన మొకవిషయాన్ని గుర్తుంచుకోవాలి. విజయోత్సాహముతో ప్రమత్తుల మై యుండరాదు. గౌహతి చేయిజారిపోయిన విషయం తెలిసిన వెంటనే ఔరంగజేబు పెద్దసైన్యాన్ని మరల తప్పక పంపుతాడు. దీనిని దృష్టి యందుంచుకొని మనం సంపాదించిన స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకొనేందుకు సర్వదా అప్రమత్తులమై అత్యధికంగా ప్రయత్నాలు జరపడం చాలా అవ సరం" అని లాచితుడు సమాధాన మిచ్చాడు.

శత్రునిర్మూలనం గావించి అస్సాం పూర్తిగా స్వాతంత్ర్యం పొందింది. కాని లాచితుడు దీనిని అంతిమ విజయంగా భావించలేదు. దేశాన్ని బానిసత్వాన్నుండి స్వతంత్రం చేయటం చాలా కఠిన సమస్య. కాని దానికంటె వచ్చిన స్వాతంత్ర్యాన్ని పరిక్షించుకోటానికి ఎక్కువ పరా క్రమము, దేశభక్తి అవసరం. గౌహతిపై విజయం వలన అస్సాం ప్రజల లోను, సైన్యంలోను మంచి ఆత్మవిశ్వాసం, చైతన్యం కలిగాయి. ఈ నవ చైతన్యాన్ని పురస్కరించుకొని రాష్ట్ర సంరక్షణకొఱకు సర్వదా సంసిద్ధ తగల బలగాన్ని నిర్మించాలని లాచితుడు నిర్ణయించాడు. అస్సామునకు పడమటివైపుని మొగలుల రాజ్యంతో సరిహద్దుగా 'మానహా' అనే నది ఉంది. ఈ పడమటి సరిహద్దు ప్రాంతాన్నంతటిని లాచితుడు స్వయంగా పర్యటించి పరీక్షించాడు, శత్రువులు దురాక్రమణచేస్తే సంరక్షించుకోటాని కేయే స్థలాలుపయోగపడతాయో, ఏయే స్థలాల్లో గోడలు కట్టించి ఉపయు క్తంగా చేయవచ్చునో ఆవిధంగా అన్నిటినీ తయారు చేయించాడు. ఆయా ప్రదేశములన్నిటికీ ధనధాన్య శస్త్రాస్త్రములు సమకూర్చబడు యేర్పాటు

గావించబడింది. రక్షకదళాలను ప్రతిచోటా యేర్పరిచాడు. సరిహద్దుల నుండి వార్తలు త్వరితగతిలో ఇతాఖురీలో తెలియపరచేటందుకు వీలుగా వార్తావాహక బృందాల నేర్పాటు గావించాడు. అస్సాంలో ప్రతి చిన్న భాగాన్నీ సంరక్షించేందుకు ఒక్కొక్క సైనిక దళానికి బాధ్యత యివ్వబడింది.

బ్రహ్మపుత్రానదికి దక్షిణాన శుక్రేశ్వర్, ఇతాఖురీ పర్వతాలమీద దక్షిణ విభాగ కేంద్రం ఏర్పాటు గావింప బడింది. సర్వసైన్యాధిపతి కార్యాలయంగూడా అచ్చటనే ఉంది. ఉత్తర భాగానగల ప్రదేశాన్ని చూసే బాధ్యత మహామాత్యులైన అతన్ బడ్ గోహిన్ డొంగరియాకు యివ్వబడింది. లతుమ, దో లక్ష లియా బారుడా కామాక్షి పర్వతంనుంచి ద్వారగరిలా వఱకు అధిపతి. ద్వారగరిలా నుండి పరాధోపా వఱకుగల ప్రదేశపు బాధ్యత బరచేన గోహాయీ కివ్వబడింది. ఇదే విధంగా బేతవార్ హాజరికా, లేకాయీచేటియా, నియోగ గోహాయీ, జ్యోతీచంద్ నామద యాగ్నియా రాజఖోవా, హత్రాయీ కాళియా, బారియా ఫుకన్, లక్ష్మణ్ మారంగి ఖోవా చోటియా, మాజూ అభయ పూరియా రాజఖోవా, మీరీ సందికై ఫుకన్, చారింగియా పేలన్ ఫుకన్, రూపసందికై మొదలగు సర్దారులూ, సేనానులు తమతమ సేనలతో వారికి కేటాయించబడిన ప్రదేశాలను సంక్షించుకోటానికి సంసిద్ధులైనారు. మొత్తం అస్సాం యుద్ధానికి తయారైన ఒక పెద్ద శిబిరంలా సిద్ధమైంది. విశుద్ధమైన దేశభక్తితో నిండిన ప్రజలు క్రమశిక్షణతో శత్రువుల నెదిరించే ప్రణాళికను స్వీకరించి, దేశరక్షణకొరకై తమ సర్వస్వాన్ని బలిదానం చేయుటకు ఎప్పుడు సిద్ధమౌతారో, ఎప్పుడు లాచిత్ బడ్ ఫుకన్ వంటి నిస్వార్థపరుడు, పరాక్రమవంతుడు నయిన నాయకుడు దానికి లభిస్తాడో-అప్పుడే ఆదేశంయొక్క స్వాతంత్ర్యం రక్షించ బడుతుంది. అప్పుడే దానిపైకి వచ్చే దురాక్రమణదారులకు సమాధులు కట్టబడతాయి.

క్రీ. శ. 1667 వ సంవత్సరం తమసేనలు గౌహతిలో అపజయం పొందాయనీ, గౌహతి తమ చేతినుండి జారిపోయిందనీ తెలిసి ఆగ్రాలో ఉన్న ఔరంగజేబు చాలా బాధపడ్డాడు. క్రీ. శ. 1666 వ సంవత్సరారంభము నుండి దక్షిణ హిందూదేశమును జయించుట అతనికి సాధ్యం కావటంలేదు. ఆ సంవత్సరం మధ్యలో అతడు శివాజీని ఆగ్రాలో బందీగా చేసాడు. కాని శివాజీ మహారాజు కొలది రోజులలోనే ఆగ్రానుండి పారిపోయి: దక్షిణానగల తన రాజ్యాన్ని చేరుకోగల్గాడు. ఈ అవమానం ఔరంగజేబును ఒక మూల బాధిస్తూ ఉంది. అస్సాంను మొగలు సామ్రాజ్యములో కలుపుకోటానికి జహంగీరు కాలమునుండి జరిగిన ప్రయత్నాలు విఫలమవడమేకాక, చేజిక్కిన గౌహాతినిగూడ ఔరంగజేబు పోగొట్టుకున్నాడు. అస్సాం విషయములో యేమి చేయాలనే ప్రశ్న మరల ఆతని యెదుట నిలచింది. అప్పుడు బంగాళములో మొగలు సుబేదారుగా ఔరంగజేబు మేనమామ షయిస్తఖాను ఉండేవాడు. అతడు చాల పరాక్రమవంతుడు. కాని క్రీ. శ. 1663 లో శివాజీపై దాడి జరిపినపుడు ప్రాణభయంతో పారిపోయాడు. అప్పుడతని కుడిచేతి మూడువ్రేళ్ళు ఖండించబడ్డాయి. అతడిప్పుడు అస్సాంమీద దాడిచేసేందుకు సంసిద్ధంగా లేడు. ఔరంగజేబుకు కూడ అతనిని పంపించుట కిష్టములేదు. అందువలన ఆంబర్ రాజు జయసింగుయొక్క కుమారుడైన రామసింహుని పంపాలని ఔరంగజేబు భావించాడు. అందుకు చాలా కారణాలున్నాయి. కర్తృత్వపరాయణత, మహత్వాకాంక్ష కల్గిన వ్యక్తులకు తనకంటే ఎక్కువ పలుకుబడి వస్తుందనే భయంతో, ఔరంగజేబు వారి నెప్పుడూ ఢిల్లీ, ఆగ్రాల సమీపంలో ఉండనిచ్చేవాడు కాదు. రెండవ కారణమేమంటే శివాజీ ఆగ్రానుండి పారిపోవటానికి రామసింహుడు సహాయము చేశాడని అతని కనుమానం. ఇక మూడవ కారణం: అస్సాం యుద్ధంలో రామసింహుడు మరణిస్తే ఔరంగజేబుకు తనమార్గమున కడ్డు తొలగిపోయినట్లవుతుంది. ఒక వేళ గెలిస్తే

హిందూ రాజపుత్రులయొక్క శౌర్యమువలన వాళ్ళ రక్తమే ఖర్చు అయి అస్సాం మొగలురాజ్యంలోకి వస్తుంది. ఇప్పటివరకు అస్సాం యుద్ధంలో చాలామంది సర్దారులు చంపబడ్డారు. హిందువులను హిందువులతోటి యుద్ధాలు చేయించి హిందూసామర్థ్యాన్ని నాశనము చేసే కుతంత్రము ఔరంగజేబు చాలా సంవత్సరాలనుండి నడుపుతున్నాడు. హిందువుల దుర దృష్టంవలన యిట్టి కుతంత్రాలకు అతని కనేకమంది రాజపుత్ర హిందువులు ఎప్పటికప్పుడు దొరికేవారు.

రామసింహుని అస్సాంమీదకు పంపాలని నిర్ణయించి, బంగారుపిడి ఉన్న ఒక ఛురిక నతనికి ఇచ్చి గౌరవించి, ఔరంగజేబు అతనిని అస్సాం మీద దాడిచేయటానికి సేనాధిపతిగా నియమించాడు. 30,000 పదాతిదళం, 18,000 గుఱ్ఱపు దళం. 15,000 ఫిరంగిదళం అతనికి ఇవ్వబడ్డాయి. కాని ఒక హిందూసర్దారుని ఇంకొక హిందూరాజుమీదకు పంపిస్తున్నప్పుడు వారిద్దరు కలిసిపోతారేమో ననే భయం ఔరంగజేబు మనస్సులో ఎప్పుడూ ఉండేది. అందువలన కొందరు ముస్లిం సర్దారులనుకూడా ఆ హిందూ సర్దారునితో గూఢచారులుగా అతను పంపించేవాడు. ఈ దృష్టితోనే అతడు రషీద్‌ఖాన్, మీర్జా సయ్యద్ దివాన్, మీర్ రాజ్ దివాన్, బహలోల్‌ఖాన్, దారోగా మొదలైన వారిని రామసింహునితో జతచేసి పంపించాడు.

ఇక్కడ లాచితుని గూఢచారులు మొగలుసేన ఆగ్రానుండి అస్సాం వైపు బయలుదేరినదనేవార్తను చేరవేశారు. అట్లా సైన్యం వస్తుందని లాచితుడు ముందే ఊహించాడు. ఈ సమాచారం అందిన తర్వాత అందరూ తీవ్రంగా యుద్ధ సన్నాహాలు చేయసాగారు. గుంటలు త్రవ్వి కంచకాలు తయారుచేశారు. బురుజులపై ఫిరంగుల నెక్కించారు. శస్త్రాస్త్ర ములతో నిండిన యుద్ధనౌకద్వారా బ్రహ్మపుత్రానదిలో రక్షణపని ప్రారంభ మైంది. క్రొత్త క్రొత్త కోటగోడలు కట్టడం మొదలైంది. క్రమశిక్షణ

విషయంలో చాలా శ్రద్ధ తీసుకోబడేది. ఎవరేపని నేవిధంగా ఎంత సమయంలో చేయగలరో ఆలోచించి ఆజ్ఞలివ్వబడేవి. ఆజ్ఞానుసారంగా ప్రతిపనీ జరిగి తీరవలసిందే. పనిలో వెనుకంజ వేసినవారికి కఠినశిక్ష విధింపబడేది శిక్ష విధించడంలో అందరికీ సమానమైన నియమాలుండేవి. తరతమ భేదము లేవీలేవు. అధికారులకు దగ్గరిబంధువులైనప్పటికీ అవే శిక్షలు. గౌహతి వద్ద గల ఉత్తరవుటొడ్డున "అమీన్‌గావ్" అనే గ్రామంలో పెద్ద గోడ కట్టవలసిన బాధ్యత లాచితుని మామ కివ్వబడింది. పని పూర్తి చేయుటకు సమయం నిర్ణయించి తెల్పడమైనది. తన అల్లుడు సేనాపతిగా ఉన్నాడనే ధీమాతో అతడు పనిని నిర్ణీత సమయంలో పూర్తిచేయలేదు. తన అల్లుడు తనకు శిక్ష లేకుండా తప్పించగలడని అతడనుకొన్నాడు. యుద్ధ సమయంలో ఈ విధంగా పని చేయనివారికి నియమప్రకారం మరణదండన విధించవలసి ఉంది. తన మామ పని పూర్తి చేయలేదని తెలిసి లాచితుడు అతనికి నియమప్రకారం మరణదండన విధించాడు. అప్పుడు మిగతా సైనికులు లాచితునితో మామగారి కంత కఠిన శిక్ష విధించుట వలదనీ, మొదటి తప్పుగా క్షమించవలసిందనీ బ్రతిమాలారు. ఆ మాటలు వినిన లాచితుడు కోపంతో "దేశాన్ని అమ్మి, మామను నేను రక్షించమంటారా? దేశంకన్న మామ ముఖ్యుడుకాడు. ఈపనికి శిక్ష విధించకపోతే సైనికుల క్రమశిక్షణ నశిస్తుంది. యుద్ధసమయంలో సరిగ్గా సమయానికి పనులు జరుగని పక్షంలో మనదేశ స్వాతంత్ర్యాన్ని మనం కాపాడుకోలేం"! అన్నాడు. అటుపిమ్మట లాచితుని మామకు శిరచ్ఛేదం గావింపబడింది. సైనికులకు క్రమశిక్షణ అంటే యేమిటో అర్థమైంది. లాచితుడు చక్కటి దేశభక్తుడు. ఆదర్శవంతమైన సేనాపతికూడా. అతని సూక్ష్మ దృష్టి అన్నివైపులా ప్రసరించేది. అతడు అశ్వారూఢుడై అంతటా పర్యటిస్తూండేవాడు. అతని క్రమశిక్షణా ప్రభావం అన్నిచోట్లా కన్పించేది.



కర్తవ్యాన్ని నెరవేర్చని మామాకు మరణదండన విధిస్తున్న లాచితుడు

ఆగ్రా నుండి బయలుదేరి రామసింహుడు సేనా సహితంగా బంగాళాప్రాంతాని కప్పుడు రాజధానియైన ఢాకాకు చేరాడు. అక్కడ సుబే దారుగానున్న ఔరంగజేబు మామ షయిస్తఖాను రామసింహుని గౌరవించి స్వాగతమిచ్చాడు. తనవద్దనున్న సైన్యంలో యిరువదివేల సైన్యాన్నికూడ అతని వెంట పంపాడు. షయిస్తఖానుకు అస్సామంటే చాలా భయం. అస్సాంలో లోగడ జరిగిన యుద్ధాలలో వెళ్ళిన సేనాపతులకు ఏగతి పట్టిందో వివరాలతో సహా అతడు రామసింహునితో చెప్పాడు. నదులు, గుట్టలు, పర్వతాలు, అడవులు, విషపు జంతువులు కలిగిన దుర్భేద్య వాతావరణ మనుంటుంది కాబట్టి మొగలు సైన్యానికి చాలా కష్టాలు సంభ వించవచ్చనిగూడా అతడు సూచించాడు. అటువంటి వాతావరణంలో యుద్ధాని కలవాటుపడిన అస్సాం హిందూసేన మొగలులను చాలా పీడిస్తుం దనికూడా షయి స్తఖాను రామసింహుని హెచ్చరించాడు. ఆస్సాంలో గొప్ప మాంత్రికులు చాలామంది ఉన్నారని రామసింహునికి మున్ముందుగానే తెలుసు. అందుకే వారి చర్యలకు ప్రతిక్రియ జరుపుటకు ఢిల్లీనుండి కొంత మంది అవలియావారిని (మంత్రగాండ్రను) రామసింహుడు తనవెంట తెచ్చు కున్నాడు.

పాదుషాసైన్యము ఢాకానుండి బయలుదేరి అస్సాం సరిహద్దుల వరకు వచ్చింది. ఈ సైన్యంతో సమతల మైదానంలో యుద్ధంచేయటం తనశక్తికి మించిన విషయమని తెలిసి కొని లాచితుడు సరిహద్దు సమీపం లోగల తనసేనను కొలది వెనుకకు తీసుకొనిపోయి గుట్టల మధ్య దాచి ఉంచాడు. హిందూసేన ఇట్లా వెనక్కు మరలడం చూచి వారు భయపడి పోయారని భావించి రామసింహుడు సేనాసహితంగా సరిహద్దు లోపలికి వెళ్ళాడు. బ్రహ్మపుత్రానదిలోనుంచి తనసేన నతడు హాజోవరకు తీసు కొనివచ్చి, అచ్చట తన సేనా శిబిరమేర్పరచుకొన్నాడు. దీనివలన లాచి

తుని పన్నాగం సఫలమయింది. తనకెక్కువ నష్టం కలుగకుండా హాజోలో నున్న శత్రువులను దెబ్బకొట్టగల చక్కటి అవకాశ మతనికి లభించింది. రాత్రి చీకటిలో రామసింహుని శిబిరముపై లాచితుడు ఆక్రమణలు చేయసాగాడు. గుట్టలనుండి బయలుదేరి అస్సాం సైనికులు మొగలు శిబిరముమీద ఆకస్మికంగా దోపిడీచేసి మరల తిరిగి గుట్టలలోనికి పారిపోయేవారు. మొగలు సేన యుద్ధసన్నాహాలు చేసేలోపుగానే వారు గుట్టలతో నిండిన ప్రదేశము, దట్టమైన అడవి, యోజనాత్మకముగా నిర్మింపబడిన కోటలు; పెద్దపెద్దగోడలు చూచిన రామసింహునికి భయ, సంభ్రమాశ్చర్యాలు కల్గాయి. అస్సాం యుద్ధంలో జయముపొందగలనన్న విశ్వాసం పూర్తిగా సన్నగిల్లింది. ఇది యిట్లాఉండగా మొగలు సర్దారులలో అంతః కలహ మారంభమయింది. రామసింహునితో పంపబడిన రషీద్‌ఖాన్ రామసింహుని యాజ్ఞ పాలించడం మానివేశాడు. తన ఆధిక్యతను సూచించే విధంగా తన ఆగమనమును సూచించే ఢంకా మ్రోగించుట ప్రారంభించాడు. రషీదుఖాన్ తాను రామసింహునితో సమానుడనని భావించేవాడు. ఇట్లా మొగలు సైన్యాధిపతులిద్దరైనారు. ఎవరి ఆజ్ఞను పాలించవలసిందీ సైనికుల కగమ్యగోచరంగా తయారైంది. సమశీతలప్రదేశ వాతావరణాని కలవాటుపడిన మొగలు సైనికులకు పర్వతమయమై, వర్షాధిక్యతగల ఈ ప్రదేశంలో నివసించటం దుస్సాధ్యమయింది. సేనలో చాలామందికి జబ్బుచేసింది. ఈ పరిస్థితిని గమనించిన రామసింహుడు ఆక్రమణను త్వరితంగా పూర్తిచేయాలని సంకల్పించాడు.

బ్రహ్మపుత్రకు దక్షిణపుటొడ్డునగల పాండు కోటగోడను పడగొట్టడంలో మొగలులు సఫలీకృతులైనారు. కాని దానిని మరలా కట్టించాడు

రాణీ రాజు. గౌహతి చుట్టునున్న కోటలను ఆక్రమించుకోటానికి మొగలాయీలు ప్రయత్నించారు. కాని వారి ప్రయత్నాలన్నీ విఫలమైనాయి. రాణీ రాజు చాలామంది మొగలు సైనికులను బంధించి వారి వ్రేళ్ళను నరికి లాచితుని దగ్గరకు పంపించాడు. దీనితో క్రమక్రమంగా మొగలు సేన అస్తవ్యస్తం కాసాగింది.

క్రీ. శ 1669 జులై నెలలో జయాపజయాలను నిర్ణయించే అంతిమ యుద్ధంచేయాలని రామసింహుడు నిశ్చయించాడు. అందుకై ముందుగా మొగలుసేనకు స్ఫూర్తినివ్వగల ఏదోయొక పోరాటంలో గెలుపు లభించటం అవసరమని అతని యభిప్రాయం. ఈ దృష్టితో అతడు కాజ్లోరకోటపై దాడి చేశాడు. కానిఆ దుర్గాధిపతియైన మీరి సందికై ఫుకన్ దృఢంగా ఎదుర్కొన్నాడు. తనవద్ద బహుకొద్ది సైన్యమే ఉన్నప్పటికీ ఫుకన్ తొమ్మిదిరోజులు యుద్ధంచేసి మొగలు సేనను వెనుకకు తరిమివేశాడు. అంతట రామసింహుడు రెండువేల అశ్వికదళమును, రెండువేల పదాతిసైన్యమును, రెండువందల ధనుర్విద్యా పారంగతులను వెంటబెట్టుకొని గౌహతి ముందుభాగానగల "బాహంబారి" కోటమీద దాడిచేశాడు. అచ్చట స్వయంగా లాచితుడే అతనితో యుద్ధముచేసి, అతని సైన్యము ఒక సన్నని కొండ కనుమలోకి వచ్చేటట్లు చేశాడు. ఆ కనుమలో చిక్కుకొనిపోయిన మొగలుసైన్యంపై నలువైపులనున్న కొండలమీదినుండి అస్సామీ సైనికులు హఠాత్తుగా దాడి జరిపారు. వందలాది మొగలుసైనికులు చంపబడ్డారు. మిగిలినవారు పారిపోయారు. ఈ యుద్ధంలో బడ్ ఫుకన్‌కు చాలా ఫిరంగులు, శస్త్రాస్త్రాలు దొరికాయి.

ఈ విజయోత్సాహంతో అస్సామీ సైన్యం దిదింగియా ఫుకన్ నేతృత్వంలో ఆగియా ఖుంటిలోనున్న మొగలు శిబిరంమీద నీటిపైనుండీ భూమిపైనుండీ దాడి చేసింది. ప్రారంభంలో అస్సామిసైన్యం గెలు

పొందింది. కొంతసేపటికి రామసింహుడు స్వయంగా యుద్ధస్థలికి వచ్చి, నూతన పద్ధతిలో సేనావ్యూహరచనచేసి, తిరిగి దాడిచేశాడు. తత్ఫలితంగా భూమిమీదనున్న అస్సామీసేనకు నదిలోనుండి పోరాటం చేసే సేనకు సంబంధాలు త్రెంచివేయబడ్డాయి. అంతట భూమిమీదనున్న అస్సామీ సేనను రామసింహుడు పూర్తిగా ఓడించాడు. నదిపైనుండి పోరాడుతున్న అస్సామీ సైనికులు చాలామంది చంపబడ్డారు. ఈ పరాజయంతో మహా రాజు చక్రధ్వజ సింహునికి చాలా బాధకల్గింది. కాని ఆగియా ఖుంటిలో పొందిన విజయానందము మొగలుసైనికు లెక్కువ కాలము అనుభవించ లేక పోయారు. అప్పుడే ప్రారంభమయిన అధికవర్షములచేత నదులు పొంగి ప్రవహించుటచే మొగలు శిబిరములమధ్య సంబంధాలు తెగి పోయాయి. సేనకు కావలసిన ఆహార పదార్థములు అందడం కష్టమయింది. ఏదో విధంగా పంపించే పదార్థాలను మార్గ మధ్యంలో అస్సామీ సైనికులు దోపిడీ చేసేవారు. వృక యుద్ధ పద్ధతిలో మొగలు శిబిరములమీద దాడి చేయటంలో అస్సామీయులు సిద్ధహస్తులే గదా!

రామసింహుడు బ్రహ్మపుత్రకు ఉత్తరపుటొడ్డుననున్న రంగ మహల్ అనే కోటమీద దాడిచేశాడు. అతనిసేన ముందుకు పోతూవుంది. అతడు గుట్టమీద నిలబడి చూస్తూన్నాడు. మొగలుసైన్యాన్ని ఎదుర్కొ నేందుకు సిద్ధపడుచున్న గోహాయి ఫుకన్ తనసేనచుట్టు ఏనుగులను నిల బెట్టి సైన్య రక్షణకొఱకు చేసిన వ్యూహ మతని దృష్టికి గోచరమయింది. ఆ వ్యూహరచనను చూచి రామసింహు డానందాశ్చర్యాలు పొందాడు. అతడు 'భక్తదా' యను నౌకదూతతో నొక సమాచారము గోహాయి ఫుకన్‌కు పంపించాడు. 'నేను నిన్ను కలిసికొన గోరుచున్నాను. నీశౌర్యం చూడదలచుకొన్నాను' అని అందులో ఉంది. అందుకు ప్రత్యుత్తరంగా గోహాయి ఫుకన్ "నేను, నాతో యున్న ఇరువదివేల సైనికులు మీమొత్తం

సైన్యాన్ని హతమార్చి కొద్దిసమయంలో మాశౌర్యం మీకు చూపిస్తాం. మరి వేరే కలయిక అవసరంలే" దని వార్త పంపాడు. తదుతరి ఘోర యుద్ధంలో మొగలులు పూర్తిగా ఓడిపోయారు.

యుద్ధంచేసి అస్సామీ హిందువులమీద గెలుపొందుట అసంభవమని తలంచి రామసింహుడు భేదోపాయ మాలోచించాడు. లాచిత్ బడ్ ఫుకన్‌ను సంబోధించి ఒక ఉత్తరమును వ్రాస్తూ "లాచిత్ బడ్ ఫుకన్! నిన్న నీవు నాదగ్గరనుండి లక్షరూపాయలు తీసుకొని మా మొగలుసేన మీద దాడి చేయనని వాగ్దానం చేశావుకదా! కాని నీ సైన్యాన్ని నేటివరకు విరమింప జేయలేదు. త్వరలో నేవు నీమాట నిలబెట్టుకొని గౌహతియొక్క మార్గమున మాకడ్డంకి లేకుండా చేయగలవని ఆశిస్తున్నాను." ఈ ఉత్తరమును తీసి కొనిపోతూన్న దూత తనంతట తానే సర్దారు మీరి సందికై ఫుకన్ చేతిలో బందీయయినాడు. ఉత్తరమును చదివిన మీరిసందికై ఫుకన్ మనస్సులో సందేహం కల్గింది. ఆ ఉత్తరాన్ని అతడు రాజుకడకు పంపించాడు. దానిని చూచిన రాజు కోపోద్రిక్తుడై "లాచితుడు శత్రువుకు సహాయం చేసేందుకు సంసిద్ధుడైనాడా" అని ఆక్రోశించాడు. అటు పిమ్మట రాజు తన మహా మంత్రియైన అతన్ రుక్మబడ్ గోహిన్‌కు ఆ ఉత్తరమును చూపించాడు. మహామంత్రి శత్రువుల కుట్రను అర్థం చేసికొని రాజుతో "మహారాజా! లాచిత్ విషయములో మనము సందేహించవలసిన పని యేమీలేదు. యుద్ధంలో గెలువలేక భేదోపాయముద్వారా అస్సాం సేనాపతి విషయంలో అస్సామీయులలో సందేహం అవిశ్వాసం కలుగజేసేందుకు ఇది శత్రువు యొక్క కుతంత్రము మాత్రమే అని గుర్తించండి. సూర్యుడు పడమటి దిక్కున ఉదయించవచ్చుగాని లాచితుడు శత్రుసహాయం చేయటం మాత్రం జరుగనిపని." మహామాత్యుని మాటలు రాజుకు కూడా నచ్చాయి. ఇలా ఆ ఉత్తరమును పంపించుటలోని రామసింహుని ఉద్దేశ్యం విఫల

మయింది. అప్పుడు రామసింహుడు మరి ఒక ఉత్తరం లాచితునికి వ్రాస్తూ అందులో మహారాజును తనతో ద్వంద్వ యుద్ధాని కాహ్వానించాడు. ఆ యుత్తరం చూచిన మహారాజునకు కోపం వచ్చింది. అతడు రామసింహుని సంబోధిస్తూ "నిన్ను నీవు మీర్జారాజా జయసింగ్ పుత్రుడవుగా భావిస్తున్నావు. కాని నీవు మొగలులకు దాసుడవు మాత్రమే. నీవు రాజువుకావు. నీ మీద రాజుకుండవలసిన ఛత్రం లేదు. నేను ఛత్రపతులైన రాజులతో మాత్రమే ద్వంద్వ యుద్ధం చేస్తా" నని జవాబిచ్చాడు. అప్పటినుండి రాజా చక్రధ్వజ సింహుని మనస్సులో మొగలులకు తీరిన నష్టము కల్గించి వారిని త్వరలోనే వెనుకకు తరిమివేయాలనే ఆలోచన గట్టిగా నాటుకొంది.

అప్పుడు రామసింహుని శిబిరము అలాబాయి అను కొండదగ్గర ఉంది. ఆలాబాయి కోటలో అస్సామీయులున్నారు. రామసింహుడు మీర్ నవాబుకు పెద్దసైన్యాన్నిచ్చి ఆ కోటవైపుకు పంపించాడు. ఆకోటముందొక పెద్ద మైదాన ముంది. రామసింహుడు లాచితునికి "నీవు దాగియుండి యుద్ధమెందులకు చేస్తావు ధైర్యసాహసములుంటే రణరంగములోనికి వచ్చి యుద్ధముచేయుము"ని సవాలుచేస్తూ కబురంపాడు. మహారాజు చక్రధ్వజ సింహుడుకూడ త్వరగా యుద్ధము చేయవలసినదేనని లాచితుని తొందర చేయసాగాడు. చివరకు లాచితుడు ఇరువదివేల సైన్యాన్నిచ్చి చారింగియా పేలన్ పుకన్‌ను యుద్ధం చేసేందుకు పంపాడు. అతనివెంట ఓపరద యాగ్నియా రాజఖోవా, దిఖౌముఖియా రాజఖోవా, నామదయాగ్నియా రాజఖోవా అను ముప్వురు సేనానులను పంపించాడు. రామసింహుడు తన సేనకు ముందు మదనావతి యను నొక రాజపుత్ర స్త్రీ నుంచాడు. స్త్రీని చంపటం అస్సామీయులకు తీవ్రమైన అగౌరవం. కాబట్టి చంపితే అవమానం కలుగుతుంది. చంపకపోతే రామసింహుని సైన్యం ముందుకుపోవుటకు అవకాశం లభిస్తుంది. చారింగియా పుకన్ కూడా అసాధ్యుడే. అతడు తన ధనుర్ధారులకు, మరికొంతమంది సైనికులకు బ్రాహ్మణవేషం వేయించి

తన సేనముందుంచాడు. బ్రాహ్మణులమీద ఆక్రమణ జరుపుటకు రామ సింహుడు మీర్ నవాబును ఆజ్ఞాపించలేకపోయాడు. అప్పుడు బ్రాహ్మణ వేషధారులైన ఆ సైనికులు ముందుకుపోయి తమ శస్త్రాస్త్రాలను బయటకు తీసి అకస్మాత్తుగా మొగలులపై దాడిచేశారు. భీషణమైన యుద్ధం జరిగింది. ఇరుపక్షాల వారూ చాలమంది చనిపోయారు. అప్పుడస్సామీ సైన్యంయొక్క ముందుభాగం బాగా దెబ్బతిన్నది. అయినా అస్సామీ ధనుర్ధారులు బాగా విజృంభించి మొగలు సేనా వ్యూహాన్ని భగ్నం చేయగలిగారు. మదనావతి కూడా ఒక శరాఘాతంతో నేలకూలింది. మీర్ నవాబు బంధింపబడి లాచి తుని సమక్షంలోకి తీసుకొని రాబడ్డాడు. ఇలా రణరంగంలో విజయం పొంది ఖైదీలను, యుద్ధసామగ్రిని వెంట బెట్టుకొని అస్సాంసేన కోటవైపు బయలుదేరింది. ఈ ఓటమిని రామసింహుడు సహించలేకపోయాడు. అతడు తనవద్దనున్న అంగర్‌కు చెందిన ప్రత్యేకమైన గుఱ్ఱపు సవారీ దళం వెంట బెట్టుకొని స్వయంగా కోటవైపుపోయి అస్సాంసేనపై దాడి చేశాడు. అస్సాంసేన చాలా అలసిపోయిన స్థితిలో ఉంది. రామసింహుని అశ్వికదళం అప్పుడే రణరంగంలోకి క్రొత్తగా దూకింది. తత్ఫలితంగా వారు పదివేలమంది అస్సామీయులను చంపి తమచేతినుండి జారిపోయిన విజయశ్రీని తిరిగి సంపాదించుకోగల్గారు. ఈ విధంగా అలాబాయి మైదా నంలో మొట్టమొదటిసారిగా గెలిచినప్పటికీ అస్సామీయులు చివరికి ఓడి పోయారు. కోటమీద నిలబడియున్న లాచితుడు ఈ భీషణ దృశ్యం చూచి చాలా బాధపడ్డాడు. ఇంతలో లాచితుని భుజముపై చేయిపడ్డది. "స్వా తంత్ర్య లక్ష్మికి సహస్రాధిక శిరోపద్మములిలా అర్పించవలసి వుంటుంది. ఇప్పటికీ మన కోటలు, దుర్గమమైన పర్వత స్థలాలు మన చేతుల్లోనే వున్నాయి. స్వాతంత్ర్యం కోసం జరిపే యుద్ధంలో ఈ చిన్న పోరాటంలో మనకోటమి సంభవించింది; అందుకు మనమేమీ విచారించనవసరంలేదు" అని ఓదార్పుమాటలు వెనుకనుంచి వినిపించాయి. లాచితుడు వెనుకకు తిరిగి చూశాడు. ఆవ్యక్తి స్వయంగా మహామాత్యులే!!

పొందిన విజయం వలన రామసింహునకు ఉత్సాహం లభించింది. అతను లాచితుని కొక ఉత్తరం వ్రాసి పంపాడు. లాచితుడు గౌహతిని వదలిపెట్టి రామసింహుని కిచ్చివేయవలసిందిగా దానిలో అతడు కోరాడు. లాచితుడు దానికి ప్రత్యుత్తరంగా "మహారాజు చక్రధ్వజ సింహుని యాజ్ఞ లేకుండా నేనొక్క అంగుళం భూమైనా ఇవ్వ"నని వ్రాశాడు. ఓడిపోయినప్పటికీ యుద్ధవిరమణ చేయటానికి అస్సాంవారు సిద్ధంగాలేరని రామసింహుని కర్థమయింది. అస్సాం సర్దారులకు వస్త్రాభరణాలు, ధనం పంపించి ప్రలోభంద్వారా వారిని తనవైపుకు త్రిప్పుకొనేందుకు రామసింహుడు ప్రయత్నాలు ప్రారంభించాడు. లాచితునకుకూడ ఒక అమూల్యమైన రత్నహారం పంపాడు. కాని యిటువంటి ప్రలోభాలకు లొంగి అస్సామీయులు దేశద్రోహం చేసేందుకు సిద్ధపడలేదు. అయినా విజయం లభించాక రామసింహునకు మళ్ళీ యుద్ధము చేసే ఉత్సుకతలేదు. అస్సాం వారు యుద్ధంతప్ప మరిదేనికీ అంగీకరించడంలేదు. మరి యే యితర మార్గం తోచక చివరకు రామసింహుడు పెద్దయెత్తున ఆక్రమణచేసి అస్సాం సేనను పూర్తిగా మళ్ళీ ఓడించాలని అనుకున్నాడు.

బడ్ ఫుకన్ యొక్క ముఖ్యసేనా కేంద్రం ఇతాఖురీలో వుంది కామాక్షి గుట్టలమధ్య అంధారుబాలి యనబడే ఒక యిసుక ప్రదేశముంది. ఈ యిసుక ప్రదేశాన్నానుకొని ఇతాఖురీ. గౌహతికూడా ఉన్నాయి. ఇవన్నీ బ్రహ్మపుత్రకు దక్షిణపుటొడ్డున ఉన్నాయి. ఇతాఖురీ కెదురుగా నదియొక్క యుత్తరపుటొడ్డునగల అశ్వక్రాంతమందిరం అస్సామీయుల చేతిలోఉంది. ఈ మందిరానికి పడమటివైపునగల భాగం మొగలుల చేతిలో ఉంది. అచ్చటనే ఉన్నురురాయి రేవులో మొగలాయిల యుద్ధనౌక లున్నాయి. ఈ యుత్తరపుటొడ్డు నుండి ఫిరంగులు ఇతాఖురీ, అశ్వక్రాంతంవైపు త్రిప్పి, ఉరురాయి రేవుమీదనున్న నౌకలలోకి గుళ్ళవర్షం కురిపించి దళాన్నెక్కించి అంధారుబాలి యిసుక ప్రదేశంమీద వారిని దించాలని రామసింహుడు

యోచించాడు. అచటినుండి యీ ఆశ్వికదళంతో ఇతాఖురీమీద దాడిచేయాలని అతని యుద్దేశం. ఇదివరలో అలాబాయిలో జరిగిన యుద్ధంలో యీ ఆశ్వికదళంవల్లనే మొగలులకు జయం ప్రాప్తించింది. తమను ఓడించిన ఈ దళమంటే అస్సాంవారికి భయం, మొగలులకు ఆత్మవిశ్వాసం ఏర్పడ్డాయి. తానుచేసిన యీయోజన తప్పక సఫలంకాగలదనేనమ్మకం రామసింహునకు కల్గింది.

సరిగా యిదే సమయానికి అనగా క్రీ. శ. 1670 ఏప్రిల్ నెలలో మహారాజా చక్రధ్వజ సింహుడు మరణించాడు. అతని తరువాత ఉదయాదిత్యుడు మహారాజుగా సింహాసన మెక్కాడు. చాలా దినాలనుండి శ్రమపడుతున్నందువలన లాచితుని ఆరోగ్యం చెడిపోయి, బాగా జ్వరమువచ్చి సుస్తీ చేసి అతడు ఇతాఖురీకోటలో మంచం పట్టాడు. ఇదే తగిన అదనుగా భావించి అస్సాము నాక్రమించుకొనేందుకు రామసింహుడు ఇద్దరు ఐరోపా వారిని, ఐదుగురు మొగలు సేనాపతులను వెంటపెట్టుకొని ఝురాయి రేవు పట్టణానికి వచ్చాడు. అచ్చట భారీయెత్తున యుద్ధ ప్రయత్నా లారంభమైనాయి. అశ్వికదళ మచ్చటికి చేరింది. మొగలు యుద్ధ నౌకలలో ఆశ్వికదళమును తీసికొనివచ్చి యుద్ధానికేగుటకు తగిన ఏర్పాట్లు గావింపబడ్డాయి. అప్పుడు లాచితునకు బాగా జ్వరం తగిలివుంది. మొగల్ గుఱ్ఱపు దళమంటే అస్సాంవారి మనస్సుల్లో చాలా భయం. ఆ గుఱ్ఱపుదళం నౌకలనుండి వచ్చి ఇతాఖురీమీద పడనున్నదనే వార్త అస్సామీవారికి తెలిసింది నౌకాయుద్ధంలో అస్సామీయులు మంచి నేర్పరులు నౌకలనుండి గుఱ్ఱపు దళం వస్తూంటే నౌకా యుద్ధంలో నదిలోనే మొగలులను వారోడించవచ్చును. కాని గుఱ్ఱపుదళ మంటే ఏర్పడ్డ భయంవలన ఈ ఆలోచనే అస్సామీ సర్దారులకుగాని, సైనికులకుగాని తోచలేదు. పైగా వారి సైన్యాధిపతిగూడ లేవలేని స్థితిలో నున్నాడు. ఇట్టి అవాంతర పరిస్థితిలో నౌకలపై తూర్పుదిశగా పారిపోవటం ఉత్తమ మార్గమని అస్సామీ సర్దారులు భావిం

చారు. వారలాచేస్తే గౌహతి మొగలుల చేతజిక్కటం తప్పదు. ఇంతవరకు వారుచేసిన యుద్ధమంతా విఫలమౌతుంది. అయినప్పటికీ మొగలుల గుఱ్ఱపు దళంయొక్క భయంవలన అస్సామీయులు పారిపోవటానికే సిద్ధపడ్డారు. ఆదేతలంపుతో సర్వసైన్యాధిపతియగు బడ్ ఫుకన్, మహామంత్రియగు అతన్ బడ్ గోహిన్‌ల నౌకలమీదనున్న సామగ్రి నంతటిని దాటవేయుటకు తలపడ్డారు. ఈ విషయం శయ్యాగ్రస్తుడైన లాచితునకు తెలిసింది. కొద్ది సేపటిలో గుఱ్ఱపు సవారిదళం వెంట తీసికొని మొగలు నౌకాదళం ఝరాయి రేవునుండి బయలు దేరనున్నదనే వార్తకూడ లాచితుడు విన్నాడు.

ఈ పరిస్థితిలో తన సైన్యం పారిపోతే గౌహతి మాత్రమేకాక పూర్తి అస్సాం మొగలుల వశం కాగలదని లాచితుడు గ్రహించాడు. వెంటనే ఆ సుస్తీ చేసిన స్థితిలోనే తనను నిరీక్షణ బురుజుపైకి తీసికొని పోవలసిందిగా తన పరిచారకుల నాజ్ఞాపించాడు. లాచితునకు లేవడానికికూడా శక్తి లేదు. అతనిని మంచముమీదనుంచియే నిరీక్షణ బురుజుపైకి తీసికొని పోయారు. అక్కడినుండి బ్రహ్మపుత్రానది మీదనున్న సైనికులను చూచినవెంటనే మొగలులపై తానే స్వయంగా అక్రమణ జరపాలని లాచితుడు నిర్ణయించాడు. తక్షణమే యుద్ధవస్త్రాలు ధరించి కోటదిగి తన నౌకమీదికెక్కాడు. ప్రక్కనున్న ఏడెనిమిది యుద్ధనౌకలను ఝరాయి రేవువైపు యుద్ధానికి బయలుదేరాలని ఆజ్ఞాపించాడు. వారంతా తూర్పు వైపు పారిపోయే ప్రయత్నంలో నున్నారు. సేనాపతి ఆజ్ఞ వినికూడా వారేమీ చేయకుండా ఆయోమయ స్థితిలో పడ్డారు. ప్రత్యక్షంగా తన నౌక మీదనున్న కొందరు నావికులుకూడా పారిపోయే ప్రయత్నంలో కన్పించారు లాచితునికి, అప్పుడతనికి కోపం వచ్చి గట్టిగా ఇలా చెప్పాడు, "నేను సర్వసైన్యాధిపతిని, నా ఆజ్ఞ ప్రకారంగా అన్ని యుద్ధ నౌకలు ఝరాయి రేవువైపు యుద్ధానికి బయలుదేరాలి. ఎవరూగాని తూర్పువైపు

వెళ్ళరాదు." లాచితుడు తన సైనికులను బాగా మందలించాడు. అయినప్పటికీ కొందఱు పరాకుగా నున్నట్లు గమనించి యిద్దరు ముగ్గురిని అతడు స్వయంగా నీటిలోకి పడద్రోశాడు. సర్వసైన్యాధిపతి సుస్తీచేసిన స్థితిలోకూడంస్వయంగా యుద్ధనౌకమీదకు వచ్చి భయపడే నావికు-ను నీటిలోకి నెట్టిపారవేస్తున్నారనే వార్త శరవేగంతో మొత్తం నౌకదళంలో ప్రాకింది. దీని వలన విద్యుత్ పరిణామంవలె సైన్యంలో నవచైతన్యం కల్గింది. లాచితుడు తన నౌకనుండి ఏడు ఫిరంగులను ప్రయోగించి తన ప్రత్యేక నౌకాదళంతో మొగలు నౌకాదళంపైకి బయలు దేరుచున్నట్లుగా సూచించాడు. సర్వసైన్యాధిపతి బడ్ ఫుకన్ యొక్క ప్రత్యేక నౌకాదళం బ్రహ్మపుత్రా నదియొక్క ప్రవాహంమధ్యలో వెళ్ళుతూ వుండటం చూచి యిరువైపుల ఒడ్డులకు దగ్గరగానున్న అస్సామీ యుద్ధనౌకలు అతనివెంట బయలుదేరాయి.



ఝరాయి రేవుపట్టునుండి అప్పుడే మొగలు నౌకాదళంగూడ బయలుదేరింది. మొగలు నౌకాదళాధిపతి రషీద్‌ఖానుకు అస్సాంవారు భయపడి తూర్పువైపు పారిపోసున్నారనే వార్త అందింది. అందుచేత అతడుసులభంగా గౌహతిలో ప్రవేశింపగలమనే ఆశతో హుక్కా త్రాగుతూ తన నౌకలో కూర్చొనివున్నాడు. ఇంతలో తన ప్రత్యర్థి దళం పారిపోకుండా తనమీదకు ఆక్రమిస్తూ వస్తున్న విషయం తెలిసింది. వెంటనే అతడు యుద్ధసన్నద్ధుడయ్యేలోపుగానే అస్సామీ సైనికులు అతని నౌకమీదకువచ్చి రషీద్‌ఖానును ఆ నౌకమీదనున్న మొగలు సైనికులను చంపివేశారు. కామాక్షి, ఇతాఖురీ, అశ్వక్రాంత ఈ త్రికోణములో ఘోర యుద్ధం ప్రారంభమయింది. బ్రహ్మపుత్రకు 'లోహిత్' యనే పేరు సార్థకమయ్యే విధంగా బ్రహ్మపుత్రానదియొక్క నీరు రక్తవర్ణంగా మారిపోయింది. ఆ నదీప్రవాహంలో ఒక మైలు పెడల్పున నౌకలు పరస్పరం పోరాడుతున్నాయి. ఈ యుద్ధంలో గౌహతిని తప్పక కబళించుకోవాలనే

దృష్టితో రామసింహుడు పథకం వేసికొన్నాడు. అతని గుఱ్ఱపుదళం నౌకలలో నింపబడివుంది. ఈ దళంవల్లనే క్రితంసారి మొగలులకు జయం కల్గిందికదా!! కాని యిప్పుడు అంబర్ యొక్క గుఱ్ఱపుదళం బ్రహ్మపుత్రా ప్రవాహంలో కొట్టుకొని పోతూవుంది. నౌకయుద్ధంలో బాగా నేర్పరులైన అస్సాంవారి ముందు ఆదళం నామరూపాలు లేకుండా పోయింది. గుఱ్ఱాలు నదిలో దూక నారంభించాయి. వాటిపై ఆసీనులైన రౌతులు నదీప్రవాహంలో మునిగిపోసాగారు. ప్రతి నావమీదికీ ఎక్కి బడ ఫుకన్ సైనికులు వారి ఫిరంగులను పనికిరాకుండ చేశారు.

బ్రహ్మపుత్ర ఉత్తరపుటొడ్డున అశ్వ కాంత మందిరానుండి తన యెద్దనున్న రెండువేల సైన్యాన్ని వెంటబెట్టుకొని ఆచటికి పశ్చిమ దిక్కున నున్న మొగలు సైన్యముపై నారా హజరికా యను సేనాపతి దాడిచేసి మొగలు సైన్యాన్ని నదివైపు మరలా నెట్టాడు. మొగలులు నారా హజరికా యెదుట నిలబడలేకపోయారు. వారిలో కొందరు నదిలోకి దూకారు. కాని అచ్చటకూడ అస్సామీయులచే చంపబడ్డారు. దక్షిణపుటొడ్డునకూడ అస్సాం సైన్యముంది. నదీ ప్రవాహంలో చాలామంది మొగలుసైనికులు కొట్టుకొనిపోయారు. మొగలుసైన్యానికి చాలా నష్టం కలిగింది. వారు పడమటివైపు పారిపోసాగారు. అస్సామీ సైనికులు వారిని 'పాండు' అనే గ్రామంవరకు తరిమినేశారు. రామసింహుడు మాత్రం చిక్కు పరిస్థితి నుండి బ్రతికి బయట పడ్డాడు. అస్సామీ నౌకాదళం పాండునుండి చాలా దూరం వరకు మొగలులను తరుమగొట్టిన పిదప లాచితుడు 'పాండు'లో ఒక నౌకాదళాన్ని రక్షణకై నిలిపాడు.

అస్సామీయుల యుద్ధ కౌశల్యాల, శౌర్యం చూచి ముగ్ధుడై రామసింహుడు మరుసటి రోజున బడ్ ఫుకనుకు ఒక ఉత్తర మిలా వ్రాశాడు: 'ప్రతి అస్సామీ సైనికుడు మహా నావికుడు; యుద్ధశాస్త్ర కుశలుడు; కత్తిని అంబును ప్రయోగించుటలో అసామాన్య ప్రజ్ఞకలవాడు; తుపాకిని, ఫిరం

గిని కూడ చక్కగా నుపయోగించగలడు. కోటలు, గోడలు కట్టడంలోను, గుంటలుత్రవ్వి మోర్చలు తయారుచేయడంలోను అస్సామీయుల కెవ్వరూ సాటిలేరు. ఇటువంటి శక్తి సామర్థ్యములుగలవారితో యుద్ధము నాపివేసి నేను వెనుకకు తిరిగి వెళ్లుతున్నాను. మీసైనికులు మమ్మును తరిమివేయకుండా చూడవలసిలదిగా కోరుతున్నాను". ఉత్తరము చదివిన వెంటనే సిడ్ఫుకన్ నలుగురు నౌక దళాధిపతులను పిలిచి లూటిచేయుట నాపించి అస్సాం యొక్క సరిహద్దుగానున్న మనహానది అవతలి యొడ్డున మొగలు వారిని విడిచిపెట్టి రావలసినదిగా ఆజ్ఞాపించాడు.

ఝురాయి రేవు లేక అమీన్గాంవ్ యొక్క యీ స్వాతంత్ర్య యుద్ధం ఫలితంగా ఆక్రమణదారులైన మొగలులు శాశ్వతంగా అస్సాం సరిహద్దుల బయటకు నెట్టి వేయబడ్డారు. అస్సాం ప్రభువు, సైనికులు, ప్రజలుకూడ తమకు లభ్యమైన ఈ విజయశ్రీకి చాలా సంతోషించి విజయోత్సవాలు జరుపుకొన్నారు. ఈ చిట్టచివరి యుద్ధానికి ముందే లాచితుడు బాగా జబ్బుతో నున్నాడు. లేవలేని స్థితిలో అతడు కోటదిగి నౌకనెక్కి యుద్ధం చేయటంవలన అతని శక్తికి మించిన పరిశ్రమయై అతని ఆరోగ్య మింకా చెడిపోయింది. చివరకు మాతృభూమియొక్క కళంకాన్ని రూపు మాపి విదేశీ సేనలను సరిహద్దుల బయటకు తరిమివేసి ఆపైన తన జీవిత పుష్పాన్ని లాచితుడు స్వాతంత్ర్య లక్ష్మికి సమర్పించాడు.

# దక్షిణ భారతంలో ఔరంగజేబు పరాజయము

మార్వాడునకు రాజు, మొగలు సర్దారుడు అయిన యశ్వంత సింహ రాఠోడును ఔరంగజేబు విశ్వాస ఘాతకం చేసి ఆఫ్ఘనిస్థాన్‌లో చంపించి వేశాడు. తరువాత అతని మార్వాడు రాజ్యాన్ని ఆక్రమించడానికి తన కుమారుడైన అక్బరుకు పెద్దసైన్యం సహాయంగా యిచ్చి పంపాడు. అప్పట్లో ఔరంగజేబు హిందువులను నానా హింసలు పెట్టాడు. తనకు దగ్గరగానున్న రసపుత్రులనుకూడా విశ్వసించలేదు అందువలన రసపుత్రులు ఔరంగజేబును వ్యతిరేకిస్తూండేవారు. వారందరూ మార్వాడు దీవాను పుత్రుడైన దుర్గాదాస్ నాయకత్వంలో సమైక్యంగా ఔరంగజేబు దాడిని ఎదుర్కొన్నారు. యుద్ధంలో రసపుత్రుల పరాక్రమానికి తట్టుకోలేక అక్బర్ సంధి రాయబారం నడిపాడు. దుర్గాదాస్ రాఠోడ్ కృషివలన రసపుత్రులకు అక్బర్ సుముఖుడయ్యాడు. రసపుత్రుల అండదండలతో అక్బర్ 1-1-1681 న తండ్రి అధికారాన్ని ధిక్కరించి తానే పాదుషానని ప్రకటించుకున్నాడు. అప్పుడు ఔరంగజేబు కుటిల నీతిని ప్రయోగించి, యీ జరిగినదంతా అక్బరు రసపుత్రులను వలలో వేసుకొని చివరకు నాశనం చేయటానికి పన్నిన పన్నాగమని స్ఫురించేటట్లుగా కుమారుణ్ణి ఉద్దేశించి ఒక ఉత్తరం వ్రాసి అది రసపుత్రుల చేతిలో చిక్కేటట్లు చేశాడు.

ఈ భేదోపాయానికి మోసపోయి చాలామంది రసపుత్రులు అక్బరును వదిలి వేశారు. కాని దుర్గాదాసుమాత్రం అక్బరును వదిలిపెట్టక, ఔరంగజేబు పాలనను అంతంచేసేందుకు తాను తలపెట్టిన ప్రథమయత్నం సఫలం కాకపోయినాసరే, మరొక మారు ప్రయత్నించాలనే నిశ్చయంతో శివాజీ పుత్రుడగు శంభాజీ సహాయంకోసం అక్బరును తీసుకొని దక్షిణానికి వచ్చాడు (1-1-1681), ఔరంగజేబుకు యీ వార్త అందింది. అతనికి చాల రోజులనుండి దక్షిణాన హిందూ రాజ్యం అభివృద్ధి చెందటం బాధగా ఉంది. కాని అతని సర్దారు లందరికి శివాజీ ఒక కొరకురాని కొయ్యగా తయారయ్యాడు. వారిలో నెందరినో శివాజీ ఓడించాడు. రణరంగంలో చంపించాడు. అందువలన స్వయంగా దండెత్తి రావడానికి ఔరంగజేబునకు ధైర్యం చాల లేదు. కాని అక్బరు దక్షిణంపైపు వెళ్ళటం మూలంగా రస పుత్రులు, అక్బర్, మహారాష్ట్రులు కలిసికట్టుగా తనతో పోరాడుతారనే భయంవల్ల ఔరంగజేబుకు దక్షిణదేశానికి రావటం తప్ప లేదు. అదీగాక అప్పటికి శివాజీ చనిపోయి ఉండటం, గద్దె యెక్కిన శివాజీ కుమారుడు శంభాజీ ప్రవర్తనపట్ల ఆ రాజ్యంలోని సర్దారులలో కొందరికి అయిష్టత ఏర్పడడం, అందువలన వారిలో వారిమధ్య కొన్ని చిన్న చిన్న పోరాటాలు కూడా జరగటం- ఇటువంటి పరిస్థితులవల్ల ఆ హిందూ రాజ్యాన్ని అక్రమించటానికి అదే మంచి అదనని ఔరంగజేబు భావించాడు. పరాక్రమ వంతులైన ముగ్గురు కొడుకులతో, మనుమళ్ళతో, అనేకమంది సైన్యాధిపతులతో కాబూలు నుండి బంగాలు వరకు విస్తరించిన సామ్రాజ్యశక్తినంతా కూడగట్టుకొని మూడు లక్షల సేనతో 22-2-1682 న ఔరంగాబాదు చేరాడు.

అగ్బర్ ఔరంగజేబుకు బదులుగా తానే పాదుషా అయినట్లు ప్రకటించుకున్న విషయం మహారాష్ట్రలో తెలిసింది. అందరిలో ఉత్సాహం ఉబికింది. మొగలు సామ్రాజ్యముపై దెబ్బతీయడానికి ఇదే సువర్ణావకాశ

మని వారు భావించారు. మహారాష్ట్ర సేనాపతి యగు హంబీరరావు మోహితే ధరణ్ గాంవ్‌ను లూటీచేసి బరహాన్‌పూర్ మీద దాడి చేశాడు. మూడు రోజుల వరకు అతడు బరహన్‌పూర్ కోట బయటి భాగాన్ని లూటీ చేశాడు. అప్పుడు బహదూర్‌ఖాన్ మొగల్ సైన్యంతో మోహితే నెదుర్కొనడానికి బయలుదేరాడు. ఇది తెలిసి హంబీరరావు లూటీచేసిన ధనం తీసుకొని సాల్హేర్ వెళ్ళాడు. శంభాజీ సైన్యం చిన్న చిన్న భాగాలుగా ఏర్పడి విడివిడిగా నలుదిశల తిరుగుతూ, మొగల్ రాజ్యాన్ని లూటీ చేస్తుం దేది. 1681 జులైలో నేతాజీ పాల్కర్ ఖాందేష్‌కు వెళ్ళి అచటినుండి ఉత్తరము వైపుకు వెళ్లాడు. బహదూర్ ఖాన్ షియాబుద్దీన్‌లు అతన్ని వెంబడించారు. కాని ఎవరికి జయపరాజయాలు చేజిక్కలేదు. ఒక సంవ త్సరము వరకు-అంటే ఔరంగజేబు దక్షిణానికివచ్చి ఈ యుద్ధానికి పథ కము వేసేవరకు-ఇలాగేనడిచింది.

కాబూలునుండి కన్యాకుమారివరకు తమ సామ్రాజ్యాన్ని వ్యాపింప జేయాలని తన పూర్వీకులు కన్న కలలు నిజము చేయాలని నిర్ణయించు కొని ఔరంగజేబు దక్షిణానికి బయలుదేరాడు. తన ప్రచండ సైనిక, ఆర్థిక శక్తులను ఉపయోగించి తనకున్న అసాధారణమైన తెలివితేటలతో ఈ మరాఠా హిందూ రాజ్యాన్ని కొద్ది రోజులలో నాశనం చేయగలననే దృఢ నమ్మకం ఉంది అతనికి. ఇంక రసపుత్రులను ఒక కంట కనిపెట్టి ఉండ టానికి తన వజీరు హసత్ ఖానును, తన మనుమడు అజీంషాను నియమిం చాడు. శంభాజీ జాడ, అక్బరుజాడ కనిపెట్టి ఉండటానికి తెలివిగల సేనా నాయకులను కొందరిని నియమించాడు. అలాగే శత్రువులపై నిగా వేసి ఉంచటానికి లెక్కలేనంతమంది గూఢచారులను నియమించాడు. ఈ విధంగా అన్ని విధాల తగిన ఏర్పాట్లుచేసి ఆ హిందూ రాజ్యాన్ని నామ రూపాలు లేకుండా నాశనం చేయాలని సంకల్పించాడు ఔరంగజేబు.

ఔరంగాబాదు చేరటానికి ముందే ఔరంగజేబు అరేబియా మహా సముద్రములోనున్న జంజీరద్వీప దుర్గాధిపతి అయిన "సిద్ధీకి" కబురంపి తనకు సహాయముగా సైన్యాన్ని పంపి తన నౌకాదళముతో శంభాజీ రాజ్యముమీద దాడి చేయమని పురికొల్పాడు. దాని ప్రకారం సిద్దీపనవేలు నుండి చౌలు వరకు సముద్ర తీరాననున్న శంభాజీ రాజ్యభాగాన్ని 1681న డిసెంబరులో ధ్వంసం చేశాడు. దానిపై శంభాజీ తన నౌకదళాన్ని భూసైన్యాన్ని తీసుకొని సిద్దీ మీద రెండు వైపుల నుండి 1682 ప్రారంభములో దాడి ప్రారంభించాడు. సిద్ధీ సైన్యానికి చాలా నష్టం కలిగించాడు. కాని జింజీరా ద్వీపదుర్గాన్ని ముట్టడించలేకపోయాడు. ద్వీపానికి,సముద్ర తీరానికి మధ్య మట్టి వంతెన నిర్మించి దాడిజరపాలని శంభాజీ పథకం వేశాడు. కాని పాదుషా సైన్యం వేరొక ప్రక్కనుంచి దాడి చేయటం వలన సముద్రతీరంనుంచి శంభాజీ సైన్యం కొంత వెనక్కు వెళ్ళిపోవలసి వచ్చింది. రాజస్థాన్ యుద్ధములో కీర్తిగడించిన హసన్‌అలీ అనే సర్దారును ఔరంగజేబు ఉత్తర కొంకణం ప్రాంతాన్ని కొల్లగొట్టటానికి పంపాడు. అతడు 30-1-1682 న కళ్యాణ్‌ను ఆక్రమించాడు. హసన్‌అలీ రాయగఢ్ రాజధానిని ముట్టడించ వచ్చాడనే ఊహతో శంభాజీ జింజీరానుండి రాయగఢ్‌కువెళ్తూ, అతడు రాయగఢ్‌కు వచ్చేదారిలో తన సైన్య విభాగాలను కొన్నిటిని ఉంచాడు. హసన్ అలీ కళ్యాణ్ దగ్గరనున్న ప్రదేశాన్ని ధ్వంసంచేసి వర్షాకాలము సమీపిస్తున్నందున కొంకణ్‌లో నిలువ సాధ్యం కాదని తెలిసి ఆ ప్రదేశం వదిలి వెళ్లాడు.

శంభాజీని అన్నివైపులనుండి ముట్టడించాలని ఔరంగజేబు పథకం వేసి హసన్ అలీని ఉత్తర కొంకణం పంపిన తరువాత తన కొడుకు ఆజం శాను, దిలేర్ ఖాన్‌ను దక్షిణాన అహమ్మదు నగరంమీదికి, సియాబుద్దీన్, దలపత్ బుందేలాలను నాసిక్ మీదికి పంపాడు. సియాబుద్దీన్ నాసిక్ పరిసరాలలో ఉన్న రామసేజ్ కోటను ముట్టడించాడు. 6 నెలలు

ప్రయత్నంచేసినా ఆకోట పట్టుపడలేదు. అప్పుడు ఔరంగజేబు సియాబుద్దీన్‌ను వెనక్కు పిలిపించి అతనికి బదులుగా బహద్దూర్ ఖాణను పంపాడు. అయినప్పటికి కోట అతనికి వశం కాలేదు. చివరకు మొగలు సైన్యానికి అపార నష్టం కలగటంవల్ల అది దాడి విరమించుకొని వెనుదిరిగి పోవలసివచ్చింది. ఈ పరాజయం పాదుషాకు చాలా బాధ కలిగించింది. మొదటి కోటదగ్గరే శంభాజీ చేతుల్లో ఓడి పోవలసి రావడంతో తన తలపాగాను నేలమీద విసిరికొట్టి "శంభాజీని నాశనంచేసి కాని మళ్ళీ తలపాగాను ధరించను" అని శపథం పట్టాడు (30-7-1682). శంభాజీమీద దండెత్తమని ఔరంగజేబు బీజపూరు సుల్తానును పురికొల్పాడు. కాని శంభాజీని నాశనంచేసిన తరువాత తననుకూడ నాశనం చేయటానికి పాదుషా వెనుదీయడని తెలిసియుండుటవలన బీజాపూర్ సుల్తాను శంభాజీకి సహాయం చేశాడు.

క్రీ. శ. 1682లో వర్షాకాలం తరువాత పోరాటం తీవ్రమయింది. ఔరంగజేబు సేనలు శంభాజీని చుట్టుముట్టి యున్నాయి. రణమస్తఖాన్ కల్యాణ్‌ను ఆక్రమించటము వలన శంభాజీ నీరోపంత్ పింగళేను అతని మీదికి పంపాడు. అక్బరు కొంత సైన్యముతో బీదరుమీదకు వెళుతున్నాడని తెలిసి ఔరంగజేబు నాసిక్‌లో హిందూసైన్యంతో పోరాడుతున్న ఖాన్ జహాన్‌ను బీదరువైపుకు పంపాడు. ఇంతలో పాథరీ గ్రామంలో విడిసియున్న పాదుషా ఏనుగులను శంభాజీ సైన్యం పట్టుకుంది. వాటిని విడిపించటానికి ఖాన్ జహాన్ అక్కడికి వెళ్ళవలసి వచ్చింది. చాలా రోజులు పోరాడిన తరువాత ఆ యేనుగులను విడిపించగలిగాడు ఖాన్ జహాన్.

కళ్యాణ్‌ను లోబరచుకొన్న రణమస్తఖాన్ యొక్క సైన్యంకోసం వస్తున్న ధాన్యాన్ని హిందువులు దోచుకున్నారు. పాదుషా అప్పుడు రుహుల్లాఖాన్‌తో తిరిగి ధాన్యం పంపాడు. హసన్ అలీ ఖాన్ బహద్దూర్‌గడ్ నుండి

పరిండా వెళ్తూంటే మహారాష్ట్ర సైన్యం అతన్ని ఎదుర్కొని నష్టం కలుగ జేసింది. అప్పుడే షహజాదా ఆజమ్ బీజాపూర్ ప్రాంతంపై దాడిచేశాడు. అతని భార్యా పిల్లలు దారూరులో సురక్షితంగా ఉన్నారు. మరాఠా వీరులు దారూరుమీద దాడిచేసి మొగలులకు అపారనష్టం కలిగించారు (మార్చి 1683). పాదుషా పిలుపు నందుకొని కొండదారులలో ప్రయాణంచేస్తున్న రణమస్తఖాను హిందువులు రెండుచోట్ల ఎదుర్కొని నష్టం కలిగించారు. ఈ విధంగా కళ్యాణ్ నుండి ఔరంగాబాదు, చాందా, బీదరు, ఫళ్టణ రాయగడ్‌ల వరకుగల సువిశాల ప్రాంతంలో పాదుషాను శంభాజీ శక్తి యుక్తులతో ప్రతిఘటించాడు.

ఈ మాదిరి విషమ ద్వంద్వ యుద్ధాలు చరిత్రలోఎక్కడోగాని కని పించవు. ఒక సంవత్సరముపాటు జరిగిన ఈ యుద్ధములో పాదుషా సాధించిందేమీలేదు. చాలాచోట్ల హిందువులే మొగలులకు అపారనష్టము కలిగించారు. ఇట్టి పరిస్థితులలో క్రీ. శ. 1683 మే నెలలో పాదుషాకు ఒక విధమైన మరణ భయము పట్టుకుంది. 'మరాఠీవీరులంటే దయ్యాలు' ఇది పిశాచ భూమి; ఇక్కడనుంచి అతి త్వరలో బయటపడితే మంచిది; అనే భయము పీడించసాగింది. అయితే శంభాజీతో యుద్ధం నడిపేది ఎవరు? తన పెద్ద కుమారుణ్ణి ఈపని చేయవలసిందిగా పాదుషా కోరాడు అతడాబాధ్యతను తప్పించుకుందామని 'ఆఫ్ఘనిస్థాన్ నుంచి అమీర్‌ఖాన్‌ను నాకు సహాయంగా పంపితే ఈ పని చేస్తాను' అన్నాడు. అమీర్‌ఖాన్ వచ్చేస్తే ఆఫ్ఘనిస్తాన్ మొగలు సామ్రాజ్యం నుంచి జారిపోతుంది. అందు చేత యెవరినీ ఉంచటానికి వీలులేక ఔరంగజేబు తానే స్వయముగా దక్షిణాన ఉండిపోవలసి వచ్చింది. సునాయాసంగా గెలుపు సాధిస్తానని ఆశించిన తనకు తీరని ఆశాభంగం కలగటంతో ఔరంగజేబుకు పిచ్చెత్తి నట్లయింది. పాదుషా అసలే అనుమానం మనిషి. ఆ అనుమానాలు మరీ ఎక్కువయ్యాయి. ఇజింషా, దిలేర్ ఖాన్‌లు అక్బరుకు సహాయం చేస్తు

న్నారని అనుమానము గలిగి అతడు వారిని వెనుకకు పిలిపించాడు. వారు రావటంలో కొద్ది ఆలస్యం అవటం మూలాన వాళ్ళ అధికారాలు తగ్గించి వేశాడు. ఇది సహింపలేక దిలేరుఖాన్ విషము త్రాగి ఆత్మహత్య చేసుకు న్నాడు (20-9-1683). కేవలం అనుమానంపెట్టుకొని దిలేఖాన్‌లాంటి పరాక్రమవంతుడైన సర్దారును పోగొట్టుకొనడంవల్ల పాదుషా మనస్సు పూర్తిగా దెబ్బతిన్నదని చెప్పవచ్చు.

సంవత్సరంపాటు యుద్ధము కొనసాగించినా యేమీ ప్రయోజనం లేకపోవుట వలన కొత్త పథకం వేద్దామని పాదుషా క్రీ. శ. 1583 వర్షా కాలములో తన సర్దారులందరిని ఒకచోట సమావేశపరచాడు. ఒక్క గోవావైపు తప్ప అన్నివైపుల శంభాజీ చుట్టూ తన సైన్యం ఉంది. గోవాలో పోర్చుగీసులకు ఉత్తరం వ్రాసి వారిని శంభాజీ మీదికి దాడికి పురిగొల్పాడు ఔరంగజేబు. సిద్ధీది ఒకటి, పోర్చుగీసు వారిది ఒకటి- ఈ రెండు నౌకాదళాలు శంభాజిని ఎదురించాయి. క్రీ. శ. 1681లో శంభాజీ సిద్దీల మధ్య యుద్ధము జరిగింది. శంభాజీ; సిద్దీని పూర్తిగా ఓడించలేక పోయాడు. రెండు నౌకాదళాలతో ఒకేసారి పోరాటం కష్టమని తోచి పోర్చుగీసు వారిపై స్వయంగా దాడి చేసి వారిని నిర్మూలించాలని నిర్ణ యించుకున్నాడు శంభాజీ. అంతేగాక పోర్చుగీసు వారి దగ్గర నుండి పాదుషాకు ఎట్టి సహాయము అందకుండా ఆపివేయాలని ప్రయత్నించాడు "వసయ్" నుండి "దమన్" వరకు ఉన్న పోర్చుగీసు ప్రాంతము ధ్వంసం చేశాడు శంభాజీ. తరువాత గోవాపై దాడిచేయాలని అను కున్నాడు. అక్బరుకు కూడ గోవాద్వారా విదేశాలకు వెళ్ళిపోవాలని ఉంది. గోవా దక్షిణ కొంకణ ప్రాంతములో ఉన్నందువలన శంభాజీమీద అక్కడ పెద్దయెత్తున దాడి చేయాలని పాదుషా తలపెట్టాడు. 18-9-1683న తన పెద్దకొడుకు అయిన షా ఆలమ్‌ను గొప్ప సైన్యముతో దక్షిణానికి పంపి నాడు. షియాబుద్దీన్ పూనా మీదుగా వెళ్ళి కొంకణములో దిగాలని, అక్క

రును ఒక కంట కనిపెట్టి ఉండేందుకు నాసిక్ వైపు ఆజమ్ షా ఉ౦డా లని, బీజాపూర్ నుండి శంభాజీకి సహాయం రాకుండా ఖాన్‌జహాన్ చూడా లని పాదుషా పథకం వేశాడు. "మా సైన్యం మీకు సహాయం చేయటానికి వస్తుం" దంటూ పోర్చుగీసులకు ఒక ఉత్తరం పంపినాడు.

వసయి దిక్కుగానున్న పోర్చుగీసు ప్రదేశాన్ని శంభాజీ ధ్వంసం చేసినందువలన పాదుషానుండి సైన్య సహాయం వస్తుందని ఆశతో 16-10-1683 న పోర్చుగీసు గవర్నరు టావేరా శంభాజీ రాజ్యమందలి ఫోండా కోటమీద దాడిచేశాడు. ఇది తెలిసి శంభాజీ తన సైన్యంతో హుటా హుటినబయలుదేరి కోటవద్దనున్న పోర్చుగీసు సైన్యాన్ని చుట్టుముట్టాడు. రెండువైపులనుండి దాడి జరగటం మూలంగా పోర్చుగీసువారెందరో హతుల య్యారు. గవర్నరు టావేరా అతి కష్టంమీద 1-11-1683 న పారి పోయాడు. సిగ్గుతో ముఖం చూపలేక చాలా రోజులవరకు అతను ఒక చర్చిలో దాక్కొని ఉన్నాడు స్వాధీనం చేసుకున్న ఫోండాకోట చుట్టు మంచి రక్షణ ఏర్పాట్లుచేసి శంభాజీ తిరిగి పోర్చుగీసు వారి "బారదేవ్", "సాష్టి" లను స్వాధీనం చేసుకొని గోవా రాజధానినుండి రెండుమైళ్ళ దూరంలోనున్న 'కుంభారజువా' "సెంట్ ఇష్టోవ్" లనుకూడ ఆక్రమిం చాడు. తరువాత రాజధానిమీదికి దాడి ప్రారంభం చేస్తుండగా పోర్చుగీసు వారు సంధికి రాయబారం పంపారు. కొంకణం వైపునకు వస్తున్న షా ఆలమును ఎదుర్కొనవలసిన అవసరం ఉన్నందున శంభాజీ సంధికి సిద్ధ మయ్యాడు సంధి కుదుర్చుకునే పని తనమంత్రి 'కలుషా'కు ఒప్పగించి శంభాజీ షా ఆలమ్‌ను ఎదుర్కొనటానికి వెళ్లాడు.

బహదూర్‌గడ్ నుండి హసన్ అలీ ఖాన్ వచ్చి షా ఆలమ్‌ను కలిసిన తరువాత ఇద్దరూ రామ్‌ఘాట్ కనుమనుండి సామంతవాడివైపుగా దిగు చుండిరి (డిశంబరు 1683). హసన్ అలీ ఖాన్ కొండమీద స్థావరము

నేర్పరచుకోగా ముందుకువచ్చిన షా అలమ్‌ను శంభాజీ ఎదుర్కొన్నాడు. యుద్ధంలో గెలుపు ఓటములు నిర్ణయం కాకుండానే శంభాజీ రాయగడ్ వైపు వెళ్లాడు (13-12-1683). షా ఆలమ్ అతన్ని అడ్డగించలేకపోయాడు. 60,000 పదాతి దళము, 4,000 అశ్వికదళము, 2,000 ఉష్ట్రదళము 1900 గజదళము సహాయంతో షా ఆలమ్ డిచోలీలో ఉన్న అక్బరు మీదికి దాడికి వెళ్ళాడు (15-1-1684) అక్బరు అక్కడనుంచి పారిపోయి ఫోండా చేరాడు. మూడురోజుల తర్వాత షా ఆలమ్ సైన్యం కొరకు ఆహార పదార్థాలు తీసుకొని 120 మొగల్ నౌకలు గోవా రేవు పట్టణానికి చేరుకున్నాయి. కాని గోవావారు శంభాజీకి భయపడి ఆ వస్తువులు మొగలు సైన్యానికి చేరవేయలేదు. అందుకు కోపించిన షా ఆలమ్ గోవాలో కొంత ప్రదేశం ధ్వంసం చేశాడు. అయినప్పటికీ అతనికి ఆహారపదార్థాలు అందలేదు. అతనివద్దనున్న పెద్ద సైన్యమంతా ఆహారంలేక మాడిపోవలసి వచ్చింది. శంభాజీ అన్నివైపుల అప్రమత్తుడై ఉండేవాడు. రాయగడ్ వైపు కొంత ప్రదేశం ధ్వంసంచేసి షా ఆలమ్‌ను కలుసుకోటానికి దక్షిణానికి వస్తున్న షియా బుద్దీన్‌ను శంభాజీ తనసైన్యంతో అటకాయించాడు. ఆహారం సమకూడక షా ఆలమ్ తన సైన్యాన్ని తిరిగి రామఘాట్‌వైపుకు మరల్చాడు. దారిలో రోగాలు తగిలి మూడువంతుల సైన్యం నాశనమయింది. లెక్కలేనన్ని జంతువులుకూడా చనిపోవటంవలన చాలమందికి నడకే శరణ్యమయింది. వీళ్ళు పడుతున్న బాధలన్నీ తెలిసి పాదుషా, షా ఆలమ్‌కు రూహల్లా ఖానును సహాయం పంపించాడు. ఆ సైన్యం రామఘాట్ ఎక్కివస్తూ ఉండగా మరాఠీ సైన్యం దానిని ఎదుర్కొని విపరీతంగా నష్టం కలిగించింది. ఈ విధంగా పెక్కు బాధలకు లోనై అవమానం పాలై షా ఆలమ్ 18-5-1684 న అహమ్మద్ నగర్‌లో తన తండ్రి దగ్గరకు చేరాడు.

1684 వర్షాకాలం నాటికి శంభాజీని ఓడించడానికి ఔరంగజేబు భారీయెత్తున ప్రయత్నాలు ప్రారంభించి రెండు సంవత్సరాలైంది. ఎంతటి శక్తియుక్తులతో ప్రయత్నించి నప్పటికీ శంభాజీ రాజ్యంలో కొన్ని గ్రామాలు తగులబెట్టడం తప్ప మరేమీ సాధించలేక పోయాడతడు. మొగలు పాదుషాకు నిరాశా, నిశ్ప్రృహలే మిగిలాయి. అతడు కోపం పట్టలేక దుర్నిర్ణయానికి ఒడి గట్టాడు. ఒకసారి తనచేతికి యుద్ధ ఖైదీలుగా చిక్కిన శంభాజీయొక్క 112 గురు సైనికులను నిష్కారణంగా క్రూరంగా చంపించాడు. యుద్ధ ఖైదీలను నిష్కారణంగా వధించటం నాగరిక మానవతా సూత్రాలకే విరుద్ధం. ఈ అమానుష కృత్యం పతనం జెందుతున్న పాదుషా మనఃస్థితికి తార్కాణం.

1684 వర్షాకాలం తర్వాత మొగలులు మళ్ళీ దాడి ప్రారంభించారు. కాని రాయగడ్ ప్రక్కనున్న 'పాచాడ' గ్రామం దోచుకోటం, సింహగడ్ కోటను స్వాధీనం చేసుకోవటం తప్ప మరేమీ, సాధించలేకపోయారు. మరాఠాలు మట్టుకు 'ఖాందేశ్' బరహాణ్‌పూర్‌ల వరకు నున్న ప్రాంతంలో ప్రవేశించి మొగలులను బాగా పీడించారు. క్రీ. శ. 1685 ప్రారంభంలో ఒక మరాఠా సేనావిభాగం రాయగడ్ నుండి బయలుదేరి చాలా వేగంగా బరహాణ్ పూర్‌నుకూడా దాటి వెళ్ళింది. ఖాన్ జహాఁ వారిని వెంబడించాడు. కాని మరాఠాలు తమ లూటీపనిని కొనసాగిస్తూనే ఖాన్ జహాన్ సేనకూ తనకూ ఎప్పుడూ ఆరు రోజుల ప్రయాణానికి సరిపడ్డదూరం ఉండేట్లుగా సంచరించారు. 'మనుచీ' అనే సమకాలీన విదేశీ చరిత్రకారుడిలా వ్రాశాడు. "పాదుషా శంభాజీని ఓడించటం అట్లా ఉంచి-పాదుషా శంభాజీవలన పడ్డ బాధ చెప్పనలవి కానిది. శంభాజీ సైనికులు పాదుషా యొక్క సామానును, ఆహార పదార్థాలను, పశువులను లూటీ చేసేవాళ్ళు. పెద్ద సర్దారులను లోబరచుకుని, డబ్బిస్తేగాని వారిని వదిలేవారుకారు. లూటీ చేసిన సామాను

ఎంతో ఉండటం వలన బజారులో అమ్మకానికి పెట్టేవారు." ఈ విధంగా వారు 1685 సంవత్సర ప్రారంభానికి పదిహేడు పెద్ద పట్టణాలను లూటీ చేశారు.

వరుసగా మూడుసంవత్సరాలు శ్రమపడినా ఫలితం శూన్యం కావడంతో పాదుషాను అధైర్యం, నిరుత్సాహం పీడించసాగాయి. శివాజీ మరణానంతరముకూడ హిందూ రాజ్యపుశక్తి తేజస్సు ఏమి తరగలేదని పాదుషా గమనించాడు. అమిత బలపరాక్రమవంతుడైన శంభాజీ పట్టు బడటం దుస్సాధ్యం. ఎంతకాలం ప్రయత్నించినా శంభాజీని ఓడించ లేక పోవటం మూలంగా పాదుషా పలుకుబడి తగ్గిపోతూ ఉంది. సైన్యమేమో చాలా పెద్దది. ఖర్చుకూడా చాలా ఎక్కువ. 5 సంవత్సరాలనుండి గెలుపు సాధించకుండా పోరాడటం మూలంగా సైన్యంలో నిరుత్సాహం వచ్చింది. ఇక శంభాజీని జయించటం అసంభవం; సులభముగా జయించగల బీజా పూరు, గోల్కొండలమీదికి దాడిచేయటం ఉత్తమం' అని భావించాడు పాదుషా. గెలుపు కలిగితే సైన్యానికి కొంత ఉత్సాహం వస్తుంది. అంతే కాక ఖర్చు కలిసివస్తుంది. ఈ ఆలోచనతో పాదుషా తన సైన్యాన్ని బీజా పూరు, గోల్కొండలవైపు మగల్చాడు. శంభాజీ తన సైన్యంలో ఎక్కువ భాగాన్ని బీజాపూరు ప్రాంతానికి దగ్గరగా తన ప్రాంతంలో ఉన్న పన్హాలా గడ్, విశాల గడ్ మధ్యలో ఉంచాడు. బీజాపూరు, గోల్కొండ సుల్తానులు మహమ్మదీయులేగాని షియాపంథ్‌కు చెందినవారు. ఔరంగజేబు సున్నీ పంథ్‌కు చెందినవా డవటమేగాకుండా షియాలను తీవ్రంగా ద్వేషించేవాడు. రెండు సంవత్సరాలలో ఔరంగజేబు ఆ రెండు రాజ్యాలను జయించాడు.

కాని ఈలోపుగా శంభాజీ బీజాపూరు రాజ్యమునకు చెందిన కర్ణాటక ప్రాంతముపై దాడిచేసి దానిని వశము చేసుకొనెను. ఔరంగజేబుతో జరిగిన యుద్ధాలలో లభించిన విజయోత్సాహములతో మరాఠా సైన్యము తమ

రాజ్యమును శత్రువులనుండి రక్షించుకొనుటయేగాక ఇతర రాజ్యములను ఆక్రమించుకొని సమర్థవంతమయ్యేను. చివరకు మొగలులకు మరాఠాలకు 8-6-1688 న "వాందవాష్"లో యుద్ధము జరిగింది. ఇరువైపులకు చాలా నష్టము కలిగింది. కాని జయాపజయములు నిర్ణయం కాలేదు. ఇరు పక్షాలు సమ ఉజ్జీలయినవి. యుద్ధం విరమించబడింది. 1688 వర్షాకాలం తరువాత తిరిగి మొగలులు శంభాజీ రాజ్యంమీద దాడిచేశారు. పాదుషా సర్జాఖాన్‌ను "వాయీ" ప్రదేశము మీదికి పంపాడు. అతను సేనాధిపతియగు 'హంబీర రావు'తో తలపడి ఓడిపోయాడు. కాని పోరాటంలో చివరకు హంబీరరావు మరణించాడు. అతని మరణం మరాఠా హిందూ రాజ్యానికి తీరని లోటు. కర్ణాటక ప్రాంతానికి మరాఠా సైన్యంలోని చాలాభాగం పంపివేయడం మూలాన మహారాష్ట్ర ప్రాంతంలో వాని సంఖ్య తగ్గింది. దానితో మహ రాష్ట్ర ప్రాంతంలోనున్న శంభాజీ రాజ్యం క్రమక్రమంగా మొగలులకు వశమయింది. శంభాజీకూడ ఆ రెండు మూడు సంవత్సరాలు కొంత అజాగ్రత్తగా ఉన్నాడు. చివరికి 1-2-1689 న అతడు సర్దారు ముఖ్రబ్బఖాన్ చేతుల్లో చిక్కాడు.

శంభాజీ పట్టుబడటంవలన మొగలులకు పరమానాందం కలిగింది. చేతికి చిక్కిన ఒక రాజును రాజువలె గౌరవించే సంప్రదాయం వారిలో లేదు. శంభాజీకి విదూషకుని వలె విచిత్ర వస్త్రాలు తొడిగి అవమానిస్తూ, ఊరేగిస్తూ బహదూర్‌గడ్‌లో మొగలు శిబిరానికి తీసుకువచ్చారు. ఇస్లాం స్వీకరిస్తే ప్రాణభిక్ష లభిస్తుందని కొన్ని రోజుల తరువాత పాదుషా శంభాజీకి కబురు పంపాడు. హిందూత్వము నందు పరమాభిమానము, స్వీయ కర్తృత్వము నందు అచంచల విశ్వాసము కలిగిన వాతావరణములో పెంచబడిన శంభాజీ హిందూరాజైన తనకు కలుగుచున్న అవమానము సహించలేక శివాజీ కుమారుడనైన నేను కేవలం పిహింసాకాండలకు, మరణానికి భయపడి ఇంత నీచపు పని చేస్తానని కలలోకూడ అనుకోవద్దని మీ పాదుషాకు

చెప్పండి. దుష్టమైన మీ మతము స్వీకరించి అధోగతి పాలుకావటం కంటె పరమనైచ్యం ఇంకోకటి లేదు. అయినప్పటికి పాదుషా తన కూతుర్ని నాకిచ్చి వివాహం చేసినట్లయితే అతని సూచన గురించి ఆలోచించగలను అని ఔరంగజేబుకు కబురంపించాడు.

ఈ జవాబు విని కసితో పాదుషా శంభాజీ గ్రుడ్లు పీకించాడు. బహదూర్‌గడ్" నుండి "కొరేగావ్"కు తీసుకొని పోయి 11-3-1689న "శంభాజీని చిత్రవధచేసి మాంసం కుక్కలకు వేశారు. శంభాజీ శిరస్సును ఖండించి చెడిపోకుండా మందు వేసి గ్రామ గ్రామాలలో ఊరేగించి చివరకు పారవేయించాడు పాదుషా. శంభాజీ నాశనమయితే మొత్తం హిందూరాజ్యం అస్తమించిందని పాదుషా భావం. పాదుషా ఆనాడు పొంది నంత ఆనందం తన జీవితంలో మరెన్నడూ పొందలేదు.

శంభాజీ ఔరంగజేబుకు పట్టుబడ్డాడని రాయగడ్‌లో తెలియడం తోటే 9-2-1689 న శంభాజీ తమ్ముడు రాజారాంకు పట్టాభిషేకం జరిగింది శంభాజీ చనిపోయిన తరువాత 25-3-1689 న "ఇతికతఖాన్" అని మరియొక పేరుగల "జుల్ఫికార్ ఖాన్" రాయగడ్ మీదికి దాడి ప్రారంభించాడు. ఈ ముట్టడి హిందూరాజ్యానికి సంక్రమించిన దుర్భర మైన ఆపద. రాజు ధనాగారంలో ధనం లేదు. సైన్యం చాలా తక్కువ సంఖ్యలో ఉంది. హంబీరారావు, మోహితేవంటి అనుభవశాలురు మునుపటి యుద్ధాలలో వీరస్వర్గమంది యుండిరి. మొగలులు శంభాజీని చంపిన ఉత్సాహంలో విపరీతంగా విజృంభించి దాడిచేస్తున్నారు. ఈ కష్టసమ యంలో హిందూ రాజ్యాన్ని సంరక్షించటం ఎట్లు అని ఆలోచించటానికి ప్రముఖ వ్యక్తులు రాయగడ్‌తో సమావేశమైనారు. అప్పుడు శంభాజీ భార్య, సాహుయొక్క తల్లి అయిన యేసూబాయి "రాజారాం తన భార్యతో కలిసి బయటకు వెళ్ళి ప్రతిభావంతులు అయిన పరాక్రమవంతులు

సర్దారుల సహాయముతో,సమైక్యతతో, నైపుణ్యముతో పోరాడాలి. సాహుతో నేను కోటలోనే ఉంటాను. ఈసురక్షితమైన కోటలో నాకు రక్షణకేమీ లోటు లేదు. మీరు బలం పుంజుకొని ఆత్మవిశ్వాసం హెచ్చిన తరువాత మమ్మలను మీవద్దకు తీసుకువెళ్ళండి." అని చెప్పింది. మంచి గుండె నిబ్బరంతో, నిస్వార్థంగా ఆమె చెప్పిన ఈ మాటలు విని అందరూ చాలా సంతోషించారు. రాయగడ్ కోటలో కొన్ని సంవత్సరాల వరకు ఆమె క్షేమముగా ఉండగలదన్న విశ్వాసంతో రాజారాం తన సర్దారులతోబాటు రాయగడ్ నుండి ప్రతాపగడ్ వెళ్ళాడు.

శంభాజీ చంపబడిన తరువాత పాదుషాయొక్క సైన్యంలో ఉత్సాహం ఇనుమడించింది. శంభాజీ చనిపోకముందే "త్ర్యంబక్" కోటను పాదుషా వశం చేసుకొన్నాడు. 1689 మే నెలలో రాజగడ్, కోహిడా, తోరణ కోటలు కాళ్యాణ, మహల్ మొదలైన స్థలాలు మొగలుల వశం లోనికి వచ్చాయి. ప్రతాపగడ్ మీదికి మొగలుల సైన్యం దండెత్తి దానిని లోబచుకొని పన్హాలాగడ్ వైపుగా సాగిపోయింది. రాజారాం పన్హాలాగడ్‌ను వదిలి ఈ హిందూ రాజ్యముపై చుట్టుముట్టి వచ్చుచున్న మొగలు సైన్యపు ఒత్తిడి తగ్గించడానికై దానిని చీలదీసే ఉద్దేశ్యంతో కర్ణాటక ప్రాంతంలో జింజీవైపునుండియు, రామచంద్రపంత్ విశాలగడ్ నుండి మహారాష్ట్ర ప్రాంతంతోను పోరాడాలని పథకం వేసుకొనిరి. ఆప్రకారంగా రాజారాం వెంటనే బయలు దేరాడు.

మహారాష్ట్ర హిందూరాజ్యమందలి నగరాలు, దుర్గాలు ఔరంగజేబు కైవస మగుచుండినవి. శంభాజీరాజు కూడ చిత్రవధ చేయబడ్డాడు. రాణీ యేసుబాయియు, రాకుమారుడైన సాహుయు రాయగడ్ దుర్గంలో చుట్టు ముట్టబడి యున్నారు. ఈ హిందూరాజ్యం కూడ బీజాపూర్ గోల్కొండ రాజ్యాలవలె ఔరంగజేబు దాడికి సర్వనాశనం అవుతుందని అందరూ భావించారు. కాని అలా ఎంతమాత్రం జరుగలేదు. హిందువులలో రాష్ట్ర

భక్తి ప్రగాఢంగా ఉంది. వాస్తవానికి వారి శక్తి వైభవంతో తులతూగే నగరాలలో గాని, సైన్యంతో నిండిన దుర్గాలతోగాని లేదు. అది వారి అంతఃకరణములలో పాదుచేసుకొని యుండేది. అప్పట్లో రాజ్యమేర్పరచు కొన్న మహారాష్ట్ర ప్రాంతమంతా వారి చేతులనుండి జారిపోయినా, మద్రాసు వెళ్లి రాజ్యమేర్పరచుకొని, అక్కడినుండియే మొగలులపై కత్తి గట్టి వారిని సాధింపగలమని, యావత్ భారతదేశమంతా స్వతంత్రమయ్యే వరకు ఈ మహా ప్రయత్నం విరమించబోమనే కృత నిశ్చయం వారిలో నిలయం చేసుకొని ఉంది. 25 సంవత్సరాల దీర్ఘ కాలంలో మొగలులతో జరిగిన ఈ యుద్ధంలో మహారాష్ట్ర లవంభించిన యుద్ధపద్ధతి చరిత్రాత్మకమైన వృకపద్ధతియే. మహారాష్ట్ర సైన్యం ఊహకందని విద్యుద్వేగముతో సమీకరించ బడేది. అసమానమైన యుద్ధ కౌశల్యంతోను, దుర్దమ్యమైన శౌర్య పరాక్రమాలతోను శత్రువులపై విరుచుకపడేది. శత్రువులు జాగ్రత్త పడేలోగా చెదిరిపోయేది. 'పంచిక' చేసి ప్రత్యర్థులు దాడి చేసేలోపుగా పలాయనం అయ్యేది. ప్రతిచోట వారు మొగలులను పీడించియో లేక యుద్ధములో ఓడించియో ముప్పుతిప్పలు పెట్టిరి. అసలు వారి స్థావరా లెక్కడో, వారిపై ఎప్పుడు దాడి చెయ్యాలో మొగలులకు స్ఫురించేదేకాదు.

మొగలులను భయపెట్టి హిందువులలో అధైర్యం తొలగించాలని నిశ్చయించుకొని, వృక యుద్ధపద్ధతిలో మంచి నేర్పరియైన "సంతాజీ ఘోరపడే" అనే మరాఠా సర్దారు ఔరంగజేబును చంపడానికి ఒక పథకం నిర్ణయించాడు. పాదుషా శిబిరం ఆరోజుల్లో తూలాపూర్‌లో ఉండేది. రెండువేల గుఱ్ఱపుదళంతో రాత్రివేళ తూలాపూర్ వైపు సంతాజీ ఘోరపడే బయలుదేరాడు. శిబిరానికి 4 మైళ్ళ దూరంలో పాదుషా ఛబీన రక్షకులు ఎదురయ్యారు "మేము శర్కే, మోహితే అనే మొగలు సర్దారుల సైన్యంతో సైనికులం. ఛబీనా రక్షణ కార్యంమీద బయటికి వెళ్ళి ఇప్పుడు తిరిగి వస్తున్నాం" అని సంతాజీ వారికి చెప్పి నమ్మించాడు. సంతాజీ మొగలు



సంతాజీ ఘోర్పడే ఔరంగజేబుయొక్క గుడారపు బంగారు కలశాలను నరుకుతున్నాడు

శిబిరంలో ప్రవేశించి సరాసరి పాదుషా డేరావైపు వెళ్ళి అక్కడి రక్షక భటులను చంపి లోపలకు దూరాడు. పాదుషా అదృష్టమో లేక సంతాజీ దురదృష్టమో పాదుషా ఆరోజు అక్కడ నిద్రించలేదు. సంతాజీ చాలా నిరాశచెంది తాను పాదుషాను చంపడానికి డేరావరకు వచ్చానని మొగలు లకు తెలియచేయాలనే ఉద్దేశ్యంతో డేరాను ధ్వంసంచేసి డేరామీదనున్న సువర్ణ కలశాలు తీసుకుని వెళ్ళాడు. అచ్చటినుండి వెళ్ళి రాయగడ్‌ను ముట్టడించిన "జుల్ఫికార్ ఖాన్" సైన్యంమీద బడి ఐదు ఏనుగులను, ఇతర సామగ్రిని వశం చేసుకొని పన్హాల్‌గడ్ చేరాడు. (అగస్టు 1687). అట్టి సాహస కృత్యాలు చేసిన సంతాజీని రాజారాం మిక్కిలి గౌరవించాడు. ఈ సంఘటన వలన హిందువుల ధైర్యం ఇనుమడించింది.

సంతాజీ ఘోరపడే ఇట్టి సాహస కృత్యాలు ఎన్నో చేశాడు. శంభాజీని చంపిన తరువాత మరాఠావీరుల కోటలను జయించటానికి పాదుషా అనేక మంది సర్దారులను పంపాడు. సర్జాఖాన్‌ను సతారామీదికి పంపాడు. అప్పుడు రామచంద్ర పంత్, శంకర్‌జీ నారాయణ్, సంతాజీ, ధనాజీ నలుగురు కలిసి ఖాన్ మీదకు దాడి చేసారు. యుద్ధం జరుగు తుండగా సంతాజీ, ధనాజీ పారిపోతున్నట్లుగా నటించి కొంతదూరం వెళ్లారు. వారిని తరుముతూ కొంత సైన్యం మిగతా సైన్యం నుంచి దూరంగా రాగా మరాఠా సైన్యం తటాలున వెనకకు తిరిగి వారిమీదికి దాడి ప్రారం భించింది. సర్జాఖాన్ సైన్యంలో 1500 మంది చంపబడ్డారు. ఖాన్ తన తల్లి, భార్య పిల్లలతో సహా పట్టుబడ్డారు. అతడు సతారా కోటలో బంధించబడ్డాడు. మరాఠా వీరులు బాగా ధనము తీసుకొని వారిని వదలి పెట్టారు. ఈ విషయం తెలిసి పాదుషా అబ్దుల్ ఖాదర్, ఫిరోజ్ జంగ్‌లను సతారామీదకు పంపాడు. వారిద్దరు ఓడిపోగా, తిరిగి లుత్‌ఫుల్లాఖాన్‌ను పంపాడు. పోరాటంలో మొదట గెలిచినా, తరువాత అతనుకూడ ఓడిపోయాడు.

ఈ విజయ పరంపర వలన హిందువులలో ఉత్సాహం ఎక్కువయింది. శంభాజీ మొగలుల ఖైదులో ఉన్నప్పుడు అతనికి కలిగిన అవమానానికి చిత్రహింసకు మొగలులమీద హిందువులకు బాగా కోపం వచ్చింది. 'మా రాజు కవమానం మా రాష్ట్రానికే అవమానం. దీనికి గట్టిగా ప్రతీకారంచేస్తాం' అనే గట్టి దృఢ నిశ్చయంతో మహారాష్ట్ర వీరులు శస్త్ర సన్నద్ధులై విజృంభించారు. చనిపోయే ముందు శంభాజీ చూపిన ధర్మాభిమానము, నిర్భయత్వము మరాఠాలలో ఆత్మవిశ్వాసం కలిగించి సైనికులనే గాక మామూలు ప్రజలనుగూడ ఎటువంటి ఆత్మార్పణలకైనా సంసిద్ధులను చేసింది. సంతాజీ మున్నగు సేనాధిపతులు సంపాదించిన విజయాలు హిందువుల ఆత్మవిశ్వాసాన్ని వృద్ధిచేసినాయి. హిందూరాజ్యంలో సైనికుల ఆత్మవిశ్వాసం పెరగటమే గాకుండా మొగలుసేనలో ఉన్న హిందూ సర్దారుల మనస్సులలోకూడా హిందూరాజ్య సైనికులయెడల మంచి అభిప్రాయం కలిగింది. మొగలులను విడిచిపెట్టి మరాఠా సైన్యంలో చేరుటకై వారిని పురిగొల్పాయి ఈ విజయాలు. మొగలుల వద్ద కొలువుచేస్తున్న నేయాజీసింధే నింబాల్కర్ మొదలగు హిందూ సర్దారులు ఈ విధంగా మరాఠాలవైపు చేరారు.

పథకం ప్రకారం వేషం మార్చుకుని రాజారాం జింజీ చేరాడు. (16-11-1689) సూర్యాజీ పాళ్కర్ పిసాళ్ అనునతని విశ్వాసఘాతుకము వలన రాయగడ్‌ను స్వాధీనం చేసుకొని రాణి యేసుబాయిని, సాహును మొగలులు పట్టుకు వెళ్ళినట్లు రాజారాంకు జింజీలో తెలిసింది. డిసెంబర్ నెలలో పన్హాల్‌గడ్‌కూడ శత్రువశమయింది. 1689 చివరకు మహా రాష్ట్రలోని హిందూరాజ్యంలో నున్న ప్రముఖమైన కోటలు పాదుషా వశమయ్యాయి. ఈ విధముగ జరుగుతుందని ముందే తెలిసికొని ఈ ప్రాంతమంతా శత్రువశమైనా జింజీలోనుండి స్వాతంత్ర్య యుద్ధం కొనసాగిస్తామనే దృఢనిశ్చయంతో రాజారాం జింజీ చేరగానే అతని వరుస

తమ్ముడైన తంజావూరురాజు సాహుకు, ఆ ప్రదేశములోనున్న మిగతా హిందూరాజులకు ధైర్యం వచ్చింది. శంభాజీ మరణం వలన హిందూదేశమంతా బానిసదేశం అయి, హిందూధర్మం పూర్తిగా నాశనమవుతుందన్న భయం కర్ణాటకములో బాగా వ్యాపించింది. రాజారాం జింజీ చేరటం మూలంగా ఆ భయం పోయింది. బీజాపూరు, గోల్కొండ రాజ్యాలను ఔరంగజేబు జయించాడుగాని, కర్ణాటక ప్రాంతాన్ని అతడు జయించక ముందే రాజారాం అచటకు చేరాడు. ఆ ప్రాంతం పాదుషాకు వశం కాకుండా ఉండడానికై కర్ణాటకంలోని హిందూ రాజ్యాధీశులు రాజారాంతో కలిసి ఐక్యంగా మహమ్మదీయులతో పోరాడాలని నిశ్చయించుకొన్నారు. ఈ ఐక్య సంఘటన వలన రాజారాంను జయించడానికి పాదుషాచే ప్రత్యేకంగా జింజీకి పంపబడిన జుల్ఫికార్ ఖాన్ చాలా సంవత్సరాలవరకు జింజీని జయించలేకపోయాడు.

క్రీ. శ. 1690 సెప్టెంబరులో పాదుషా ఆజ్ఞానుసారం జుల్ఫికార్ ఖాన్ జింజీని ముట్టడించాడు. అంత విశాలమైన కోటను ముట్టడించడానికి కావలసిన సైన్యం అతని వద్ద లేదు. రాయగడ్‌ను జయించినట్లే జింజీని కూడా జుల్ఫికార్ ఖాన్ సునాయాసంగా జయించవచ్చునని అనుకొనిపాదుషా తనదృష్టంతా మహారాష్ట్రపైనే కేంద్రీకరించి ఉంచాడు. ఔరంగజేబు సైన్యంలో చాలా భాగము మహారాష్ట్రంలోనే తిష్టవేసుకొని యున్నందున సంతాజీ, ధనాజీ లాంటి వృక యుద్ధ నిపుణులు మహారాష్ట్రంలోనే ఉండిపోవలసి వచ్చింది. తరువాత జుల్ఫికార్ ఖాన్ సహాయం కోసం పాదుషా ఎక్కువ సైన్యాన్ని అటు మరల్చగానే వారు కూడ కర్ణాటక ప్రాంతానికి వెళ్ళారు. మొట్టమొదట సంతాజీ పాదుషా క్రిందనున్న బీజాపూరు వారి అకలూజ్‌వైపు నున్న ప్రదేశాన్ని చాలాచోట్ల కొల్లగొట్టారు. పాదుషా బేదర్ భక్త్‌ను సంతాజీ మీదికి పంపాడు. బేదర్ భక్త్‌కు సంతాజీ లొంగకపోవడం చూచి ఐత్‌ఫుల్లా ఖాన్‌ను పంపాడు. సంతాజీ, ధనాజీ

అప్పుడు అకలూజ్ ప్రాంతం వదిలిపెట్టి బెల్‌గాం, ధార్‌వాడ్ ప్రాంతానికి వచ్చారు. అప్పుడు పాదుషా అమీరుద్దీన్ ఖాన్, మతలబ్ ఖాన్, ఖాసిం ఖాన్‌లను వారిమీదకు పంపాడు. వారందరు కలిసికూడ సంతాజీ, ధనాజీ లను అదుపులో ఉంచలేకపోయారు. 'ఈ రోజు కృష్ణా తీరంమీద ఉంటే రేపు తుంగనీరే త్రాగేది' అనే తీరుగా వారు ముందుకు సాగిపోతూ ఉండే వారు.

సంతాజీ, ధనాజీల ఈ పరాక్రమం చూచేటప్పటికిపాదుషాకు దిక్కు తోచలేదు. శంభాజీ చిక్కిన తరువాత ముఖ్యమైన కోటలను వశం చేసుకొని మరాఠా హిందూ రాజ్యం పూర్తిగా పతనం అయిందని ప్రకటించి తిరిగి ఢిల్లీ వెళ్ళాలని ఉద్దేశించిన పాదుషాకు పరిస్థితి తలక్రిందులైనట్లు అయింది. శంభాజీని చంపిన తరువాత ఒకే సంవత్సర కాలంలో వాతావరణం పూర్తిగా మారిపోయింది. సంతాజీ ధనాజీల వలెనే శంకర్ నారాయణ "జున్నారు" నుండి "భోర్" వరకు ఉన్న ప్రదేశంలో తిరుగుతున్నాడు. మొగలులు చేపట్టిన కుమారాగడ్, సింఫ్‌గడ్ మొదలైన కోటలను కొద్ది కాలంలోనే శంకరనారాయణ తిరిగి సంపాదించాడు. ఈ సంఘర్షణలలో మహారాష్ట్రంలో హిందువులు ప్రదర్శించిన రాష్ట్రభావము, ఐకమత్యము అపూర్వము. పాదుషా పక్షాన ఒకని ఆజ్ఞానుసారం అన్ని పనులు జరిగేవి. ఆ ఆజ్ఞలను పాటించడానికి చాలామంది సేనా నాయకులు ఉండేవారు. ఇటు మరాఠాల పక్షాన ఎవరికివారు స్వయంగా ఆలోచించుకొని నిర్ణయాలు చేసు కొని పని చేయవలసి వచ్చేది. ఎప్పటికప్పుడు రాగల ఆపదలను గమనిస్తూ అందుకు ఉపాయాలు ఆలోచించేవారు. వాళ్ళలో అందరు ఆజ్ఞలు ఇచ్చే వారే, అందరు ఆజ్ఞలను పాలించేవారే. సైనికులలోనేగాక మామూల ప్రజలలోకూడ రాష్ట్రభావం, ఐక్యమత్యం దృఢంగా ఉండటంవల్ల రణ రంగంలో పోరాడుతున్న హిందూ సైనికులకు అవసరమైన వస్తుసామగ్రి నందిస్తూ శత్రుసైన్యానికి సాధ్యమైనంత ఎక్కువగా ఇబ్బంది కలిగించ

డంలో స్వయం స్ఫూర్తితో పనిచేసేవాళ్లు. తమ గ్రామానికి ఆకస్మాత్తుగా వచ్చిన హిందూ సైన్యానికి భోజన సదుపాయాలు కలిగించే అవకాశాలు కలగటం గొప్ప అదృష్టంగా భావించేవారు. సంపూర్ణ హిందూ స్వాతంత్ర్య ధ్యేయం కొరకు ప్రాణాలను తృణప్రాయంగా బలి యిచ్చే వారు. ఆకలి దప్పులు, ఎండ వానలు, చలి చీకట్లు అవేవీ వారికి అడ్డం కావు. సైనికు లకు గుఱ్ఱాల వీపులమీదే భోజనం, నిద్రా, విశ్రాంతి. రక్షణకు కోటలు లేకపోయినా, ధనసహాయం లేకపోయినా, ప్రతివ్యక్తి అఖండమైన రాష్ట్రి శక్తితో స్వశక్తియే పెన్నిధికాగా పరాక్రమముతో మసలేవాడు. ఎంత కాలానికైనా లొంగకుండా ఉన్న వీరు పాదుషాకు సింహస్వప్నంగా తయారయ్యారు. "వీరిని ఏ విధంగా జయిద్దామన్నా సాధ్యం కావటం లేదు. ఒక వైపున వీరిమీదకు ఎవరినైనా పంపిస్తే, పారిపోయి ఇంకో వైపునుంచి దాడి చేస్తున్నారు వీరు మనుష్యులా! దయ్యాలా?" అని పాదుషా విలపించేవాడు. ఈ విధంగా పాదుషా కుమిలిపోతుంటే సంతాజీ పరాక్రమానికి మెచ్చి రాజారాం అతనికి మొగలుల ఆధీనములో నున్న మీరజ్ గ్రామాన్ని జాగీరుగా ఇచ్చాడు. జాగీరుగా పొందిన గ్రామాన్ని సంతాజీ తన పరాక్రమముతో మొగలులనుండి స్వాధీనం చేసుకున్నాడు ఈ విధంగా చాలా మొగల్ గ్రామాలను రాజారాం తనవారికి జాగీరులుగా ఇవ్వటం, ఆ గ్రామాలన్నిటిని వారు జయించుకోవటం పరిపాటి అయింది.

1690 లో తక్కువ సైన్యంతో వచ్చి ఉండటంవలన జుల్ఫికార్ ఖాన్ జింజీ కోటను ఆక్రమించుకోలేక పోయాడు. మరాఠా సైనికులు అతని సైన్యాన్ని సులభంగా కొల్లగొట్టే వారు. ఎక్కువ సైన్యం కావాలని అతడు కబురుచేయగా, ఔరంగజేబు ఆసత్‌ఖాన్, కామభక్షలను సైన్యంతో అతనికి సహాయంగా పంపాడు. 1692 ప్రారంభంలో గొప్ప కట్టుదిట్టాలతో ముట్టడి మొదలుపెట్టబడింది. ఆ సంవత్సరం వర్షాకాలం తరువాత

సంతాజీ, ధనాజీలు 30,000 సైన్య బలంతో కర్ణాటకం మీదికి దాడి చేశారు. దారిలో కంచి దగ్గర సంతాజీ అలీమర్ధన్ ఖాన్‌ను ఓడించి బంధించాడు (13-12-1692). పిదప చాలా డబ్బు తీసుకొని అతనిని వదలి పెట్టాడు. అలాగే ధనాజీ జాధవ్ కూడ ఇస్మాయిల్ ఖాన్ మకాను పట్టుకొని చాలా డబ్బు తీసుకొని వదిలిపెట్టాడు (9-1-1693). కృష్ణానదికి దక్షిణాన ఉన్న కర్ణాటక ప్రాంతం రాజారాం యొక్క హిందూరాజ్యంలో చేరిందని సంతాజీ ప్రకటించి దానికి కేశవ రామణ్ణను సుబేదారుగా నియమించాడు. తరువాత సంతాజీ, ధనాజీలు జింజీ కోటలో మొగలులకు ఎదురు ముట్టడి ప్రారంభంచేశారు. రెండు వైపుల నుండి దాడికితట్టుకోలేక ఖాన్, రాజారాంతో సంధి చేసుకున్నాడు. రాజారాం, ఖాన్‌నుపోనిచ్చాడు. రాజపుత్రుడైన కామభక్ష్‌ను తీసుకొని ఖాన్ వాందివాష్ వెళ్ళాడు. వారికొరకు వస్తున్న ధాన్యాన్ని సంతాజీ సైన్యం మార్గమధ్యంలోలూటీచేసింది. వాందివాష్ చేరిన తరువాత ఖాన్ జింజీ కోటను జయించాలంటే ముందు కర్ణాటకములో వేరే హిందూ రాజులను జయించాలని ఆలోచించి వారి మీదికి దండయాత్ర చేశాడు. తిరుచునాపల్లి యొక్క నాయకరాజు, తంజావూరుకు చెందిన శహజీ, ఖాన్‌ను శరణు కోరారు. (22-5-1694)

జింజీ నుండి బయలుదేరిన తరువాత 1693 నవంబరులో సంతాజీ బీజాపూరువైపు వెళ్ళాడు. పాదుషా అతని మీదికి హిమ్మత్ ఖాన్‌ను పంపాడు. 14-11--1693న విక్రమహళ్లీలో జరిగిన యుద్ధంలో సంతాజీ ఓడిపోయాడు. అప్పుడు సంతాజీ తన సైన్యాన్ని రెండు భాగాలుగా విభజించి ఒక భాగాన్ని నింబాళ్కర్ నాయకత్వాన బీరారువైపుగా పంపి, రెండవ భాగాన్ని తాను స్వయంగా నడుపుతూ హైదరాబాదువైపు తీసుకొని వెళ్ళాడు. రెండువైపుల నుండి వెళ్తున్న ఈ సైన్యాన్ని హిమ్మత్‌ఖాన్ ఆపలేకపోయాడు. తాను ఓడిపోయాడని తన

సైనికులు, శత్రువులు తెలుసుకోకుండా సంతాజీ ఈ ఉపాయం పన్నాడు. గోదావరినది సమీపంలో ఉంటూ మొగలు సైన్యానికిపోయే ధాన్యం లూటీ చేయసాగాడు సంతాజీ.

జుల్ఫికార్ ఖాన్ కర్ణాటక హిందూ రాజులను జయించి జింజీని ముట్టడించటం ఆరంభించాడు. 1695లో విజయ దశమినాడు రామచంద్ర పంత్ సైనికాధికారులను సమావేశపరచి కర్ణాటకములోను, మహారాష్ట్రం లోను ఒకేసారి యుద్ధం సాగించడానికి తగిన పథకం రూపొందించాడు. ఆ పథకం ప్రకారం సైనికాధికారులలో, కొందరు గుజరాత్‌లోనికి, కొందరు బీరారులోనికి పంపబడ్డారు. జింజీయొక్క ప్రముఖ రణ క్షేత్రం సేనాపతి సంతాజీకి అప్పజెప్పబడింది. సంతాజీ 15,000 అశ్విక దళం తోను, 5,000 పదాతి దళంతోను బయలుదేరాడు. పాదుషా అతని మీదికి హిమ్మత్ ఖాన్‌ను పంపటం జరిగింది. కాని సంతాజీ వాయువేగంతో తుంగభద్రానది దాటి వెళ్ళాడు. అక్కడ మరాఠా శక్తి పెరగకుండ అప డానికి 1693 నుండి "శిరే" గ్రామములో శిబిరం ఏర్పాటు చేసుకొని "ఖాసింఖాన్" బసచేసి ఉన్నాడు. ఖాసింఖాన్ ఒక్కడే సంతాజీని ఎదు ర్కొనడానికి చాలడని పాదుషా అతనికి సహాయంగా "ఖాన్ జద్‌ఖాన్, సఫశికన్‌ఖాన్"ల వంటి ప్రసిద్ధ వీరులను పెద్ద సైన్యం ఇచ్చి పంపాడు. వీరికి స్వాగతం ఇవ్వటానికి ఖాసిం ఖాన్ అదోని కోట నుండి అందమైన డేరాలు, మిగతా విలువ గల సామాను తెచ్చాడు. ఆ సైనికులకు శిరే శిబిరంలోనే తాను కూడ తన పద్ధతిలో స్వాగతం ఇవ్వాలని నిర్ణయించు కొని సంతాజీ తన సైన్యాన్ని మూడు భాగాలుగా విభజించి శిబిరం మీదికి దాడికి తయారుచేశాడు. శిబిరానికి వచ్చినరోజు ఖాన్‌జాద్‌ఖాన్ విశ్రాంతిగా నిద్ర పోయాడు. మరునాటి సూర్యోదయంవేళ సంతాజీ సైన్యంలో రెండు భాగాలు శిబిరం మీదికి దాడి చేసి విలువైన డేరాలను తగుల

దేరింది. ఖాసింఖాన్, ఖాన్‌జాద్‌ఖాన్ యుద్ధంలోకి దిగారు. ఇంతలో సంతాజీ సైన్యంలోని మూడవభాగం వచ్చిపడింది. శిబిరం నాలుగువైపుల నుండి ఒక్కుమ్మడిగా దాడి ప్రారంభమయింది. మొగలు శిబిరాలు తగుల పెట్ట బడ్డాయి. ఆ పోరాటానికి ఖాసింఖాన్ తట్టుకోలేక వెనుకకు తగ్గుచూ 'దుడేరి' కోటలో సైన్యంతో సహా తలదాచుకోవాలని ప్రయత్నించేశాడు. ఆ కోట వరకు అతడు చేరగలిగాడు, కాని అంత మంది ఆ గడ్‌లో ఉండటానికి స్థలం లేదని దాని అధిపతి తలుపులు తీయలేదు. పారిపోయి వచ్చిన పెద్దపెద్ద ఖాన్‌లందరు ఆ దుర్గం బయట చెరువు ఒడ్డున శీతా కాలపు చలిలో ఆకలికి మలమలలాడుతూ ఉండవలసి వచ్చింది. మరునాడు ప్రొద్దుట సంతాజీ వారి మీద దాడి చేశాడు. చాలమంది మొగలు సైనికులు చంపబడ్డారు. ముఖ్యమైన సేనాధిపతులు ఏదోవిధంగా ఆ కోట లో ని కి దూరారు. అయితే అక్కడ వారికి తినటానికి ఏమీ దొరకలేదు ఖాసిం ఖాన్‌కు నల్లమందు తినే దురభ్యాసం ఉంది. అది దొరకక అతడు చని పోయాడు, చివరకు ఖాన్‌జాద్‌ఖాన్ సంతాజీని శరణు వేడాడు. 20 లక్షల రూపాయలు తీసుకొని సంతాజీ అతనిని వదిలివేశాడు. ఎంతో విలువగల వస్తువులు. యుద్ధ సామాగ్రి సంతాజీకి చిక్కింది. తరువాత పాదుషా హిమ్మత్‌ఖాన్, హమీదుద్దీన్ ఖాన్‌లను సంతాజీ మీదికి పంపాడు. బసవ పట్టణం దగ్గర జరిగిన పోరాటంలో హిమ్మత్‌ఖాన్, అతని కొడుకు వధింపబడ్డారు (20–1–1698). చాలా తక్కువ వ్యవధిలో సంతాజీ పెద్ద పెద్ద మొగలు సేనాపతులను ఓడించాడు. దుడేరిలో జరిగిన యుద్ధంలో మరాఠాలకు సుమారు 5,060 లక్షల రూపాయల యుద్ధ సామాగ్రి లభించింది.

క్రీ. శ. 1697లో పాదుషా జింజీ కోటను త్వరలో వశం చేసు కోవాలంటూ జుల్ఫికార్ ఖాన్‌ను తీవ్రంగా హెచ్చరించాడు. మహారా ష్ట్రంలో గత 6, 7 సంవత్సరాలుగా పరిస్థితి చాలా మారిపోయింది. మరా

తాలకు స్వశక్తి మీద మంచి విశ్వాసం ఏర్పడింది. రాజారాం జింజీవైపు ఉండే అవసరం ఎక్కువగా లేదు. కాబట్టి మహారాష్ట్రంలోకి త్వరగా వచ్చేయాలని రామచంద్ర పంత్ ఆయనను కోరాడు. రాజారాం మహారాష్ట్రమునకు రావాలంటే జుల్ఫికార్ ఖాన్ వేసిన ముట్టడిని భేదించియో లేక యుక్తితో తప్పించుకొనియోబయటపడాలి. ఆ ముట్టడిని భేదించిబయటపడగల్గే సైనికశక్తి రాజారాంకు లభ్యము కాలేదు. అందువలన జింజీ కోట నుండి తప్పించుకొని పోవడానికై తగు మార్గాలను రాజారాంసర్దారయిన ఖండోలేలాల్ అన్వేషింసాగాడు జుల్ఫికార్ఖాన్ సైన్యంలో షనోజీశిర్కే అను మరాఠా సర్దారుండెను. అతడు శంబాజీ, రాజారాంల కు బంధువే. కాని శంభాజీ మహారాజు అతని బంధువులను నిర్దాక్షిణ్యంగాచంపించటం వలన శంభాజీ రాజ్యాన్ని నాశనం చేసి కసి తీర్చుకొనే ఉద్దేశ్యంతో ఔరంగజేబు సైన్యంలో సర్దారుగా చేరి రాజారాంపై చేసిన దాడిలో పాల్గొనుచుండెను. ఖండోబల్ లాల్కు శిర్కేతో మంచి పరిచయము ఉండేది. అతడు సరాసరి శిర్కే శిబిరంలో ప్రవేసించి శివాజీ స్థాపించినహిందూసామ్రాజ్య సంరక్షణకు రాజారాం జింజీ కోట నుండి తప్పించుకొని పోవడం ఎలా అవసరమో అతనికి నచ్చచెప్ప సాగాడు. రాజారాం పేరు వినగానే శిర్కే మండిపడి తన కుటుంబాన్ని హింసించిన భోంస్లే కుటుంబం సర్వనాశనం అయేదాకా తనకు సంతృప్తి కలుగదని తెలిపాడు. శిర్కే అలా మాట్లాడుతాడని ఖండోబల్లాల్ ముందుగానే ఊహించాడు. వెంటనే ఖండోబల్ లాల్ స్వీయ అనుభవాన్ని తెలుపుతూ "గనోజీ! మీరన్నది నిజమే. కాని శంభాజీ నా ఆప్తులలో కూడ ముగ్గురిని ఏనుగు పాదాల క్రింద త్రొక్కించాడు గదా! వైయక్తిక కోపతాపాలకు ఇది సమయం కాదు. ఈనాడు జరుగుతున్న యుద్ధం భోంస్లే వంశం వారికిగాని, మరి యే ఇతర వంశం వారికిగాని సంబంధించినది కాదు. ఇది హిందూ స్వాతంత్ర్యాన్ని సంరక్షించుకోడానికి జరుగుతున్న యుద్ధం. హిందూ సామ్రాజ్యం కోసం

మనం ఇప్పుడు కృషి సల్పవలసిన అవసరం ఎంతైనా ఉంది" అని శిర్కే మనస్సుకు నాటునట్లుగా మాట్లాడాడు. తన కుటుంబానికి అపార నష్టం కలిగినా కూడ స్వరాష్ట్ర సాధనకై జీవితాన్నంకితం చేసిన త్యాగమూర్తి ఖండోజీ మాటలు శిర్కేలో ప్రతీకార భావాన్ని భగ్నంచేసి, రాష్ట్రభక్తిని ధర్మప్రపత్తిని రగుల్కొల్పాయి. ఖండోజీ మాటలను అతడు ఉపేక్షింప జాలక పోయాడు. జింజీ కోట నుండి రాజారాంను తప్పించే కార్యంతో సంపూర్తిగా సహాయపడతానని వాగ్దానము చేశాడు. తరువాత శిర్కే రాజా రాంను ముట్టడి నుండి బయటకు తీసుకుపోయి గనోజీ జాదవ్‌కు అప్పగించే టట్లు చేయించాడు. అక్కడి నుండి రాజారాం వేలూరు వెళ్ళాడు (1-15-1697). జుల్ఫికార్‌ఖాన్ 1698 జనవరిలో జింజీని జయించాడు. వేలూరు నుండి రాజారాం మహారాష్ట్రకు బయలుదేరాడు. మార్గమధ్యంలో రాజారాంను పట్టుకోడానికి పాదుషా పన్హాల్‌గడ్‌వైపు బీదర్ బక్తోను, పెడగాంవ్ ఉత్తరంవైపు అజంషాను రాయచూర్‌వైపు ఫిరోజ్‌జంగ్‌ను పంపాడు. కాని ఎవరికీ పట్టుపడకుండా రాజారాం విశాల్ గడ్ చేరాడు.

ఇప్పటి వరకు మరాఠాలకు ఆత్మరక్షణ ఎట్లా చేసుకోవాలని సమస్య ఉండేది. శంభాజీ చంపబడిన తరువాత గడచిన ఆరు, ఏడు సంవత్సరాలలో శత్రువుల శక్తిని వారు తూచి చూశారు. ఇప్పుడు మరా ఠాలకు మంచి ఆత్మ విశ్వాసం కలిగి ఆత్మరక్షణ ధోరణి వదిలిపెట్టి వారు ఆక్రమణధోరణి అవలంబించారు. దీని వలన హిందూ రాజ్యం బాగా వృద్ధి చెంది త్వరలోనే హిందూ దేశమంతటా వ్యాపించింది. క్రీ. శ. 1699 వర్షాకాలంలో రాజారాం తన సర్దారులతో అన్ని విషయాలు సంప్ర దించాడు. ఔరంగజేబు చాలా కాలంగా దక్షిణదేశ దండయాత్రలో సత మత మగుచుండుట వలన ఉత్తర దేశములో మొగలు సామ్రాజ్యము బల హీనము కాజొచ్చెను. అదను చూచి దేవగడ్ యొక్క హిందూగోండ రాజగు బులంద భక్త్, రాజారాం వద్దకు సహకారము కోసం రాయబారం

పంపాడు. పరిస్థితులను సమగ్రంగా సమీక్షించి రాజారాం ఉత్తరమువైపు దాడిచేయడానికి నిశ్చయించాడు. ఆయన పథకం ప్రకారం నిమాజీ సింధే మొదలైన సర్దారులు ఖాందేశ్ ప్రాంతం మీదికి దండెత్తారు. అక్కడ నీమాజీ సింధే బాలనేరుయొక్క మొగలు అధిపతిని పట్టుకొని రెండు లక్షల రూపాయలు తీసుకొని వదిలిపెట్టారు. రాజారాం తాను స్వయంగా సైన్యంతో సూరత్‌పై దాడికి బయలుదేరాడు. ఆయన ఆ ప్రదేశము వెళ్ళలేక పోయాడు. కాని కొన్ని మరాఠా సైన్య విభాగాలు నర్మదానది దాటి వెళ్లాయి. ధనాజీ జాధవ్ కర్హాడ్ దగ్గర హమీదుద్దీన్ ఖాన్‌ను ఓడించాడు. ఈ విధంగా నలువైపులా యుద్ధం జరిగింది. రాజారాం పాదుషా యొక్క బ్రహ్మపురి శిబిరం మీద దాడిచేసి సాహూను విడిపించడానికి ప్రయత్నం చేశాడు. కాని సాధించలేక పోయాడు.

పాదుషా సర్దారులలో యుద్ధంమీద ఆసక్తి క్షీణించ సాగింది. జింజీని మొగలులు కైవసం చేసుకున్నా దానివలన వారికి ఏమీ ప్రయోజనం కలుగలేదు. జుల్ఫికార్ ఖాన్ అతని తండ్రి వజీర్ అసత్ ఖాన్‌తో కూడా పాదుషాయొక్క పుత్రులు, పౌత్రులు ప్రచండమైన యాపత్ సైన్యం కలసి ఎనిమిది సంవత్సరాలు ప్రయత్నించినప్పటికీ ఎంతో ధనం ఖర్చు అయినప్పటికీ రాజారాం తప్పించుకొని పోవటంవలన జింజీమీద చేసిన అన్ని ప్రయత్నాలు వ్యర్థమయినాయి. యుద్ధం కర్ణాటక ప్రాంతం నుంచి మహారాష్ట్ర ప్రాంతానికి మరల్చబడింది. అంతే రాజారాం మాత్రం దొరకలేదు. మరాఠాలు ఎన్నో సంవత్సరాలు యుద్ధం చేసినా జయింప బడకుండుటచే పాదుషా తన సేనాధిపతులు తగినంత శక్తి నుపయోగించ లేదని అనుమానించి తానే స్వయంగా మరాఠాలకు ముఖ్యప్రాంతమయిన మాళవా ప్రదేశంలోని కోటలను జయించాలని నిశ్చయించుకొన్నాడు. 24–11–1699 న వసంతగడ్ కోటతో మొదలుపెట్టి ఐదు సంవత్సరాలలో చిన్నవి, పెద్దవి కలిపి మొత్తం పది కోటలను జయించాడు.

వాటన్నిటిలో పోరాడి జయించినది ఒక్క తోరణ కోట మాత్రమే. మిగిలిన కోటలన్ని పోరాటంలో ఔరంగజేబు విసిగి వేసారి చివరకు మరాఠాలకు ధనం లంచంగా యిచ్చి లోబరచుకొన్నవే.

కాని పది కోటలు చేజిక్కించుకొనినా మహా రాష్ట్రంలో పాదుషా పరిపాలన బలపడిందని చెప్పడానికి వీలుకలగలేదు. అతనికి మానసికంగా ఏ మాత్రం తృప్తి లేదు. మరాఠాలు కోటలను వదిలిపెట్టి పోవడం కేవలం సొంత ప్రయోజనం ఆశించి మాత్రమే. ఎక్కువ శ్రమపడకుండా, ఎక్కువ ధనం ఖర్చు కాకుండా సాధ్యం అయినంతవరకు కోటలను తమ ఆధీనంలో ఉంచుకొని తమ శక్తికి మీరిన పరిస్థితి వచ్చేసరికి డబ్బు తీసుకొని కోటలు ఇచ్చివేసేవారు. త్వరలోనే తిరిగి ఆ కోటలు తమ వశం చేసుకోగలమని వారికి మంచి ధీమా ఉండెడిది. కోటలో ఉండే మొగలులకు ఆహార సామగ్రి లభించకుండా మధ్యలో లూటీ చేసేవారు. కోటలు వశం అయినప్పటికి మరాఠాలు పెట్టే యిబ్బందుల వలన పాదుషాకు ఏమీ లాభం ఉండేది కాదు. ఏ విధంగా చూసినా మొగలులకు నష్టమే; మరాఠాలకు లాభమే. "గ్రాండ్ ఢఫ్" అనే చరిత్రకారుడు మరాఠా సైన్యాన్ని ఈ విధంగా వర్ణించాడు: "మరాఠా సైనికుల సామాను అంతా కలిపి ఒక కంబళి, ఒక రొట్టె మాత్రమే. రాత్రిపూట పడుకునేందుకు, పగలు ఎండ తగులకుండ అడ్డుపెట్టుకునేందుకు కంబళి ఉపయోగించేవారు. వారిదగ్గర ఒంటెలు, ఎద్దులు మొదలైనవి యేమీ ఉండేవికావు. పొట్టిగా ఉన్న గుఱ్ఱాన్ని ఎక్కి మొగలు సైన్యాన్ని లూటీ చేసేవారు. తాపీగా యుద్ధం చేసే అలవాటుగల మొగలులకు వీరిని వెంబడించడం సాధ్యమయ్యేదికాదు. మరాఠాలను ఓడించి వారిదగ్గరనుంచి దోచుకునేది ఏదీలేదు. మొగలులు ఓడిపోతేమాత్రం మరాఠాలకు ఎంతో సంపద చిక్కేది."

రాజారాం 21-4-1700 న రోగగ్రస్తుడై స్వర్గస్థుడయ్యాడు. అతని నాలుగేళ్ళ కుమారుడు శివాజీని గద్దె మీద కూర్చోబెట్టి రాజారాం

భార్య తారాబాయి పరిపాలించడం ప్రారంభించింది. ప్రజలు దేశభక్తి పరులై స్వతంత్ర వీరులై ఉండటంవలన నాయకత్వం ఎవరిది అన్న ప్రశ్న ఉండేది కాదు. అంతేకాక తారాబాయికూడ మంచి కార్య దీక్షగల స్త్రీ అవటంమూలాన పాలకు పంచదార కలిపినట్లయింది.

క్రీ. శ. 1703 లో సాహును విడిచిపెట్టి మరాఠాలతో ఒప్పందం చేసుకోవాలని పాదుషా ప్రయత్నించాడు. ధనాజీ జాదవ్ దగ్గరకు తమ రాయబారిని పంపాడు. సర్‌దేశ ముఖిని వసూలుచేసే హక్కును, సాహును కూడ మరాఠాలకు అప్పగించడానికి ఔరంగజేబు ఒప్పుకున్నాడు. ఇది తెలిసి వచ్చిన డెబ్బదిమంది మరాఠా సర్దారులకుకూడ పాదుషా సన్మాన వస్త్రములు ఇవ్వడానికి సమ్మతించాడు. ఒప్పందం ప్రకారం మొగలు శిబిరానికి పది, పన్నెండు మైళ్ళ దూరంలో సాహును తీసుకొని కామభక్ష్ మరాఠాలను కలవాలని, అక్కడ కామభక్ష్‌కు మరాఠాలు ప్రణామం చేసి వస్త్రాలు తీసుకోవాలని ఏర్పరచబడింది. కాని మరాఠా సర్దారులు పాదుషా శిబిరానికి చాలా దగ్గరగా రావటంవలన వారు సాహుని బలవంతంగా తీసుకొని వెడతారని సందేహం కలిగి పాదుషా ఆ ఒప్పందాన్ని నిలుపుచేసాడు.

క్రీ. శ. 1705 లో దేవాపూర్ శిబిరంలో ఉండగా పాదుషాకు జబ్బు చేసింది. అతడు అక్కడినుండి బయలు దేరి బహదూర్‌గడ్ మీదుగా 20-1-1706 న అహమ్మద్‌నగర్ వెళ్ళాడు. అహమ్మద్ నగర్ చేరబోతుండగా మరాఠాలు అతనిమీద దాడి చేశారు. అతని డేరా ప్రక్కన వేయిమంది మొగలు సైనికులను చంపి మరాఠాలు వారి సేనాపతిని బంధించారు. ఐదు లక్షల రూపాయలు తీసుకొని అతనిని వదిలివేశారు. మరాఠాలకు ఆత్మవిశ్వాసం రోజు రోజుకు అభివృద్ధి అవుతోంది. క్రీ. శ. 1705లో ధనాజీ 40 వేల సైన్యంతో సూరత్‌పై దాడిచేసి భడౌచ్ వరకున్న

ప్రదేశాన్నంత లూటీ చేశాడు. మొగలు సర్దారులయిన నజర్ అలీఖాన్, క్వాజా అమీరులను పూర్తిగా లూటీ చేశారు. తరువాత బరహన్ పూరును కూడ లూటీ చేశారు. సూరత్, బరహన్ పూరులు దక్షిణాదిన ఉన్న మొగలు రాజధానులు. తరువాత మరాఠాలు నర్మదానది దాటి మాళవవైపు వెళ్ళారు. గుజరాతు, ఖాందేశ్, వర్హాడ్ ప్రాంతాలు మరాఠాలకు పూర్తిగా వశమయే పరిస్థితి ఏర్పడింది. ఇది చూచే పాదుషా జుల్ఫికార్ ఖాన్, గాజీవుద్దీన్, ఆజమ్ షాలను వరుసగా మాళవా, వర్హాడ్, గుజరాత్‌ల మీదికి పంపాడు. కాని వారేమీ చేయజాలక పోయారు. వారిలో యుద్ధం చేయడానికి ఉత్సాహమే లేదు. ఇవన్నీ చూసి పాదుషాకు మిక్కిలి బాధ కలిగింది. మరాఠాలను లోబరచుకోవాలని ప్రయత్నం చేయడం తన బుద్ధి తక్కువ అనిపించింది. తన కొడుకులకు ఉత్తరం వ్రాస్తూ "నేను చాలా పాపాలను చేశాను; నా జీవితమంతా వృధా అయింది" అని వాపోయాడు. (విన్సెట్ స్మిత్ వ్రాసిన "భారత దేశ చరిత్ర" పేజి 448). ఇరువది అయిదు సంవత్సరాలు శక్తి వంచన లేకుండా ప్రయత్నం చేసినా దక్షిణ ప్రాంతాన్ని గెలువలేకపోయానని ఎంతో దిగులు చెందాడు. పరాభవంతో, నిరాశతో కుమిలి, కుమిలి 20–2–1707 న చనిపోయాడు.

ఇరవై అయిదు సంవత్సరాలు కొనసాగిన హిందువుల ఈ స్వతంత్ర యుద్ధము హిందూదేశ చరిత్రలో స్వర్ణాక్షరాలతో వ్రాయదగినది. ఔరంగజేబు అంతటి పెద్ద సైన్యంతో శివాజీ మహారాజు స్థాపించిన ఆ హిందూ రాజ్యముపై దండెత్తటం ఆ రాజ్యానికి విషమ సమస్య అయింది. సాక్షాత్తు శివాజీ మహారాజు జీవిత కాలంలో కూడ ఇంతటి పెద్ద సైన్యాన్ని ఒక్కమారుగా ఎదుర్కోవలసిన పరీక్షా సమయం రాలేదు. తన ప్రచండ శక్తినంతా కేంద్రీకరించి ఆ చిన్న రాజ్యాన్ని మట్టిపాలు చేయగలనని ఔరంగజేబు ఆశించడం సహజమే. వాస్తవానికి అంతటి ప్రచండ శక్తి

వచ్చి మీద పడితే శివాజీ రాజ్యానికి పదిరెట్లు విశాలమైన సామ్రాజ్యము కూడ ధ్వంసం అయిపోయేది. కాని శివాజీ ప్రారంభించిన హిందూ రాష్ట్ర సంఘటనా కార్యం ఔరంగజేబు ఊహ కందలేదు. శివాజీ రాష్ట్ర ప్రేమను, రాష్ట్రం సగర్వంగా చెప్పుకోదగిన రాష్ట్రీయ సౌశీల్యమును హిందువులలో చిరస్మరణీయంగా ఉండేటట్లు రగుల్కొల్పాడు. నిర్జీవమైన రాష్ట్రానికతడు జీవం పోసాడు. శివాజీ కాలంలో హిందూ సమాజం సంఘటితంగాను, చైతన్యవంతంగాను ఉండటంచేత తన కర్తవ్యాన్ని గుర్తించి మసలుతూ ఉండేది. శివాజీ కొనసాగించిన ఈ ఉద్యమంలో అతనివంటి సమర్థులైన దేశభక్తులు, సంఘటనా కుశలురు, రణధురంధరులు, సాహస వీరులు, హుతాత్ములు వేలాదిగా తయారయ్యారు. వ్యక్తిగత స్వార్థ ప్రయోజనాల సంకుచిత అశాశ్వత పునాదులమీద ఈ ఉద్యమం ఆధారపడ లేదు. అందువలననే ఔరంగజేబు శాయశక్తుల ప్రయత్నించినా ఏమీ సాధించజాలకపోయాడు.

ఈ ఇరవై అయిదు సంవత్సరాల సుదీర్ఘ పోరాటమంతా హిందువుల స్వాభిమానము, స్వరాష్ట్ర భక్తి, స్వాతంత్ర్య కాంక్ష మున్నగు మహోన్నత గుణములను చాటే ఘట్టాలతో నిండి యున్నది. రాష్ట్రీయ కార్యంలో విధి నిర్వహణ ప్రజానీకానికి అలవాటు కావడానికి చాలా కాలం పడుతుంది. శివాజీ తన జీవిత కాలంలో అలాంటి వారిని ఎంతో మందిని తయారు చేశారు. వారిలో చాలా మంది శంభాజీ కాలంలో గతించారు. అప్పటికి శివాజీ అలవరచిన క్రమశిక్షణా పద్ధతిలో తయారయిన రామచంద్రపంత్ అమాత్య మాత్రం మిగిలియున్నారు. రాష్ట్రశ్రేయస్సు కొరకు అతడు చాలా శ్రమ పడ్డాడు. శివాజీ అండదండలలో తయారయి నవారు మరెవ్వరూ మిగులలేదు. కాని శివాజీ సమయంలో పిన్న వయస్కులుగా నుండి ఆ వాతావరణంలో పెరిగి పెద్ద అయినవారు శివాజీ చివరి యుద్ధంలో పనిచేసిన సంతాజీ లాంటివారు చాలామంది ఉన్నారు. ఈ

క్రొత్త తరంవారు త్యాగంతో కొనసాగించిన స్వాతంత్ర్య సమరం నుండి స్ఫూర్తిని గ్రహించి ఎందరో దేశభక్తులు తయారయ్యారు. సమాజంలో చాలామందిదేశ భక్తులు ఉండటంవలన రాజులేకపోయినా, ధనంలేకపోయినా యుద్ధసామగ్రిలేక పోయినా, శత్రువు గొప్ప సామర్థ్యమున్నవాడై నప్పటికీ అతని దాడులకు తట్టుకొని నిల్చి హిందూ సమాజం తన స్వాతంత్ర్యం నిలబెట్టుకొనగలిగింది. శివాజీద్వారా నిర్మితమైన ఈ రాష్ట్రాన్ని ఉద్ధరించిన శక్తి శివాజీ స్థాపించిన రాజ్యంపై మొగలుల దండయాత్రలను అరికట్టుటయే గాక, అనతి కాలంలోనే దేశమంతటా విజృంభించి సంపూర్ణ భారతాన్ని సర్వ స్వతంత్రంగా చేయగలిగింది.

# రాజా ఛత్రసాల్ బుందేల్

బుందేల్‌ఖండ్ బుందేలేరాజులు పరిపాలించిన భూమి. యమునా నదికి, వింధ్యపర్వతానికీ మధ్యన ఉన్న ఈ రాజ్యానికి పశ్చిమాన మాళవ దేశ ముంది; తూర్పున కైమూర్ పర్వతాలున్నాయి. యమున ఉపనదులైన చంబల్, బేతవా, టోంసులు ఈ ప్రాంతముగుండ ప్రవహిస్తున్నాయి.

బుందేల్‌ఖండ్ వజ్రాలకు ప్రసిద్ధి చెందిన ప్రాంతం. అక్కడ రత్నాల గనులున్నాయి. పురుషుల్లోకూడ రత్నాల వంటివా రక్కడ జన్మించారు. తేజోసంపన్నులైన క్షత్రియులకు వీరులకు, శూరులకు అది కాణాచి.

మొదట్లో బుందేల్‌ఖండ్ సర్వ స్వతంత్ర రాజ్యంగా ఉండేది. మొగలాయిలు ఈ స్వాతంత్ర్యాన్ని హరించారు. హుమాయూన్, జహంగీర్, షాజహాన్‌ల కిది సామంత రాజ్యంగా ఉండేది ఈ దానిసత్వాన్ననుభవి స్తున్న కాలంలో ప్రజలు తమ స్వాభిమానాన్ని పోగొట్టుకొన్నారు. మొగ లాయిలకు ఊడిగం చెయ్యటంలోనే ఆనందాన్ని పొందుతుండేవారు. ఒక బుందేలు రాజు తన కుమార్తెను ఏలుకోమని షాజహాన్‌కు సమర్పించాడు. ఇక సామాన్యుల సంగతేమిటి? ఎందరో బుందేలు కన్యలను మహమ్మ దీయులు బలాత్కారంగా ఎత్తుకుపోయేవారు.

ఒక చిన్న జాగీర్దారు-చంపత్‌రాయ్-మాత్రం ఈ దౌర్జన్యాలను సహించలేకపోయాడు. ఆయన జాగీరు చాలా చిన్నది. దాని ఆదాయము చాలా తక్కువ. కుటుంబాన్ని పోషించుకునేందుకు కూడా సరిపోదు. అయినా విదేశీ పరిపాలకుడైన షాజహాన్‌ను ఎదిరించాలనే దృఢసంకల్పాన్ని ఈ కష్టాలేమీ సడలించలేకపోయాయి. ఆయన కొంత సైన్యాన్ని ప్రోగుచేసి మొగలు సర్దారులపై దాడి చేయడానికి ప్రయత్నించటంతో బుందేల్ నవయువకుల్లో క్రొత్త ఉత్సాహము వెల్లివిరింది. వారందరు చంపత్‌రాయని అనుసరించారు. స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొనేందుకు సంరక్షించుకొనేందుకు ఆయన మొగలులతో ఎన్నో యుద్ధాలు చేశాడు.

క్రీ. శ. 1656 లో షాజహానుకు జబ్బు చేసింది. సింహాసనము కొఱకు—మొగలుల సాంప్రదాయానుసారం—నలుగురు కొడుకులూ కత్తులు దూసారు. కుట్రలు, హత్యలు ప్రారంభమైనాయి. అందరికన్న పెద్దవాడైన దారా ఔరంగజేబును నిర్మూలించాలనుకొన్నాడు. దక్కనులో ఉన్న ఔరంగజేబుహుటాహుటీగా ఆగ్రాకు బయలుదేరాడు. దారా సైన్యం చంబల్ నది ఒడ్డున ఔరంగజేబును ఎదిరించేందుకు ఒక కోటను నిర్మించింది. దానికి ఫిరంగులు అమర్చింది. ఆగ్రా వెళ్ళనివ్వకుండా ఔరంగజేబును నిలిపివేసింది ఈ సైన్యం. ఒక్కడు కూడా ముందుకు సాగనివ్వలేదు. ఔరంగజేబుకు కప్పుడు సహాయం కావలసివచ్చింది. చంబల్‌లోయలో అలాటి సహాయం అందించగల వీరు డెవ్వడు? ఔరంగజేబు దృష్టి చంపత్ రాయ్ మీద పడింది. ఈ మొగల్ రాకుమారుని తియ్యని మాటలకు పరవశుడై పోయి చంపత్‌రాయ్ సహాయం చేసేందుకు అంగీకరించాడు. శాముగఢ్ వద్ద జరిగిన పోరాటంలో చంపత్‌రాయ్ విశేషమైన పరాక్రమాన్ని ప్రదర్శించడంవల్లద్వారా పూర్తిగా ఓడిపోయాడు. ఔరంగజేబుకు విజయము లభించింది.

ఒక మొగలు రాకుమారునికి వ్యతిరేకంగా మరొక మొగలు రాకుమారుని పక్షాన పోరాడవలసిన అవసరం హిందూరాజైన చంపత్ రాయ్‌కు ఏమివచ్చింది? నిజానికి ఆ యిద్దరిలో ఎవరు ఆగ్రాసింహాసనానికి వచ్చినా ఒకటేకదా! అయితే యీ దేశంలో హిందువులే రాజ్యాలను జయించి మొగలాయిలకు కట్టబెడుతూ వచ్చారుకదా! అదే ఇక్కడ కూడ జరిగింది. ఔరంగజేబు ఢిల్లీ పాదుషా అయిన తర్వాత చంపత్‌రాయ్‌ని పన్నెండువేల సైన్యం కలిగిన పటాలానికి సర్దారుగా నియమించాడు. కాని సరిగ్గా ఒక సంవత్సరం తర్వాత చంపత్‌రాయ్ తనకు చేసిన సహాయాన్ని విస్మరించి కృతఘ్నుడై, ఔరంగజేబు ఒక సైన్యాన్ని అతని రాజ్యాన్ని ఆక్రమించుకోవడానికి పంపించాడు. అప్పుడు చంపత్‌రాయ్ చాలా క్లిష్ట పరిస్థితులలో ఉండుటచే, అతడు రాణాప్రతాపుని వలె అడవులలో, కొండలలో తలదాచుకొనవలసి వచ్చింది. భార్యను, పిల్లలను సరిగా చూడటముకూడ సాధ్యమయేది కాదు. సమయానికి భోజనం, నిద్ర ఉండేని కాదు. ఆ పోరాటంలో విజయం అసంభవ మయింది. ఈ బాధ లన్నిటికి గురియయినప్పటికీ, శక్తి సామర్థ్యములుగల ఔరంగజేబుతో యుద్ధము సాగించాడు చంపత్‌రాయ్. ఇట్టి పరిస్థితులలో మన చరిత్రలో అనుగునా వెన్నాడుతూ వచ్చిన దురదృష్టమే తిరిగి దాపురించింది. దేశ ద్రోహి యగు బుందేల్‌రాజు పహాడసింహుడు ఔరంగజేబుకు సహాయం చేసాడు. ఆ పోరాటంలో చంపత్‌రాయ్ చంపబడ్డాడు. చంపత్‌రాయ్ గతించిన విషయము తెలియగానే, అతని భార్యయగు కాళీకుమారి కత్తితో పొడుచుకొని భర్తను అనుసరించింది. (క్రీ. శ. 1661 అక్టోబర్). వారికి ఛత్రసాల్‌తో సహా ఐదుగురు పుత్రులు. అప్పటికి ఛత్రసాల్ వయస్సు 12 సంవత్సరాలు మాత్రమే (జననం: 26-5-1650). తర్వాత ఛత్రసాల్ మాతామహుని యింటిలో రెండేండ్లున్నాడు. అక్కడే విద్యాభ్యాసం చేసాడు. కవిత్వమందు అతనికి అభిరుచి ఎక్కువ. తర్వాత

మోహబాలోని తన స్వంత ఇంటికి వెళ్ళి పినతండ్రియగు సుజన్‌రాయ్ వద్ద శస్త్ర విద్యలు, గుఱ్ఱపుస్వారి నేర్చుకున్నాడు.

ఛత్రసాల్ శరీరం చాల దృఢమైనది. ఆ వయస్సులోనే తాను ఏదో ఒక గొప్ప పనిచేయడానికి పుట్టానని అతనికెప్పుడూ అనిపిస్తుండేది. కాని యేమి చేయాలో తెలిసేది కాదు. ఇట్లుండగా 1665 లో ఔరంగజేబు దక్కనుమీద దాడి చేసేందుకు మీర్జారాజా జయసింహుణ్ణి పంపాడు. దక్షిణ దండయాత్రకు వెళుతున్న ఈ సైన్యంలో చేరితే తన పరాక్రమాన్ని ప్రదర్శించేందుకు మంచి అవకాశం లభిస్తుంది అనుకున్నాడు ఛత్రసాల్. అతను జయసింహుని సమక్షానికి వెళ్ళి తన తండ్రి తాతలను గురించి చెప్పుకున్నాడు. ఆ పరిచయము విని జయసింహుడు సంతసించాడు. ఫలితంగా జయసింహుని సేనలో ఛత్రసాల్ ఒక చిన్న నాయకుడైనాడు. జయసింహుడు నడిపిస్తున్న ఈ మొగల్ సైన్యాలు దక్షిణానికి చేరుకొని శివాజీమీద దెబ్బతీసేందుకు పురందర్ అను కోటను ముట్టడించాయి. ఈ పోరాటంలో ఛత్రసాల్ కూడ పాల్గొన్నాడు. శివాజీ సర్దారుడు పురందర్ యొక్క, దుర్గాధిపతి యగు మురార్‌బాజీ దేశ్ పాండే యొక్క పరాక్రమాన్ని కళ్ళారా చూచాడు. ఆ సమయంలో అతడు శివాజీని గురించి కొన్ని విశేషాలు విన్నాడు. అఫ్‌జల్‌ఖానును వధించటం, షైస్తఖాన్ చేతి వ్రేళ్లు నరకటం మొదలగు సాహస కృత్యాలు ఛత్రసాల్ శరీరాన్ని పులకింప జేసాయి. శివాజీపట్ల అతనికి గౌరవం ఏర్పడింది. తర్వాత పురందర్ ఒడంబడిక ప్రకారం శివాజీ ఆగ్రా వెళ్ళటం, శివాజీని ఆగ్రాలో మొగలాయిలు ఖైదు చేయటం. బుట్టలో కూర్చొని ఆయన ఖైదునుండి తప్పించుకొని రావటం మొదలగు ఉదంతాలను ఛత్రసాల్ విన్నాడు. దక్షిణ దేశంలో అడుగు పెట్టినప్పటినుండి అతడు శివాజీని గురించి ఎన్నో విషయాలు విన్నాడు, కళ్లారా చూసాడు. శివాజీ వ్యక్తిత్వం అతనికి బాగా నచ్చింది. తానుకూడ శివాజీవలె మహావీరుడు కావాలనే ఆకాంక్ష

అతనిలో రేకెత్తింది కాని దానికి మార్గమేమిటో అతడు తెలుసుకోలేక పోయాడు. ఈ దేశంలో తిష్టవేసుకుని కూర్చున్న విదేశీయుల రాజ్యాన్ని తొలగించి, శివాజీవలె స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించుకోవాలనే సంకల్పం మాత్రం కలుగలేదు. కొంత కాలానికి రాజా జయసింహుడు బర్హాణపూర్ లో చనిపోయాడు. తర్వాత ఛత్రసాల్ రాజా జయసింహునితో బాటు ఇదివరకు శివాజీపై ఔరంగజేబు పంపిన దిలేర్ ఖాన్ దగ్గర కొలువుకు చేరాడు దిలేర్ ఖాన్ చాందా దగ్గరనున్న గోండవనంలోని దేవగఢ్ను ముట్టడించి నప్పుడు ఛత్రసాల్ కూడా వానితో ఉన్నాడు. దేవగఢ్ కోటపై దాడి చేయటానికి అన్ని దిక్కులా దిలేర్ ఖాన్ మోహరించాడు. దేవగఢ్ను రక్షిస్తున్న హిందూ గోండ యోధులు అసామాన్యులు. యుద్ధంలో దిలేర్ ఖాన్ సైనికులెందరో హతులయ్యారు. ధనమెంతో ఖర్చయింది. హిందూ వీరులు దిలేర్ ఖాన్ పథకాన్ని కొనసాగనివ్వక ఎంతో సాహసంతో ఎదిరించారు. ఖాన్ సైన్యము నిలువలేక పారిపోవడం ప్రారంభించింది. ఆ సమయంలో పదునేడేండ్ల ఛత్రసాల్ తన్ను తాను మరచి ముందుకు దూకి అద్భుతమైన పరాక్రమాన్ని ప్రదర్శించాడు. అతని శౌర్యం వలననే ఖాన్ పరాజయం విజయంగా మారింది. చివరకు దేవగఢ్ వీరులు ఓడిపోయారు ఈ పోరాటంలో ఛత్రసాల్ శరీరానికి ఎన్నో గాయాలు తగిలాయి. ఛత్రసాల్ శౌర్యంవల్లనే దేవగఢ్ పై ఔరంగజేబు ధ్వజం ఎగురగల్గింది. దిలేర్ ఖాన్ ఈ విజయ వార్తను ఔరంగజేబుకు తెలిపాడు.

అప్పుడు ఔరంగజేబు సంతోషించి ఖాన్ను అభినందిస్తూ ఎన్నో పారితోషికాలు పంపి చాడు. అయితే ఈ విజయానికి మూలకారకుడైన ఛత్రసాల్ పేరు ఎవ్వరూ ఉచ్చరించలేదు. ఈ అన్యాయం ఛత్రసాల్ను యుద్ధంలో తగిలిన గాయాలకన్నా ఎక్కువగా బాధించింది అతడు ఈ అన్యాయాన్ని సహించలేకపోయాడు. తన వాస్తవిక పరిస్థితిని గూర్చి

విమర్శించుకోసాగాడు. తన ప్రాణాలకు తెగించి పోరాడటం ఎవరికోసం? ఔరంగజేబు కొరకా? తన శౌర్య పరాక్రమాలను గౌరవించని ఆ కృతఘ్నుని కోసం, తన తల్లి దండ్రుల మరణానికి కారకుడైన ఆ శత్రువు కోసం తాను తన ప్రాణాల నొడ్డి పోరాడాలా? కాశీకుమార్, చంపత్‌రాయ్‌ల వంశజుడు చేయవలసిన పనియేనా ఇది? మరోవైపున శివాజీ; ఆతడు ధర్మ భూమియైన ఈ మాతృభూమిని దాస్యబంధాల నుండి విముక్తి గావిస్తున్నాడు. తన తల్లిదండ్రులపట్ల తన కర్తవ్యాన్ని నిర్వర్తించి, వారికి ఆనందం కలిగించాడు, ఢిల్లీశ్వరునికూడ ఓడించి, ఆగ్రాలో జరిగిన అవమానాన్ని కడిగివేశాడు. కాని తాను మాత్రం హిందూ వీరుల నిలయమైన గోండ రాజ్యాన్ని ముస్లిముల పాదాక్రాంతం చేశాడు. ఇది దేశద్రోహము, ధర్మద్రోహము కూడా. ఉద్యోగం చేయటం అవసరమైతే శివాజీ దగ్గరే ఉద్యోగం చేయాలి. అతని కొరకు ప్రాణాలర్పించటం కూడ కర్తవ్యమే అవుతుంది. శివాజీ వద్ద ఉద్యోగం చేసి ఔరంగజేబుపై ప్రతీకారం తీర్చుకోవాలి. ఇంతవరకు ఔరంగజేబుకు చేసిన సహాయమంతా బూడిదలో పోసిన పన్నీరయింది. ఇలా పరిపరి విధాల ఆలోచించి, ఛత్రసాలు చివరకు శివాజీనాశ్రయించుటే తగిన పని అని నిర్ణయించుకుని, తగు అవకాశం కోసం ఎదురుచూడసాగాడు.

దేవగఢ్ యుద్ధం తర్వాత దక్షిణ సుబేదారుగా ఉన్న ఔరంగజేబు కుమారుడు ముఅజ్జమ్‌కు దిలేర్‌ఖాన్‌కు మధ్య భేదాభిప్రాయాలు ఎక్కువైనాయి. ఇద్దరు ఒకేచోట ఉండలేని పరిస్థితి ఏర్పడటంతో దిలేర్‌ఖాన్ ఉత్తర హిందూస్థానానికి పిలిపించబడ్డాడు. ఛత్రసాల్ అతనితోబాటు వెళ్ళాడు.

ఈలోగా శివాజీ సూరత్, కారంజా నగరాలను దోచుకున్నాడు. అహివంతగఢ, సాల్హేరు, మార్కుండా దుర్గాలు ఆయన వశమయ్యాయి.

శివాజీ దాడులను నిరోధించవలసినదిగా ఔరంగజేబు దిలేర్‌ఖాన్‌ను నియమించాడు. ఈ పని మీద దిలేర్‌ఖాన్ సైన్యాలు తిరిగి దక్షిణానికి పయనం కాగా ఛత్రసాల్ వారితో వచ్చాడు.

దక్కను చేరిన తర్వాత ఒకనాడు ఛత్రసాల్ వేటకు వెడతానని దిలేరుఖాన్ అనుమతితో మిత్రులతో కలిసి బయలుదేరాడు. అయితే గమ్యస్థానం వేరు. శివాజీ విడిది చేసిన స్థలానికి అతడు ప్రయాణం సాగించాడు ఎన్నాళ్ళగానో అతనికి శివాజీని కలుసుకోవాలని ఉంది. తన పాపమయ జీవితానికి స్వస్తి చెప్పి పవిత్ర కార్యం కొరకు జీవితాన్ని వినియోగించే మహదావకాశం లభిస్తున్నందుకు ఈ ఇరవైయేండ్ల యువకుడు ఛత్రసాల్ ఎంతో పొంగిపోయాడు. అతడు అతని అనుచరులతో భీమ, కృష్ణానదుల దాటి శివాజీ శిబిరాన్ని చేరుకున్నారు. బుందేలీయైన ఛత్రసాల్ శివాజీ దర్శనం కోసం వేచియున్నాడని తెలిసేసరికి అందరికీ ఆశ్చర్యం వేసింది. ఏ కోరికతో ఛత్రసాల్ వచ్చి ఉంటాడోనని శివాజీ మనస్సులో కుతూహలం కలిగింది. శివాజీ అదివరకే ఛత్రసాల్ గురించి విని ఉన్నాడు. ఔరంగజేబు చంపత్‌రాయ్‌ను చంపించి అతని రాజ్యాన్ని కాజేయడం శివాజీకి తెలుసు. వెంటనే అతనిని లోనికి ప్రవేశపెట్టమని ఆజ్ఞాపించాడు.

గుడారంలోకి ఛత్రసాల్ ప్రవేశించగానే, శివాజీ అతనికెదురేగి స్వాగతం చెప్పాడు. ఏ మహనీయుని ఛత్రసాల్ తన ఆదర్శ మూర్తిగా ఆరాధిస్తున్నాడో, ఏ పుణ్యపురుషుని దర్శించటానికి అతడు చిరకాలము నుండి ఎదురుచూస్తున్నాడో, ఏ నర శ్రేష్ఠుని కలుసుకోడానికి అతడెన్నో అడవులు, గుట్టలు, నదులను దాటి వచ్చాడో, ఆ మహారాజే స్వయంగా లేచివచ్చి అతనికి స్వాగతం పలికాడు. శివాజీ పట్ల అమితమైన ప్రేమాదరాలతో పులకాంకితుడైన ఛత్రసాల్ ఆయనకు వినయంతో ప్రణామం చేశాడు. మహారాజు అతి ప్రేమతో అతనిని తనకు దగ్గరగా కూర్చొబెట్టుకొని ఎంతో ఆప్యాయంగా ''ఛత్రసాల్‌జీ! చాలా దూరం వేంచేశారే;

ఇక్కడికి రావటం ఎలా సంభవించింది ?" అని ప్రశ్నించాడు. ఛత్రసాల్ ఈ విధంగా సమాధానమిచ్చాడు: "చిరకాలంగా మహమ్మదీయుల సేవలో ఉండటం మూలాన ఈ రోజు నాకు పశ్చాత్తాపము కలుగుచున్నది. మహమ్మదీయులకు సేవ చేయడమంటే నిస్సారమైన భూమిలో నీరు పోయటమే. ఈ మొగలులపై నా తండ్రి చంపత్‌రాయ్ ఖడ్గం ప్రయోగిస్తే, నేను వారికి సేవచేయాలా ! అందుచేత వారి ఉద్యోగాన్ని వదిలిపెట్టి మీ వద్ద సేవ జేయడానికి వచ్చియున్నాను. దయతో మీరు నా సేవ నంగీకరించి నన్ను కృతార్థుని చేయాలని ప్రార్థిస్తున్నాను."

ఛత్రపతి శివాజీ కొన్ని క్షణాలు మౌనం వహించాడు. ఛత్రసాల్ లోని ఉద్వేగాన్ని తీవ్రమైన ఆకాంక్షను ఆయన గమనించాడు. శివాజీ ఒక అసామాన్య వ్యక్తి. దక్కను సుల్తానుల కంచుకోటలను, ఢిల్లీ పాదుషా సింహాసనాన్ని కదిలించివేసిన తేజోరాశి. ఆమహామహుని తేజోవలయంలో ప్రవేశించిన యువకుడైన ఛత్రసాల్ ఆ తేజస్సులో తాను కూడ ఒక అంశమయ్యెను. ఇద్దరు ఒకే తల్లి బిడ్డలై అరమరికలు లేకుండా దేశ స్థితి గతులు చర్చించుకొన్నారు. చివరకు శివాజీ ఛత్రసాల్‌కు ఈ విధంగా ప్రబోధం చేశాడు: "తమరు వీర క్షత్రియులు బుందేల్ ఖండ్ మీరాజ్యం ఈనాడది మహమ్మదీయుల సామంత రాజ్యంగా బానిస బ్రతుకుతో క్రుంగి పోతున్నది. బుందేల్ ప్రజలకు స్వాతంత్ర్యాన్ని స పాదించిపెట్టే బాధ్యత తమరిపై ఉంది. హిందూ దేశంలో హిందువుల రాజ్యమే ఉండాలి. గోవులను, వేదాలను, ధర్మాన్ని పరిరక్షించవలసిన కర్తవ్యం క్షత్రియులమైన మన మీద ఉంది. ఆ కర్తవ్యాన్ని పాలించేందుకు అవసరమైనప్పుడు దుష్టులను సంహరించాలి. బుందేల్‌ఖండ్‌ను విముక్తం చెయ్యటమేగాక ప్రక్కనే ఉన్న మొగల రాజ్యం మీద కూడ దెబ్బతీయాలి. ఈ దేశం హిందువులది. ఈ దేశాన్ని, ఈ ధర్మాన్ని ఈ జాతిని నాశనం చేయాలని భావించేవారి రాజ్యాన్ని ఇచ్చట నిలువనీయరాదు. ఈ విధంగా పని

చేస్తుంటే, మీ కార్యదీక్ష వలన మీకు నిశ్చయముగా విజయము కలిగి, బుందేల్ ఖండ్‌కు మీరు రాజు కావచ్చు. మనం క్షత్రియులం, మన ఆశయం ఒక్కటే. నేనూ మీరూ వేర్వేరు కాదు. కాని నేను మీకు నావద్ద ఉద్యోగ మిస్తే, మీరు సంపాదించగలిగే ఈ విజయశ్రీ మీకు లభించక నాకే లభిస్తుంది. అందువలన మీరు వెంటనే బయలుదేరి బుందేల్ ఖండ్‌ను విముక్తం జేయండి. మీ విజయ పరంపరను గురించి త్వరలోనే వినాలని నాకు కుతూహలంగా ఉంది.

నిరాశ, నిస్పృహ, భయము, న్యూనత, పిరికితనము, పరసేవా వృత్తి, ఆత్మవిశ్వాసశూన్యత వంటి అవగుణాలేవీ శివాజీ మహారాజులో లేవు. అట్టి వ్యక్తి ముఖతః వచ్చే మాటలు ఎంతో శక్తిమంతములై ఉంటాయి. ఏ మంత్రాన్ని తానను ష్ఠించి, విజయం సాధించాడో ఆ మంత్రాన్నే శివాజీ ఆనాడు ఛత్రసాలుకు ఉపదేశించాడు. అందుచేతనే ఛత్రసాల్ శివాజీ ఉపదేశంచేత ప్రభావితుడైనాడు. స్వతః ఛత్రసాల్ మహత్వాకాంక్షగల యోధుడు. స్వాతంత్ర్య దీక్షాబద్ధుడైన చంపత్‌రాయ్ రక్తాన్ని పంచుకొని పుట్టినవాడు. అప్పటిదాకా ఆత్మవిస్మృతి అనే ముసుగులో హనుమంతునిలోవలె- అతని శక్తి సామర్థ్యాలు ఒదిగి ఉన్నాయి. అందుకే అతడు తన ధ్యేయమేమిటో స్వయంగా తెలుసుకోలేక పోయాడు. గొర్రెల మధ్య పెరిగిన సింహ కిశోరం తన జాతి పరాక్రమాన్ని మరచిపోవడం సహజమే. అయితే మరో సింహం తిరిగి జ్ఞాపకం చేసినప్పుడు సింహానికి స్వజాతి లక్షణాలు సహజంగా బయటికి వస్తాయి. ఛత్రసాలుడు తన కర్తవ్యాన్ని గుర్తించాడు.

ఒక దీపముతో మరొక దీపము వెలిగించబడింది. విదేశీయులైన మొగలుల దుష్ట పరిపాలన నుండి దేశానికి విముక్తి కలిగికచాలనే కోరిక ఛత్రసాలునిలో బలంగా నాటుకుపోయింది. సమర్థుడైన ఛత్రసాలునిలో వచ్చిన యీ పరివర్తనకు శివాజీ ఎంతో సంతోషించాడు. సమస్త భారత

దేశాన్ని బానిస బంధాల నుంచి విముక్తం చేయాలనే శివాజీ ప్రయత్నానికి మరొక వీరుడి సహాయం లభించింది. ఛత్రసాల్‌కు వీడ్కోలు ఇస్తూ శివాజీ అతనికి ఒక ఖడ్గాన్ని బహూకరించి విజయాన్ని పొందుమని దీవించాడు. అంత వరకు ఛత్రసాలును ఆవరించిన విషాద ఛాయలు పూర్తిగా తొలగిపోయాయి. స్వాతంత్ర్య సమరంలో యశోవంతుడైన శివాజీ ఆశీర్వాదబలంతో మహారాజు ఆనందోత్సాహాలను పొంది ఛత్రసాల్ బుందేల్ ఖండ్‌కు బయలుదేరాడు. స్వరాజ్య స్థాపనకోసం బయల్దేరిన ఆ వీర యువకుణ్ణి కనుచూపు మేర వరకు ఎంతో సంతృప్తిగా చూశాడు శివాజీ. మార్గ మధ్యంలోనే తాను ఎవరెవరిని కలుసుకోవాలో నిర్ణయించుకొన్నాడు ఛత్రసాల్. మొదట దక్షిణ బుందేల్‌ఖండ్‌లోని మొగలు సుబేదారుడగు శుభకరుణుని కలుసుకొన్నాడు. అతనిలో కలిగిన పరివర్తనమును గ్రహింపని యా సుబేదారుడు ఔరంగజేబుకు నివేదించి ఛత్రసాలునకు మంచి ఉద్యోగం చూచి పెడతానన్నాడు. తన స్వాతంత్ర్యోద్యమ పథకాన్ని ఛత్రసాల్ వినిపించగానే ఆత్మవిశ్వాసం కోల్పోవడంతో స్వాతంత్ర్య భావాలు నశించి, విదేశీయుల సేవలో మ్రగ్గుచు, స్వరాజ్య స్థాపన సంకల్పాన్ని కూడ సహింపజాలని అతనికి సంభ్రమాశ్చర్యాలు కలిగాయి పిదప భయంతో అతని గుండె గుబగుబలాడింది. అటువంటి పిరికివానివల్ల ఉద్యమానికి, తనకు జరిగే ప్రయోజన మేమీ లేదని భావించిన ఛత్రసాల్ ఓర్చాకు వెళ్లాడు. చంపత్‌రాయ్‌కి ద్రోహం చేసిన పహాడ సింహుడు ఇదివరలో అక్కడ రాజుగా ఉండేవాడు. ఇప్పుడతని కుమారుడు సుజనసింహుడు పాలిస్తున్నాడు. అతడు ఇప్పుడు తనకు తానుగా ఛత్రసాలుని చెలిమి కోరుకున్నాడు. ఎల్ల కాలము విశ్వాసపాత్రుడుగా ఉంటానని ప్రమాణం చేసాడు. ఛత్రసాల్ బుందేల్ ఖండ్‌లోని ఔరంగాబాద్‌ను పాలించే బలిదివాన్ బుదేల్‌ని కలువగానే, సంపూర్ణంగా సహాయం చేసేందుకు అతడు అంగీకరించాడు. ఇతడే ఛత్రసాల్‌కు

లభించిన మొదటి ఆ ప్రుడు. బిజౌరాలో ఉన్న రతన్ సహాయ్ ఛత్రసాల్‌ను చక్కగా గౌరవించి తియ్యగా మాట్లాడాడు. కాని అక్కడ పదునెనిమిది రోజులున్నప్పటికీ, ప్రయోజనమేమీ కలుగలేదు. అక్కడనుండి ఛత్రసాల్ ఒడరా వెళ్ళాడు. అక్కడ కొందరు అనుచరులు లభించారు.

వెంటనే ఛత్రసాలుడు తన తల్లి బంగారు ఆభరణాలను అమ్మగా వచ్చిన ధనంతో ఒక సైన్యాన్ని నిర్మించాడు. ఏడు గుఱ్ఱాలను సమకూర్చుకున్నాడు. అప్పటికి ఛత్రసాలుని వయస్సు ఇరువది రెండేండ్లు మాత్రమే. తన స్వల్పసైన్యంతో మొగలుల అధీనంలో ఉన్న దంధేరా. రత్నాగర్, సిరోజలను స్వాధీనం చేసికొని ఛత్రసాలుడు స్వరాజ్యాన్ని స్థాపించాడు. దామోనీ యందలి ఖాలిక్‌ను ఓడించి బటావా, ధూమ్‌ఘాట్, వాసైద్, గోపాచల్ మనోవర్‌లకు విముక్తి కలిగించాడు. గ్వాలియరు, కంజీయా, బేనౌలను దోచుకున్నాడు.

అప్పటి కందరికీ ఛత్రసాల్ సామర్థ్యంపై విశ్వాసం కుదిరింది. అనేక మంది 'రాజులు, రాకుమారులు ఛత్రసాల్‌తో తమ కేవో చుట్టరికాలున్నాయని చెప్పుకోసాగారు. అతనితో నేస్తం కలిపారు. శక్తివంతుణ్ణి ప్రపంచమంతా గౌరవిస్తుంది కదా! ఛత్రసాల్ విజయ పరాక్రమాలు చూచి శత్రువులు కూడ మిత్రులుగా మారారు. క్రమంగా హిందూ స్వాతంత్ర్యానికి చిహ్నమైన కాషాయజండా బుందేల్‌ఖండ్‌లో అక్కడక్కడా ఎగరసాగింది. మొగలాయీలపై దాడులు అధికం కావడంతో ఖాలిక్ ఈ పరిణామాలను ఔరంగజేబుకు నివేదించుకున్నాడు.

ఛత్రసాల్‌ను దండించేందుకు ఔరంగజేబు రణదుల్లా అనే సేనాపతిని నియోగించాడు. మొగలు సేనానులతో ఛత్రసాల్ ముఖాముఖిని జరిపిన మొదటి పోరాటం అదే. హనూటుక్ అనేచోట మొగలాయీ సైన్యాలు ఓడిపోగా, పందబండ్లనిండా మొగలాయి కోశాగారం ఛత్రసాల్

వశమైంది. తర్వాత ఔరంగజేబు రుమీసుఖానును ఛత్రసాలుని పైకి పంపించాడు. 1678—79 లో బాసియా వద్ద ఇతడుకూడ ఛత్రసాల్ చేతుల్లో ఓడిపోయాడు. ఔరంగజేబును అన్ని వైపులనుండి సమస్యలు తరుముకొనివచ్చాయి. అతడి పాపాలు క్రమంగా పండుతున్నాయి. 1674లో శివాజీ రాజ్యాభిషిక్తుడై హిందూ రాజ్యాన్ని స్థాపించాడని తెలిసింది. యశ్వంతసింహ రాఠోడ్‌ను కాబూలులో చంపించి, ఔరంగజేబు అతని భార్యా పుత్రులను ఢిల్లీలో ఖైదుచేసాడు. ఇది తెలుసుకొన్న దుర్గాదాస్ మున్నగు రాజపుత్రవీరులు వారిని విడిపించి, మార్వాడుచేరి, అక్కడ స్వాతంత్ర్య పతాకాన్ని ఎగురవేసారు. ఔరంగజేబు కుమారుడగు అక్బరు రాజపుత్రులతో చేతులు కలిపాడు. వీనికి తోడు ఛత్రసాల్ విజయవార్తలు అతనికి చేరుతున్నాయి. ఔరంగజేబు మనస్సు మనస్సులో లేదు.

1680 లో ఛత్రసాల్ మొగల్ సేనాని తహవ్వర్ ఖాన్ సైన్యాన్ని ఓడించివేసాడు. మొగలాయీల ఆధీనంలో ఉన్న కలింజరు కోటను ముట్టడించి, పద్దెనిమిది రోజులు యుద్ధం చేసిన తర్వాత స్వాధీనం చేసుకున్నాడు ఛత్రసాల్. తహవ్వర్ ఖాన్ మరొకసారి పద్దెనిమిదివేల సైన్యంతో ఛత్రసాల్‌పై దండెత్తిరాగా, మళ్ళీ అతనికి అపజయమే ఎదురైంది. త్వరాత ఛత్రసాల్ ధరీసాగర్‌లో ఉన్న దుల్చి సైన్యాని ఓడించి కర్‌హటాను తగులబెట్టాడు. యెరఛాను ముట్టడించి, మగరాటా, జలాల్ పూర్‌లపై దాడి చేసాడు. ఈ విధంగా శరవేగంతో ముందుకు వస్తున్న ఛత్రసాల్ సేనావాహినులను ఎదిరించేందుకు టక్కారీలో సయ్యద్ లతీఫ్‌ఖాన్ సైన్యంలో ఉన్నాడు. గూఢచారుల ద్వారా ఇది తెలుసుకొన్న ఛత్రసాల్ అకస్మాత్తుగా వారి మీద దాడి చేశాడు. లతీఫ్‌ఖాన్ యుద్ధ భూమిని వదలి పారిపోయాడు.

ఈ విజయ పరంపరవల్ల ఛత్రసాల్ అనుచరులలో ఆత్మవిశ్వాసం సాహసం ద్విగుణీకృతమయ్యాయి. ఇది ఇలా ఉండగా ఓర్చాలో పరిస్థితి

అదుపు తప్పిపోయింది. సుజన సింహుడు చనిపోగా ఇంద్రమణి రాజయాడు. ఇతడు దురహంకారంతో ఛత్రసాల్‌తో వైరాన్ని కొని తెచ్చుకుని స్నేహ సంబంధాలను త్రెంచివేసాడు. యుద్ధం తప్పలేదు. ఇంద్రమణి పరాజయంతో కాని ఈ సమస్య పరిష్కారం కాలేదు. ఆ తర్వాత ఛత్రసాలుని విజయధ్వజం విదిశ, ఉజ్జయిని, చాంద్‌గఢ్, దేవగఢ్‌లపై ఎగిరింది. సార్వభౌమత్వానికి సూచకంగా ఆయా ప్రదేశాలలో నాలుగవ వంతు పన్ను ఛత్రసాల్‌కు చెల్లించడం ప్రారంభమైంది.

ఛత్రసాల్ ధాటికి ముస్లిం సర్దారులు గజగజ లాడ సాగారు. ఒక్కోసారి ఆయన ఏకధాటిగా అరవై మైళ్లు దండయాత్ర సాగించేవాడు దారిలో అడ్డగించినవారి నందరినీ జయించి ముందుకు సాగిపోయేవాడు. ఔరంగజేబు పంపగా మియా అన్వర్‌ఖాన్ ఛత్రసాల్ పైకి దండెత్తివచ్చి యుద్ధంలో పరాజితుడై తన శస్త్రాగారాన్ని కూడా వదలి పారిపోయాడు. అయినా ఔరంగజేబు తన ప్రయత్నాన్ని వదలలేదు. ఈసారి సుతరుద్దీన్ నాయకత్వంలో ఒక పెద్ద సైన్యం పంపించాడు. బుందేల్‌ఖండ్‌లో అడుగు పెడుతూనే ఆ సైన్యం దామోనీని ఆక్రమించుకుంది. సుతరుద్దీన్ తన రక్షణ ఏర్పాట్లను కూడ పటిష్టంగా చేసుకుంటూ కొందరు హిందువులను రాయబారులుగా ఛత్రసాల్ వద్దకు పంపాడు. వారు ముస్లిం సర్దారుని గొప్పతనాన్ని కొనియాడి అతనితో స్నేహం చెయ్యడంవల్ల కలిగే లాభాలన్నీ విడమర్చి ఛత్రసాలునకు చెప్పారు. అతనితో వైరాన్ని కోరితే యుద్ధభూమిలో ఓడిపోవడం తథ్యమని హెచ్చరించారు. కాని ఛత్రసాల్ వారితో "స్నేహం కావాలనుకుంటే సుతరుద్దీను తక్షణమే నాలుగవ వంతు పన్ను చెల్లించమని చెప్పండి. అట్లా చేస్తే వారి రాజ్యంలోకి మేము ప్రవేశించం. పదిరోజులలోపల పన్ను చేరకపోయినట్లయితే మేము వచ్చి వసూలు చేసుకుంటాం" అని సమాధానం చెప్పి పంపాడు. వెంటనే ఛత్రసాల్ యుద్ధ ప్రయత్నాలు ప్రారంభించాడు. తిరిగివచ్చిన రాయ

దారులు ఛత్రసాల్ సందేశం వినిపించి, అతని పరాక్రమాన్ని గూర్చి సుతరుద్దీనుకు వివరించారు. ఈ పరిస్థితుల్లో నాలుగవ వంతు పన్ను యిచ్చుకొనుటయే శ్రేయస్కరమని సలహాయిచ్చారు. సుతరుద్దీన్ యీ మాటలను పెడచెవినిపెట్టి తానే సైన్యాన్ని నడిపించుకొంటూ బయలు దేరాడు. అకస్మాత్తుగా దాడిచెయ్యాలనేది అతని పన్నాగం కావచ్చు. కాని అంతకన్న ఎక్కువ సంసిద్ధతతో ఉన్న ఛత్రసాలుని సైన్యం వారిమీదకు అకస్మాత్తుగా వచ్చిపడింది ముస్లిం సైన్యం చిత్తు చిత్తుగా ఓడించబడింది. వారి సేనాపతి బర్గీ చంపబడ్డాడు. ఈ వార్త తెలుసు కొన్న సుతరుద్దీన్ యుద్ధభూమిని విడిచి పారిపోయాడు. ఈ విజయం తర్వాత బుందేలేలు హమీద్ఖాన్, సయ్యద్ లదీఫ్లను ఓడించి బేతవానదివరకు ఉన్న ప్రదేశాన్నంతనూ స్వాధీనం చేసుకొన్నారు. సుతరుద్దీన్ పరాజయాన్ని గురించి తెలుసుకొన్న ఔరంగజేబు ఈసారి అబ్దుల్ సమద్ఖాణాను పంపాడు. ఇతడు తనతోపాటు శక్తివంతమైన సైన్యాన్నేగాక ఫిరంగులనుకూడ తెచ్చుకున్నాడు. అతని దాడి విషయం గూఢచారుల ద్వారా తెలిసికొని ఛత్రసాల్ తగిన కట్టుదిట్టాలు చేసాడు. సర్దారులందరితో సంప్రదించి ఒక రహస్య పథకాన్ని వేశాడు. దాని ప్రకారం సర్దారు లందరూ తమ తమ రంగాలలో ప్రయత్నాలు పూర్తిచేసుకొని సిద్ధంగా ఉన్నారు. ఛత్రసాల్ రణభేరి మ్రోగించాడు. భీషణయుద్ధం ప్రారంభ మైంది. మొగలాయీ ఫిరంగులు అగ్నివర్షాన్ని కురిపించ సాగాయి. వీటిని లెక్కచేయకుండా హిందూవీరులు యుద్ధం చేయసాగారు. దేవకరణ్ బుందేల్ కుమారుడు అంగద్రాయ్ని శత్రువులు చుట్టుముట్టారు. అతడు రెండుసార్లు శత్రువుల వ్యూహాన్ని ఛేదించి బయటకు రాగలిగాడు కాని బాగా గాయపడ్డాడు. ఇది గమనించిన ఛత్రసాల్ ముందుకు దూకి ఆనంద్ను రక్షించాడు. ఇదేవిధంగా అజిత్రాయ్ను కూడ ఛత్రసాల్ రక్షించాడు. వివేచనతో కూడుకున్న నాయకత్వంతో, పరాక్రమంతో

ఛత్రసాల్ బుందేలేలను విజయ పథంలో నడిపించాడు. మహమ్మదీయులు హిందూశక్తి ముందు నిలువలేక పలాయితులైనారు. వారి నాయకుడు అబ్దుల్ సమద్‌ఖాన్ ఎక్కడ సామాగ్రిని అక్కడే వదిలేసి యమునాతీరం చేరేవరకూ వెనుదిరిగి చూడలేదు. పన్నా వరకు వారు తరుమబడ్డారు. సమద్‌ఖాన్ ఓడిపోతాడని ఎవ్వరూ అనుకోలేదు. ఈ అపజయంతో ఔరంగజేబు సుబేదారులందరికీ ఛత్రసాల్ అంటే భయం వేసింది. ఆ మహా వీరుడిపేరు భారతదేశపు మూలల్లో ప్రాకిపోయింది.

ఛత్రసాల్ ఈ విధంగా విజయాలను సాధించడం, పేరు ప్రతిష్ఠలు సంపాదించటం, యుద్ధంలో పేరుమోసిన రాజపుత్రులలో ఈర్ష్యను కలుగజేసింది. యుద్ధశాస్త్రంలో తమను మించిన వారు లేరనే అహంకారం వారిలో ఉండేది. స్వార్థత్యాగంతో దేశసేవ చేసేవారి మార్గంలో స్వార్థ పరులైన వారి బంధువులే ఆటంకాలు కల్గిస్తూ ఉంటారు. వీరితోకూడ ఛత్రసాల్ యుద్ధాలు చేయవలసి వచ్చింది రాజపుత్ర రాజైన గర్జసింహుని పైకి వెళ్ళి అతన్ని ఓడించి ఛత్రసాలుడు పన్ను వసూలు చేసాడు.

అయితే ముస్లిం దండయాత్రలు ఇంతటితో ఆగిపోలేదు. ఈసారి బహలోల్ ఖాన్ తొమ్మిదివేల సైన్యంతో దండెత్తి వచ్చాడు. ఇప్పటిదాకా ఛత్రసాల్‌ను ఎదిరించిన వారి గతే వీనికీ పట్టింది. ఏడురోజులు అహోరాత్రులు పోరాటం జరిగింది. చివరకు బహలోల్‌ఖాన్ చిత్తుగా ఓడి పోయాడు.

బుందేల్‌ఖండ్‌లో మురాద్‌ఖాన్, దలేర్‌ఖాన్ లనే మొగలు జాగీర్దారులు అనేకవిధాల హిందువులను పీడిస్తుండే వారు. నాలుగోవంతు పన్ను చెల్లించేందుకు వారు నిరాకరించటంతో ఛత్రసాల్ మొదట మురాద్ ఖాన్ మీద దెబ్బతీసాడు. అతని ధనాగారాన్ని, యుద్ధ సామాగ్రిని, కోటను-సమస్తమూ స్వాధీనం చేసుకొన్నాడు. మురాద్‌ఖాన్ శిబిరం

కాల్చివేయబడింది. అతడు చంపబడ్డాడు. తర్వాత దలేర్ ఖాన్‌ను శిక్షించటం జరిగింది.

మహమ్మదీయులను ఎదిరించి పోరాడినపుడు హిందూరాజులు మన దేశ చరిత్రలో అనేక పొరపాట్లు చేసారు. ఛత్రసాల్ జీవితంలో ఇటువంటివి కనిపించవు. ఒక సందర్భములో ఛత్రసాల్ సైన్యం ఎక్కడో యుద్ధంచేస్తూ ఉండి పోయింది. అయనతో కేవలం నాల్గువందలమంది సైనికులు ఉన్నారు. ఇది కనిపెట్టిన మొగలు సర్దారులు-అఫ్‌గన్‌ఖాన్, శాహకులీఖాన్‌లు-ఛత్రసాలుని ఓడించేందుకు ఇదే తగిన సమయం అని భావించి దండెత్తివచ్చారు. వారి సైన్యంలో కొన్ని వేలమంది ఉన్నారు. యుద్ధరంగంలో వారిని ముఖాముఖీగా ఎదిరించి ఓడించడం సాధ్యంకాదని గ్రహించి ఛత్రసాల్ తన యుద్ధ పద్ధతులను మార్చుకొన్నాడు. శత్రువులు బలంగా దెబ్బతీసినపుడు రణరంగంనుంచి వైదొలగి దూరంగా వెళ్ళిపోయేవాడు; అవకాశం చూచుకొని శత్రువుల మీద దాడి చేసేవాడు. ఉపద్రవం వచ్చినంత మాత్రాన ధ్యేయనిష్ఠకలవారు చలించరు. ఎటువంటి కష్టాలుకూడ వారిలో నిరాశను కలిగించలేవు. ఏదోవిధంగా వాటిని అధిగమించగల్గుతారు. చాకచక్యంతో పోరాడుతూ ఛత్రసాల్ మొగలు సర్దారైన షేర్‌ఖాన్‌ను చంపివేశాడు. పారిపోవటం, దాడిచేయటం, వంచికలివ్వటం-ఇలా అన్నివిధాలా పోరాడుతూ, ఛత్రసాల్ మాహు చేరాడు.

యుద్ధరంగంలో వీపు చూపకూడదనే ధర్మాన్ని అక్షరాలా పాటిస్తున్నామనే తృప్తితో ఇదివరలో అనేకమంది క్షత్రియవీరులు ఆత్మ త్యాగం చేసారు. దీనివలన రాష్ట్రాభివృద్ధి కుంటుపడింది. శత్రువులకు వెన్నుచూపకూడదనుటలో అర్థం అక్కడే ఉండి చనిపొమ్మని కాదు. పరాజయాన్ని స్వీకరించకూడదని, సహించకూడదని భావం. శ్రీకృష్ణునికి

కూడ హిందీలో రణచోడ్ అనే పేరు ఉంది. ఒక సమయంలో ఆయన రణరంగాన్ని వదలి పారిపోయాడు. దేశ క్షేమంకోసం అంతిమ లక్ష్యాన్ని జ్ఞాపకం ఉంచుకోవలసి ఉంటుంది.

ఛత్రసాల్ గురుదేవులు ప్రాణ చక్షు, యుద్ధభూమిని దర్శించి తన శిష్యుడు అనుసరిస్తున్న యుద్ధ వ్యూహాన్ని ప్రశంసించారు. అదను చూచి ఛత్రసాల్ అఫ్‌గన్ ఖాన్ మీద దాడి చేసాడు. శత్రుబలం ఇంకా ఎక్కువగా ఉంది. ఛత్రసాల్ తుపాకీ గుండ్లకు ముగ్గురు సర్దారులు నేల కొరిగారు. అఫ్‌గన్‌ఖాన్ ఏనుగును అడ్డగించి ఛత్రసాలుడు అతనిని హతమార్చే యత్నంలో ఉండగా, సయ్యద్ లతీఫ్‌ఖాన్ సంధి కోసం తెల్లజెండా చూపించాడు. తరువాత నాలుగవ వంతు పన్ను చెల్లించేందుకు అఫ్‌గన్‌ఖాన్ లతీఫ్‌ఖాన్‌లు ఒప్పుకున్నారు. యుద్ధ పరిహారం క్రింద కొంత ధనం ఇచ్చు కొన్నారు. తరువాత ఛత్రసాలుడు శాహకల్‌కులే మీద అర్ధరాత్రి సమయంలో దాడిచేసి, అతడిని కూడా పూర్తిగా ఓడించాడు. పరాజితుడైన ఖాను ఛత్రసాలుని క్షమాపణ కోరుకుని ఎనిమిదివేల రొఖ్ఖాన్ని సమర్పించు కొని, ఆపైన ప్రతి యేడాది పన్ను చెల్లించేందుకు అంగీకరించాడు.

ఈ యుద్ధం తర్వాత ఏ ముస్లిం సర్దారు గాని ఛత్రసాలునిపై చాలా కాలం వరకు దండయాత్ర చేయనేలేదు. వారందరూ అతని గొప్పతనాన్ని గుర్తించారు. ఔరంగజేబు కూడా ఏమీ చేయలేక ఊరుకున్నాడు. అప్పటికి బుందేల్‌ఖండ్ అంతా దాదాపుగా ఛత్రసాలుని అధీనంలోకి వచ్చింది. అన్ని కోటలపైన, నగరాలపైన అరుణారుణ భగవ పతాకం ఆకాశాన్నలంకరిస్తూ రెప రెప లాడసాగింది. ఛత్రసాలుడు స్థాపించిన ఆ స్వతంత్ర హిందూరాజ్యానికి పన్నా నగరం రాజధానిగా శోభిల్లింది. చుట్టు ప్రక్కల ఉండే మొగలు సర్దారులందరూ ఛత్రసాల్‌కు 'చౌథ్' పన్ను కట్టవలసిందే. అది కట్టకపోతే అక్కడ నివసించుటయే అసంభవమైంది వారికి. తమ కనులముందే ఒక చిన్న సర్దారుడు అజేయమైన హిందూ

రాజ్యాన్ని స్థాపించటం నాటి సామాన్య హిందువులలో ఒక నూతన ఉత్సాహాన్ని, విశ్వాసాన్ని కలిగించింది. హిందువులలో కలుగుతున్న యీ చైతన్యం మొగలాయీ పరిపాలకులకు ఆంటకంగా అనిపించింది. కాని వారు చేసిన ప్రయత్నాలన్నీ దాదాపు వృథా అయ్యాయి.

దక్కనులో శివాజీ స్థాపించిన హిందూరాజ్యాన్ని తుడిచిపెట్టేందుకు ఔరంగజేబు చేయని ప్రయత్నం లేదు. ఇరువది అయిదు సంవత్సరాలు తన సర్వశక్తులు ఒడ్డి ఎడతెగని పోరాటాలు గలిపి చివరకు ఈ హిందూ శక్తి అజేయమని తెలుసుకుని నిరాశ చెందాడు. ఇంకొకవైపు బుందేలు ఖండ్‌లో ఛత్రసాల్ హిందూ సామ్రాజ్యాన్ని స్థాపించడం. ఒకరి తర్వాత ఒకరుగా మొగలాయి సర్దారులందరూ అతని చేతుల్లో ఓడిపోవటం ఔరంగజేబును మరింత దుఃఖితుణ్ణిగా చేసింది.

నిరాశా నిస్పృహలతో క్రుంగిపోయి ఔరంగజేబు 1707 లో మరణించంతో అతని దుష్టపరిపాలన అంతరించింది. తర్వాతి కాలంలో మొగలు పాదుషాల ప్రభావం హిందూ భూమిలో సన్నగిల్లింది. వారు తమ రాజ్యాన్ని విస్తరింపజేయటమటుంచి, ఉన్నదాన్ని కాపాడుకోలేని స్థితికి దిగజారిపోయారు.

కూలిపోతున్న ఈ మొగలు సామ్రాజ్యానికి బహదూర్ షా వారసుడయ్యాడు. అతని మంత్రి ఖాన్‌ఖానా చాల తెలివైనవాడు. అన్నివైపులా ముంచుకువస్తున్న ప్రమాదాలను తమ సైనిక శక్తితో ఎదుర్కొనటం కష్టమనీ, యుక్తితో తప్పించుకోవాలనీ తన రాజుకు సలహాయిచ్చాడు. చంపత్‌రాయ్ మొదట్లో ఏ విధంగా మొగలులకు సహాయం చేసాడో గుర్తుచేసాడు. ఛత్రసాలుడు శూరత్వంలో తండ్రిని మించినవాడు. అట్టి వానితో యుద్ధం చేయటంకంటే ఆహ్వానించి చెలిమి చేసుకోవటం మంచి పని యని చెప్పి బహదూర్‌షాను ఒప్పించి ఛత్రసాలునకు ఆహ్వానాన్ని

పంపించాడు. కాని బహదూర్‌షా పంపిన యీ ఆహ్వానాన్ని బుందేల్ ప్రభువు అంగీకరించలేదు. మంచిమాటలతో పిలిపించి ఔరంగజేబు శివాజీని ఖైదు చేసిన సంగతి అతడు మరచిపోలేదు. కాని తరువాత నిశితంగా పరిశీలించి, అన్ని జాగ్రత్తలు చేసుకొని ఛత్రసాలుడు ఢిల్లీ వెళ్ళాడు. అక్కడ మొగలు రాకుమారులు, సర్దారులు ఇతనికి పెద్దఎత్తున స్వాగతం చెప్పారు. బహదూర్ షా స్వయంగా ఎదురేగి రాజభవనంలోకి ఆహ్వానించాడు. 'మాపై తిరుగుబాటు లేవదీయవద్ద'ని అతనిని బహదూర్‌షా ఎంతో బ్రతిమాలుకున్నాడు. అందుకు ప్రతిఫలంగా ఢిల్లీ దర్బారులో పెద్ద ఉద్యోగాన్నిస్తానని ఆశచూపాడు. వీటన్నిటినీ తిరస్కరించి ఛత్రసాల్ పన్నా నగరానికి తిరిగి వెళ్లాడు.

ఔరంగజేబు తర్వాత మొగలు పాదుషాలైన బహదూర్‌షా, ఫరూఖ్షియర్, మహమ్మద్‌షాలకు ఛత్రసాల్ స్థాపించిన హిందూరాజ్యం వైపు దృష్టి మరల్చడం సాధ్యం కాలేదు. ప్రతి యొక్కడు తన సింహాసనాన్ని, ప్రాణాలను రక్షించుకోవటంలో సతమతమైపోయి, అప్పుడప్పుడు స్వతంత్ర హిందూ రాజుల సహాయం కూడ కోరవలసి వచ్చేది. దక్షిణ భారతంలోని బీజపూర్, గోల్కొండ రాజ్యాలను ఔరంగజేబు నాశనం చేసిన తర్వాత, యావద్దేశంలో మిగిలిన మహమ్మదీయ రాజ్యం మొగలులది మాత్రమే. శక్తిశాలియైన మొగలు పాదుషా ఔరంగజేబు పరిపాలన కాలంలోనే అస్సాము, మహారాష్ట్రం, రాజస్థాన్, బుందేల్‌ఖండ్, పంజాబు మున్నగు ప్రాంతాలలో హిందూరాష్ట్రీయ శక్తులు విజృంభించటంతో మొగలు రాజ్యం క్షీణింప నారంభించింది. మొగలుల పతనంతోబాటు హిందువులలో రాష్ట్రీయ చైతన్యం ప్రబలం కాసాగింది. హిందువులను అవమానిస్తూ, వారిని బానిసలుగా క్రుంగదీసే ఆ విదేశీ మొగలు రాజ్యాన్ని ఛిన్నాభిన్నం చేయాలనే ఆశయం హిందువులలో తీవ్రమయింది. జయపూర్ పరిపాలకుడైన సవాయీ జయసింగు మొగలు పాదుషా

అదుపాజ్ఞలకు లోబడి ఉండినా, అతని మనస్సులో స్వతంత్ర హిందూ రాజ్యం పట్ల ప్రగాఢమైన వాంఛ వుండేది. అందువల్లనే అతడు మాల్వాలో బానిసలుగా మగ్గుతున్న హిందువులను ముక్తులను గావించి, అక్కడ స్వతంత్ర హిందూరాజ్యం ప్రతిష్ఠించడానికి శివాజీ స్థాపించిన హిందూ స్వతంత్ర రాజ్యంలోని వీరయోధుల నాహ్వానించాడు. ఆనాడు స్వదేశరాజు లందరిలోనూ మొగలులను జయించే శక్తి, హిందువులందరిని సంఘటిత పరచ గలిగే సామర్థ్యము ఈ మహారాష్ట్ర రాజ్యంలోనే ఉన్నదని ఆ రాజ పుత్రరాజు గుర్తించాడు. విదేశీయ పరిపాలనను నిర్మూలించి, హిందువు లందరినీ సంఘటితపరచగలిగే శక్తి సామర్థ్యాలు తనలో లేవని గ్రహించడంతోబాటు, ఆ శక్తులెక్కడ లభించునో ఆప్రాంతం నుండి సహాయం కోరటం అతనిలో దేశ ఘాతుకమైన స్వోత్కర్ష, ఇతరుల అభివృద్ధి పట్ల అసహిష్ణుత దూరమై, దేశ శ్రేయస్సునకు మూలాధారమైన కర్తవ్యభావం ఆయనలో మేల్కొన్నదనడానికి నిదర్శనం. మాల్వా యందలి నందలాల్ మండలోయీ అను ప్రసిద్ధ ఠాకూరుకూడ అవే ఆలోచనలే కలిగి ఉండటం చేత మహారాష్ట్రుల సహాయ మర్థించాడు.

ఆకాలంలో మహారాష్ట్రంలో సాహూ మహారాజు పరిపాలిస్తూండే వాడు. అతనిచే 1720 లో నియమింపబడిన పీష్వాబాజీరావు అతి పరాక్రమ వంతుడు. బాజీరావు మనస్సులో శివాజీ వలెనే హిందూదేశ మంతటా హిందూ సామ్రాజ్యంఏర్పడాలనే ఆశయం ఉండేది. అందువల్ల తరుణం కోసం ఎదురుచూస్తున్న బాజీరావు మాల్వా రాజస్థాన్‌లోని రాజ పుత్రులు, బుందేలులు 1728 లో మనస్ఫూర్తిగా ఆహ్వానించటంతోటే ససైన్యంగా మాల్వాకు బయలుదేరి అక్కడి రాష్ట్రీయశక్తుల సహాయంతో మొగలు సుబేదారును ఓడించాడు. విజయం పొందిన తర్వాత అక్కడ హిందువులందరూ బాజీరావును చాలగౌరవించారు.

కాని మాల్వాలో హిందూశక్తులు విజయంపొందడం మొగలు పాదుషాకు సవాలైంది. విజయోత్సాహంతో ఉన్న హిందూవీరులు ఢిల్లీపై కూడ ఏనాడైనా విజృంభించవచ్చు. అట్టి పరిస్థితులను సరిగా ఎదుర్కొనుటకు తగిన కట్టుదిట్టాలు చేయాలని మొగలు పాదుషా యగు మహమ్మద్‌షా పఠాన్ సర్దారగు మహమ్మద్‌ఖాన్ బంగష్‌ను నియమించాడు.

మహమ్మద్‌ఖాన్ బంగష్ విదేశీ పఠాన్ వీరుడు. హిందూదేశం వచ్చి గంగానది యొడ్డున శంషాబాద్ పరగణాల్లోని మావూగ్రామంలో నాలుగు-ఐదువేల పఠాన్ సైన్యంతోస్థిరపడ్డాడు. ఆరాజ్యం స్వైరవిహారం చేస్తున్న ఆ రోజుల్లో కోరినవారికి సహాయం చేస్తు అభివృద్ధి జెందాడు. ఫరూక్షియర్ పాదుషా కాలంలో ముఖ్యులైన యిద్దరు సైయద్ సోదరులకు సహాయంచేసి బుందేల్ ఖండంలో జాగీరును పొందాడు. వారు తమ యిష్టానుసారం ఫరూక్షియర్‌ను పాదుషాను చేసినట్లే, అతనితో అభిప్రాయ భేదం రాగానే గద్దెనుండి క్రిందకు దించేశారు. తమ అవసరంకొద్దీ మహమ్మద్ షాను పాదుషా చేసారు. కాని అతడు ముందుగానే జాగ్రత్తపడి, వారితో మనస్పర్థ లేర్పడగానే వారిద్దరిని చంపించాడు. ఈ పనిలో పాదుషాకు మహమ్మద్‌ఖాన్ బంగష్ సహాయం చేయడంతో 1721 లో అతడు అలహాబాదు సుబేదారయాడు. బుందేల్‌ఖండ్‌లోని తన జాగీరును ఛత్రసాల్ దాడులనుండి రక్షించుకోడంలో ఒక్కొక్కప్పుడతనికి తల ప్రాణం తోకకు వచ్చేది. ఒక పోరాటంలో బంగష్ పుత్రుడైన పీర్‌ఖాన్ చంపబడ్డారు. కాని బంగష్ శౌర్య సాహసాలలో, రణకౌశలంలో ముస్లింలకెంతో అభిమానపరుడైనాడు. అతనిని వారందరు 'రణశార్దూల' అని పిలిచేవారు. బంగష్‌ను అమితంగా సైన్యాన్ని సహాయంగా పంపి, ఛత్రసాల్‌ను జయించమని అతనిని కోరాడు. పాదుషా ఛత్రసాల్ పై విజయం సాధిస్తే మాల్వాలోని మహారాష్ట్రశక్తిని మహమ్మదీయులు సంపూర్తిగా అరికట్టడానికి ధైర్యోత్సాహాలతో ముందుకు వస్తారని పాదుషా ఆశయం.

మహమ్మద్ ఖాన్ తన పుత్రుడైన ఖాయీమ్‌ఖానును సర్దార్ దలేల్ ఖానును ఛత్రసాల్‌పై దాడికి పంపాడు. ఛత్రసాల్ వారిద్దరినీ ఓడించాడు. దలేల్ ఖాన్ చంపాబడ్డాడు ఇది తెలయగానే బంగష్ గొప్ప సైన్యంతో బుందేల్ ఖండ్‌పై విరుచుకుపడ్డాడు. పరిస్థితిని సరిగా అర్థం చేసికొన్న ఛత్రసాల్ జైత్‌పూర్ కోట నాక్రమించి బంగష్‌పై ఎదురు దెబ్బ తీయసాగాడు. అదే సమయంలో బంగష్‌కు ఢిల్లీనుండి అదనపు బలాలు వచ్చి చేరడంతో ఛత్రసాల్‌ను త్వరగానే ఓడించి వేయవచ్చునను కొన్నాడతడు. అంత గొప్ప సైన్యాన్ని ఎదిరించి ఛత్రసాల్ ఎనిమిది నెలల వరకు హోరాహోరిగా పోరాడాడు. కాని చివరకు 1728 డిశంబర్‌లో ఛత్రసాల్ సైన్యం విపరీతంగా నష్టపడింది. అతడు తీవ్రంగా గాయపడ్డాడు. అతడు బంగష్‌ను శరణు కోరి, అతనికి జైత్‌పూర్ కోటను అప్పగించాడు.

అదే కాలంలో బాజీరావు పీష్వాతమ్ముడైన చిమాజీ అప్పా బుందేల్ ఖండ్‌కు పడమటివైపున నున్న ఉజ్జయినికోటను ముట్టడించి యున్నాడు. బాజీరావే స్వయంగా దానికి తూర్పువైపున నున్న గఢామంగళా అడవి ఆవతల దేవగఢ్‌లో విడిసియున్నాడు. కాని మధ్యలో చాల దట్టమైన అరణ్యముండుటచేత బాజీరావు త్వరగా బుందేల్ ఖండ్‌ను చేరుకోలేడని బంగష్ నమ్మి, ఛత్రసాల్‌ను జైత్‌పూర్‌లోనే ఉంచి మిగిలిన ప్రదేశాల నుండి పన్నులు వసూలు చేయుటతో నిమగ్నమై యున్నాడు. విజయంతో చొచ్చుకు వస్తూన్న హిందూ సేనలు సమీపంలో ఉండుటేగాక, ఛత్రసాల్‌కు శివాజీ మొదలు బాజీరావు వరకు హిందూరాష్ట్ర స్వాతంత్ర్యం కోసం జరిగిన ప్రయత్నాలు బాగుగా తెలిసి యుండటంచేత అతనికి బాజీరావు పీష్వా తప్పక సహాయం చేస్తాడని విశ్వాసం కలిగింది. అతడు దుర్గాదాస్ అను విశ్వాస పాత్రుని ద్వారా బాజీరావున కొక ఉత్తరం పంపాడు. ఆ ఉత్తరంలో:

"జో గతి గ్రాహ గజేంద్రకీ సో గతి హై భఈ ఆజ్
బాజీ జాత్ బుందేల్‌నకీ రాఖోబాజీ లాజ్"

అంటే "శ్రీ మహావిష్ణువు గజేంద్రుని రక్షించడానికి వచ్చినట్లే బాజీరావు ఛత్రసాలును విడిపించుటకు రావలె" అని అతడు కోరాడు.

దుర్గాదాస్ 1729 ఫిబ్రవరిలో బాజీరావును గఢామంగళాలో కలిసాడు. ఆ ఉత్తరం చూడటంతోటే బాజీరావు 25 వేల సైన్యంతో బయలుదేరాడు. ఛత్రసాల్ కుమారుడు మార్చి 12 వ తేదీన మహోబావద్ద బాజీరావుతో కలిసాడు. మరునటి రోజున ఛత్రసాల్ స్వయంగా బాజీరావును కలిసి గౌరవించాడు. వారిద్దరూ ఆలోచించి, బంగష్‌ను ఓడించటానికి ఒక పథకం వేశారు. బాజీరావు నాయకత్వంలో హిందూ సైన్యం దట్టమైన అడవులు దాటి ఇంత త్వరలో రావటంతో బంగష్‌కు పరిస్థితి ఎదురైంది. అతని వద్ద పెద్ద ఫిరంగులుండటం వల్ల, బాజీరావు వద్ద అప్పట్లో యుద్ధ సామాగ్రి లేకపోవుట మూలాన బాజీరావు అతనిపైన తానుగా దాడి చేయక, ఆహారపదార్థాలు చేరనివ్వకుండా మాడ్చాలని నిశ్చయించుకొన్నాడు. బంగష్ కోరికపై అతని కొడుకైన ఖాయింఖాఁ పాదుషా వద్దనుండి తగిన సహాయం పొంది తండ్రిని చేరవచ్చాడు. కాని పొంచియున్న హిందూసైన్యం అతనిని తండ్రితో కలవనివ్వక జైత్‌పూర్ సమీపాన సుపేలో ఓడించింది. అతడు కాలికి బుద్ధిచెప్పాడు. దానితో అతని వెంటనున్న ఆహారపదార్థాలు, యుద్ధసామగ్రి బాజీరావు వశమైనాయి, జైత్‌పూర్ కోటలో నున్న బంగష్ ఆకలితో నకనకలాడి మే మాసాంతంలో "బుందేల్‌ఖండ్ వదలిపెట్టి పోతాను, మరెప్పుడూ ఛత్రసాల్‌పై దండెత్తాలని కలలోగూడ ఆశింపను" అని వ్రాసియిచ్చి బాజీరావు శరణు కోరాడు. వర్షాకాలానికి ముందే యుద్ధం చాలించడం క్షేమకరమనీ, ఆనాటికి లభించిన విజయం చాలునని భావించి, బాజీరావు బంగష్‌ను ప్రాణాలతో వదిలాడు.



ఛత్రసాల్, బాజీరావు పీష్వాల కలయిక

ఛత్రసాల్ తన రాజ్యాన్ని మూడు భాగాలుగా విభజించి, తన పుత్రు లిద్దరికీ రెండు భాగాలను బాజీరావున కొక భాగం పంచాడు. జీవిత మంతా యుద్ధాలలో గడిపిన తరువాత 1731 డిసెంబర్ 14 వ తేదీన ఛత్రసాల్ తన 89 వ ఏట శాశ్వతంగా విశ్రాంతి పొందాడు. ఈ విధంగా ఢిల్లీకి అతి సమీపంలో స్వతంత్ర హిందూ రాజ్యాన్ని స్థాపించి, 1670 నుండి 1731 వరకు 60 సంవత్సరాల సుదీర్ఘకాలం ప్రకాశించిన హిందూ తేజోరాశి హిందూరాష్ట్రానికి స్వాభిమాన కేంద్రంగాను, ఉజ్జ్వల స్ఫూర్తి గాను విలసిల్లింది.

# దుర్గాదాసు రాఠోడు

"ఐసనీ సుత ఐసా జనే, జైసా దుర్గాదాస్" అనేది ఒక హిందీ కావ్యంలోని పంక్తి. "కంటే దుర్గాదాసు వంటి బిడ్డను కనాలి" అని దాని భావం. నేటికీ రాజస్థాన్ ప్రాంతంలో స్త్రీలు ఆ విధంగా భావిస్తుంటారు. మహావీరుడైన దుర్గాదాసు చనిపోయి నేటికి రెండు వందల సంవత్సరాలు దాటినా, రాజపుటానాలో నేటికీ అనేకమందికి అతని పేరు అభిమాన ప్రదంగా వుంటుంది. అతడు మహారాజుకాడు. పెద్ద పెద్ద యుద్ధాలు గెలిచినవాడుకాడు. అసలు వీరులకు రాజపుటానాలో కొరతలేదు. ఎందరు వీరులున్నా వారందరికన్నా దుర్గాదాసంటే విశేషమైన భక్తి, ప్రేమ ఈనాటికీ అచట కనిపిస్తాయి. కాలచక్ర గమనంలో అనేకమంది వీరుల పేర్లు మరుగుపడినా, దుర్గాదాసు పేరు మాత్రం ఎవరూ మరువలేదు; మరువలేరు కూడ.

పదిహేడవ శతాబ్దపు మొదటి భాగంలో మార్వారు దేశాన్ని యశ్వంతసింహ మహారాజు పాలిస్తూండేవాడు. ఆయన వద్ద దివాను అజకరణుడు. ఆతనికి 1638 లో సాలవే అను గ్రామంలో దుర్గాదాసు అనే కుమారుడు కలిగాడు. దుర్గాదాసు చిన్నతనం నుండే ధైర్య సాహసాలు

కలిగి అన్యాయాన్ని ఎదిరించటానికి ఎల్లప్పుడు ప్రయత్నిస్తూ వుండేవాడు. ఆ రోజులలో మహమ్మదీయ అధికారులు తమకు చెందిన ఒంటెల మందలను పచ్చని పంటలతో కళ కళలాడే హిందువుల పొలాలపైకి మేతకుగాను త్రోలేవారు. అదేమిటంటే ఏం ప్రమాదం విరుచుకు పడ్తుందోనని భయపడి హిందువులు ఆటువంటి అత్యాచారాలను సహించి ఊరుకునే వారు. బాలుడైన దుర్గాదాసు ఒకసారి తమ పొలంలో కాపలా కాస్తూండగా నవాబుగారి ఒంటెలమంద అతని పొలంమీదకు వచ్చిపడింది. పంట అంతా పాడైపోతోంది. అది చూచిన దుర్గాదాసు ఒంటెల కాపరి దగ్గరకు పోయి తమ పొలంలోనుండి ఆ ఒంటెలను తొలగించమని మర్యాదగా చెప్పాడు. తమ ఒంటెలు పంటను తింటుంటే ఒక హిందువుడు వద్దని చెప్పటం, తాము వినటం కూడా కొత్త అనిపించింది ఒంటెల కాపరికి. అతనికి కోపం వచ్చింది. అతడు దుర్గాదాసు మాట వినిపించుకో లేదు. ఒంటెలను పొలంనుండి తొలగించలేదు. అది చూచిన దుర్గాదాసుకు కోపం వచ్చింది. వెంటనే పొలంలోపడి పంటను తింటున్న ఒక ఒంటెను తన వద్దనున్న కత్తితో పొడిచి చంపాడు. ఆ తర్వాత పరిస్థితులు ఎట్లా మారుతాయనే ఆలోచన అతనికి కలుగలేదు. అన్యాయాన్ని ఎదిరించటమే అతని లక్ష్యం. పువ్వు పుట్టగనే పరిమళిస్తుందంటారు యిదే గదా!

మార్వారు రాజు యశ్వంతసింహుడు ఢిల్లీ పాదుషా ఔరంగజేబుకు సామంతుడై, అతని క్రింద సర్దారుగా వుండేవాడు. యశ్వంతసింహుడు పరాక్రమవంతుడైన సేనాపతి. అతని వలననే ఔరంగజేబు అనేక యుద్ధాలలో గెలిచాడు. పాదుషా కొలువులోని అనేకమంది తురక సరదారులకన్న యశ్వంతసింహునకు పలుకుబడి హెచ్చు. అట్టి పరాక్రమ వంతుడు, గౌరవపాత్రుడు అయిన హిందూ సరదారుల విషయంలో ఔరంగజేబు ఎప్పుడూ సంశయగ్రస్తుడుగానే వుండేవాడు. హిందువులను మహమ్మదీయ మతంలోనికి మార్చుటకు అప్పటికి దాదాపు వేయి సంవత్స

రాలుగా ఈ దేశంలో కృషి జరుగుతూంది. అట్టి కృషిచేసిన్ల వారిలో అగ్రగణ్యుడు ఔరంగజేబు. అతడు హిందువులను అనేక బాధలకు గురి చేస్తూండేవాడు. తనవద్ద కొలువుచేసే పరాక్రమవంతుడైన హిందూసర్దారు డెవరైనా ఈఅత్యాచారాలను చూచి తనను వ్యతిరేకిస్తారేమోనని,అట్టి వారిని మాయోపాయంతో సంహరించడానికి గూడా యితడు వెనుకాడేవాడుకాదు. అట్టి ప్రతీకార వాంఛ వారిలో కలుగకుండా వుండేందుకుగాను, పరాక్రమ వంతులైన హిందూ సర్దారులను అఫ్ఘనిస్తాను. అస్సాము వంటి దూరదేశాల లోని తిరుగుబాటుల నణచడానికి పంపేవాడు. ఆ యుద్ధాలలో వారు చనిపోయినా సరి. లేదా వారిని ఏదో మాయచేసి అంతంచేసేందుకు ఔరంగజేబు యత్నం చేసేవాడు. ఒకసారి అఫ్ఘనిస్తానములో చెలరేగిన తిరుగుబాటు నణచిరమ్మని ఔరంగజేబు యశ్వంతసింహుని పంపాడు. కష్టసాధ్యమైన అఫ్ఘనిస్తానమును జయించి, తిరుగుబాటు నణచి తిరిగి వస్తున్న యశ్వంతసింహుడు స్వదేశం చేరినట్లయితే తన ప్రతిష్ఠకు ప్రమాదమని భావించిన ఔరంగజేబు మార్గమధ్యంలోనే ఆతనికి విషమిచ్చి చంపించాడు. విశ్వాస పాత్రుడైన హిందూ సర్దారునకు కృతఘ్నుడైన ఔరంగజేబు నుండి లభించిన ప్రతిఫలమిది.

యశ్వంతసింహుడు చనిపోయిన తర్వాత (10-12-1678) అతని మార్వారు రాజ్యమును ఔరంగజేబు మొగలు సామ్రాజ్యములో చేర్చుకోన వలెనని నిర్ణయించాడు. కొందరు సర్దారులను ససైన్యంగా మార్వారుపై దాడికి పంపాడు. కాని వారి ప్రయత్నం ఫలించలేదు.

యశ్వంతసింహుడు చనిపోయిననాటికి దుర్గాదాసునకు నలుబది సంవత్సరాల వయస్సున్నది అతడు అప్పట్లో యశ్వంతసింహునితోనే ఉన్నాడు. యశ్వంతసింహునకు జరిగిన మోసం, అన్యాయం గుర్తించిన దుర్గాదాసుకు, ఏ విధముగా నైనాసరే పరదేశీయులు, విధర్మీయులు అయిన మొగలాయీలను ఎదిరించి నాశనం చేయాలనిపించింది.

యశ్వంతసింహుని మరణం తర్వాత ఆతని భార్యలిద్దరూ కాబూలు నుండి మార్వారుకు తిరిగి వస్తూండగా, లాహోర్‌లో మజిలీ చేసినప్పుడు వారికి యిద్దరు కుమారులు కలిగారు. పుట్టిన వెంటనే వారిలో ఒకడు చనిపోయాడు. రెండవ వానికి అజితసింహుడని నామకరణం జరిగింది. ఈ వార్తలు తెలిసిన మార్వారు సంస్థానములోని యశ్వంతసింహుని మంత్రులు తమ రాజు మరణించిన తరువాత, అతని వంశాంకురమైన అజితసింహుని మార్వారుకు రాజుగా అభిషేకము చేయమని ఔరంగజేబును ప్రార్థించారు. తమ రాజును ఔరంగజేబు చంపించాడని తెలిసికూడ, ఆ విదేశీ దురాక్రమణదారుని, దుర్మార్గుని యాచిస్తూ హిందూ మంత్రులు ఢిల్లీకి వెళ్లారు. కాని ఔరంగజేబు ఆలోచనలు వేరుగావున్నాయి. యశ్వంత సింహుని భార్య లిద్దరను తన జనాన్‌ఖానాలో వుంచి అజితసింహుని చిన్న తనంలోనే మహమ్మదీయునిగా మార్చి పెంచి పెద్దచేసి అతనికి మార్వారు రాజ్యం యివ్వాలని అతడి ఆలోచన. అందుచేత అతడుయశ్వంతసింహుని భార్యలను, అజితసింహుని జాగ్రత్తగా ఢిల్లీకి తీసికొనివచ్చి (1679 జూన్ చివరలో) తన అంతఃపురంలో బందీ చేసాడు. ఈ వార్త వినిన దుర్గాదాసు, ఇతర సర్దారులు సహించలేకపోయారు. వారిలో పౌరుషాగ్ని రగుల్కొంది. యశ్వంతసింహునికి ఒక్కడే కుమారుడు కాబట్టి అతనిని ఎట్లాగయినా రక్షించి, మతం మార్పిడి జరుగక ముందే మార్వారు సింహాసనం ఎక్కిం చాలని దుర్గాదాసు రాఠోడు నిర్ణయించుకున్నాడు. అందే మృత్యుదేవత గుహ లాంటి ఔరంగజేబు అంతఃపురం నుండి రాణిని, యువరాజును, సురక్షితంగా తప్పించుకు తీసుకురావాలి. అటువంటివి చేయడానికి శక్తి కన్న యుక్తి ప్రధానమని గుర్తించిన అతడు ఒక చక్కని పథకం వేసి. ఔరంగజేబు కన్నుగప్పి రాణిని యువరాజును అంతఃపురంనుండి మార్వారుకు చేర్చాడు. అది దుర్గాదాసులోని సామర్థ్యానికి ఒక గీటు రాయిగా చరిత్ర కారులు చెపుతారు.

మార్వారు చేరిన యశ్వంతసింహుని భార్య తన కుమారుని సింహాసన మెక్కించి తానే స్వయంగా పరిపాలనా వ్యవహారాలు చూచు కోటం ప్రారంభించింది. కాని దుర్మార్గుడైన ఔరంగజేబునుండి ఏ క్షణా న్నైనా ప్రమాదం రావచ్చునని గుర్తించిన దుర్గాదాసు అజితసింహుని రాజపుటానాలోని అప్పట్లో శక్తివంతుడుగానున్న హిందురాజు రాణా రాజ సింహుని రక్షణలో వుంచాలని నిర్ణయించాడు. రాజసింహుడు అతనికి శరణు యివ్వడానికి అంగీకరించాడు. కొద్దిమంది రాజపుత్ర సైనికులను వెంటబెట్టుకొని దుర్గాదాసు అజితసింహుని మేవాడు రాణావద్దకు తీసుకు పోతుంటే మార్గమధ్యంలో ఆరావళీ కొండలలో మొగలుసైన్యం వారిపై బడింది. ఆ యుద్ధంలో చాలమంది హిందూ వీరులు మరణించారు. కాని యువరాజు అజితసింహుడు మాత్రం మొగలులకు చిక్కలేదు. అతడు సురక్షితంగా మేవాడు, చేరాడు. మేవాడులో రాణారాజసింహుడు అతనిని పెద్దపెట్టున స్వాగతమిచ్చి రాజమర్యాదలతో అతనిని 'కేలువ' అనుచోట విడిదిలో వుంచాడు. అక్కడే ససైన్యంగా దుర్గాదాసుకూడా వుంటూ అజిత సింహునికి ఏ ప్రమాదం రాకుండా జాగ్రత్తపడ్డాడు.

అజితసింహుడు తనవద్దనుంచి తప్పించుకొని పోయిన తర్వాత ఎలాగైనా అతన్ని మళ్ళీ బంధించాలనీ, అది కుదరకపోతే చంపివేయాలనీ ఔరంగజేబు ఎంతో ప్రయత్నించాడు అందులకై ఎంతో ధనంకూడా ఖర్చు చేసాడు. కాని దుర్గాదాసు రక్షణలోవున్న అతనిని ఏమీ చేయలేక పోయాడు. వేరుదారిలేక కోపం అధికమై ఒక పెద్దసైన్యాన్ని దుర్గాదాసు పైకి పంపించాడు. అకస్మాత్తుగా పైన విరుచుకు పడుతున్న ఈ మొగలాయి సైన్యాన్ని ఎదిరించేటందుకు తమకు సహాయం రావసిందిగా, దుర్గాదాసు అజితసింహుని పక్షాన రాజస్థాంలోని అనేక మంది రాజులకు ప్రార్థనా పూర్వకమైన ఆహ్వానాలు పంపాడు. వాని నందుకొని చాలామంది ససైన్యంగా అజితసింహునకు సహాయం చేసేందుకు వచ్చారు.

ఔరంగజేబు తన సైన్యానికి తన కుమారుడైన అక్బరును ప్రముఖ సేనాధిపతిగా పంపించాడు. అక్బరు చాలా చురుకైనవాడు. యుద్ధరచనలో అతనికి మంచి నేర్పుంది. 22 సంవత్సరాల వయసులోనే అతడు అనేక విజయాలు సాధించాడు. అతడంటే తండ్రికి ప్రేమాభిమానాలు, విశ్వాసము ఎక్కువ. ఔరంగజేబు స్వయముగా ఈ దండయాత్రకు కావలసిన ఏర్పాట్లు పర్యవేక్షించాడు. ఈసారి మొత్తం రాజస్థానం తన హస్తగతమవుతుందని ఆశించాడు. మొగలు సైన్యంతో పోలిస్తే రాజపుత్రులసైన్య సంఖ్యాబలంలోగాని, శస్త్రాస్త్రాలలో గాని, ధనంలోగాని చాలా చిన్నదీ, బలహీనమైనదికూడా. కాని దట్టమైన కొండలు అడవులు ఆశ్రయించి గుండెలు నిండిన దేశభక్తితో ఉరకలువేసే రాజపుత్రసైన్యం మొగలు సైన్యాన్ని ముప్పుతిప్పలు పెట్టింది. అనేక రంగాలలో మొగలులు ఓడిపోయారు ఎంతో సైన్యం నష్టమయిన తర్వాత అక్బరు ఆరావళీ కొండలలో ఉండలేక చిత్తూరు దరిదాపులకు చేరుకున్నాడు. తాను రాజపుత్రులను గెలవటం అసంభవమనే భావం అతని హృదయంలో నెలకొంది. తాము కొండలు వదలి మైదానంలోకి వచ్చి, అక్బరు నెదిరించ లేమని రాజపుత్రులుగూడ భావించారు. ఎవరికివారే ఏదో విధంగా సంధి చేసుకోవాలనుకున్నారు. కాని రాజపుత్రులే ముందుగా రాయబారం పంపారు. వచ్చిన రాయబారులు అక్బరు మనస్సులోని ఓటమిని గూర్చిన భయాన్ని పసి గట్టారు. అయితే ఔరంగజేబు మాత్రం కుమారునిపై పదే పదే యుద్ధం కొనసాగించమని ఒత్తిడి చేస్తున్నాడు. ఈ అదనులోనే ఆ తండ్రి కొడుకుల మధ్య మనస్పర్థలు పెంచాలని రాజపుత్రులు ప్రయత్నించారు. మొగలు వంశంలో ముసలం పుడితే తమ కార్యం సులభమవుతుందని రాజపుత్రుల ఆశ. రాజపుత్రుల పరాక్రమం అక్బరు మెదడుపై చెరగని ముద్ర వేసింది. అది వారి ప్రయత్నానికి భూమిక నేర్పరిచింది. "మాకు పాదుషా వారితో యుద్ధం చేయాలని గాని, మొగలు సామ్రాజ్యాన్ని

నాశనం చేయాలనిగాని లేదు. మీవలెనే పాదుషావారు కూడా మాపైన హృదయపూర్వకమైన ప్రేమను ప్రదర్శించి, గౌరవిస్తే, మేము పూర్వం లాగానే విశ్వాస పాత్రులమై మీ కొలువు చేస్తాము. పూర్వపు అక్బరు పాదుషా మా రాజపుత్రులను గౌరవించి, మా సహాయముతో కీర్తి ప్రతిష్ఠల నార్జించాడు. మీరుకూడా అట్లు చేస్తే మా కానంద"మని రాయబారులు అక్బరుతో చెప్పారు.

రాజపుత్రుల యీ మాటలు అక్బరుకు నచ్చాయి. గత చరిత్ర ఆతని కళ్ళముందు ఒకసారి మెదలింది. నాడు అక్బరు చక్రవర్తి హిందువులపట్ల ఔదార్యం ప్రదర్శించటం వల్లనే గదా ఈ దేశంలో మొగలు సామ్రాజ్యానికి చక్కని పునాది పడింది! అతని స్నేహపూర్వక ప్రవర్తన వలననే రాజపుత్ర స్థానంలోని ప్రముఖ సంస్థానాలైన జోధపూర్, జయపూర్ రాజులు ఎంతటి కష్టాలనైనా ఎదిర్చి, అక్బరుకు విజయాలు సంపాదించిపెట్టారు! అంతేగాక అక్బరు మరణించిన తరువాత దాదాపు వంద సంవత్సరాలవరకూ రాజపుత్రులు మొగలాయీలకు సహాయంచేస్తూ వచ్చారు. తన తండ్రి ఔరంగజేబు కొలువులోకూడా చాలమంది రాజపుత్రులు అనన్య సేవా భావం ప్రదర్శించారు. కాని తన తండ్రి హిందూజాతిని వారి ధర్మాన్ని నాశనం చేయాలని భావించి వారిని పీడించటం వలనే కదా అనేక సమస్యలు కష్టాలు ఎదురుతున్నాయి. ఈ విధమైన భావాలు అతనిలో చెలరేగాయి. తన తండ్రి ఆ విధంగా చేయటం అక్బరున కెంతమాత్రం యిష్టంలేదు. రాజపుత్రుల రాయబారం అతని మనస్సులోని యీ ఆలోచనకు మరింత దోహదం చేసింది. వెంటనే తన యీ అభిప్రాయాన్ని తండ్రికి తెలియపరిచాడు అక్బరు. "మనసైన్యం చాలా యిబ్బంది పడుతోంది. క్రమంగా వారిలో ఉత్సాహం వీగిపోతోంది. కాబట్టి రాజపుత్రులతో సంధిచేసుకొని ససైన్యంగా రాజధానికి తిరిగివచ్చుటకు అనుమతించ వలసిం"దని తండ్రికి వ్రాశాడు. ఔరంగజేబునకది

నచ్చలేదు. అందుచేత ఆతను తన కుమారుడగు అక్బరును పిరికివాడని అసమర్థుడని నిందిస్తూ జాబు వ్రాసాడు. తండ్రి ఉత్తరం అక్బరును చాలా బాధించింది. ఆయనలోని కోపం పెల్లుబికింది. ఇదే అదనుగా రాజపుత్ర రాయబారి, "మీ తండ్రి యన్యాయము, అక్రమము నీకు తెలిసిందిగదా. నీవు ఆనాటి అక్బరువంటి పౌరుష వంతుడవు. నీవు యీనాడు నీ తండ్రి అన్యాయాన్ని ఎదిరించి ప్రజలలో శాంతిని, సామరస్యాన్ని నెలకొల్పాలి. అందుకు మేమంతా నీకు హృదయ పూర్వకంగా సహకరిస్తాము. అందుకు గాను నీవే ఢిల్లీ సింహాసనం అధిష్ఠించటం అవసరం. నీ తాత తండ్రులు కూడా యీ విధంగానే రాజ్యానికి వచ్చారుగదా" యని అగ్గిలో ఆజ్యం పోసినట్లు రెచ్చగొట్టారు.

ఈ పథకమంతా దుర్గాదాసుని ప్రజ్ఞావిశేషమే. తన ప్రభువైన యశ్వంతసింహుడు జీవించి యున్ననాటినుండి గూడ దుర్గాదాసు విదేశీ విధర్మ పాలనను అంతం చేయాలని ఆలోచిస్తూనే వుండేవాడు. తమకు ప్రమాదం వచ్చినపుడు దానిని దాటేందుకు మాత్రమే తమ బలిమి, యుక్తి పరిమితం చేయకుండా సర్వకాల సర్వావస్థలయందు విదేశీ దురాక్రమణను పారద్రోలే ఉపాయా లాలోచించే దుర్గాదాసు వంటి వీరుడుండబట్టి రాజపుత్ర స్థానంలో ఆనాడు యింకా ఒక హిందూ రాజ్యం నిలబడ గలిగింది. దుర్గాదాసు పథకంలోని మొదటి యత్నం ఫలించింది 1-1-1681 న అక్బరు తండ్రిని ధిక్కరించి తానే మొగలాయీ చక్రవర్తినని ప్రకటించు కున్నాడు. ఇంక రాజపుత్రులందరను కలిపి, అక్బరును ముందుంచుకొని ససైన్యంగా ఢిల్లీపై దండెత్తి ఔరంగజేబును నాశనం చేయటం అతని పథకంలోని ప్రధాన అంశం. దానికై కృషి ప్రారంభించాడు దుర్గాదాసు.

అప్పటికి ఔరంగజేబు అజ్మీరులో ఉన్నాడు. అతని వెంట కొద్ది పాటి సైన్యం మాత్రం వుంది. అక్బరు యొక్క పెద్ద సైన్యాన్ని అతడు

ఎదిరించి నిలబడలేడు. అజ్మీరుకు అక్బరు ససైన్యంగా చేరడానికి రెండు రోజులు ప్రయాణం చాలును. కాని అతిచతురుడైన ఔరంగజేబు క్షణాలపై యొక కుటిల నీతి ప్రయోగించి ప్రమాదంనుండి బయటపడ్డాడు. "నీ చాతుర్యం నాకు చాలా ఆనందం కలిగించింది. కాని నీవు మాత్రం చాలా సావధానంగా వుండాలి. మన పథకం ఏ మాత్రం తెలిసినా ప్రమాదం. రాజపుత్రుల నందరినీ నా మీదకు దండయాత్రకుతీసుకొనివస్తూ వారిని ఒకరి తరువాత ఒకరుగా హతమార్చాలి. జాగ్రత్త. వారిలో ఏ ఒక్కడూ పారిపోకుండా చూడాలి. ఆ విధంగా చేయగలిగితే విజయం మనదే. నా తదనంతరం యింక నా రాజ్యం నిష్కంటకం అవుతుంది" అని ఒక జాబు వ్రాసి దానిపై తన సంతజము, రాజముహరు వేసి ఒక మనిషి ద్వారా, రహస్యంగా పంపుతూ ఆ జాబు ప్రయత్న పూర్వకంగా రాజ పుత్రుల చేతికి చేరేటట్లు చేశాడు. ఔరంగజేబు స్వదస్తూరీతో రాజముద్రతో ఉన్న ఆ జాబును రాజపుత్రులు చదివి అక్బరు ప్రవర్తనను అనుమానిం చారు. ఇది ఔరంగజేబు చేసిన మోసము, యుక్తియని దుర్గాదాసు వారికి ఎంత చెప్పినా ప్రయోజనం లేకపోయింది. వారు అక్బరుతో కలిసి అజ్మీరుపై దాడి చేయుటకు వెనుకముందాడి కాలయాపన చేసారు. ఔరంగజేబు ఆశించినట్లే జరిగింది. తన కుమారుని దాడినుండి తప్పించు కొనుటకు, సైన్యమును సమీకరించుకొని యుద్ధసన్నద్ధుడగుటకు కావలసిన వ్యవధి అతనికి లభించింది. లేకుంటే ఔరంగజేబు అజ్మీరులోనే అక్బరుకు పట్టు బడేవాడు.

దుర్గాదాసు పథకమంతా వృధా అయింది. అతడు స్వయంగా రాజగావుంటే అట్లా జరిగేదికాదు. ఐనా దుర్గాదాసు అధైర్యపడలేదు. తన యత్నాన్ని విరమించలేదు. తాను మాత్రం అక్బరును వదలలేదు. తరువాత క్రమంగా అతనిపై రాజపుత్రులకుగూడా మళ్ళీ నమ్మకం ఏర్పడింది. కాని యిది జరిగేలోగా చక్కని అవకాశం చేజారిపోయింది గదా! ఔరంగజేబు



దుర్గాదాసు ఎదుట ఔరంగజేబు కొడుకు 'అక్బరు' తానే చక్రవర్తి నని ప్రకటించుకున్నాడు

ముందు జాగ్రత్తలు చేసుకోవటం వలన తనపని క్లిష్ట మన వచ్చని దుర్గాదాసు భావించాడు. అందుకని ఒక యత్నం విఫలమైతే మరో ఎత్తు ఎత్తాడు. అప్పట్లో దక్షిణాన ఛత్రపతి శివాజీ కుమారుడైన శంభాజీయొక్క హిందూ సామ్రాజ్యం ఔరంగజేబును సతమతం చేస్తూవుంది. ప్రమాదాన్ని గుర్తించి ఔరంగజేబును ఎదిరించటానికిగాను రాజపుత్ర, మరాఠా, హిందూరాజుల సైన్యాన్ని కలపాలని అతను భావించాడు. అందుకుగాను మొదటి మెట్టుగా అక్బరును వెంటబెట్టుకొని శంభాజీని కలిసేందుకు దక్షిణానికి బయలుదేరాడు.

మార్గంమధ్యంలో నర్మదానదిని దాటిన వెంటనే అక్బరు 9-5-1681 నాడు శంభాజీకి ఒక జాబు వ్రాసాడు. దానిలో "మా తండ్రి ఔరంగజేబు పాదుషా అయినప్పటి నుండి ఈ దేశంలో హిందువులను, హిందూధర్మాన్ని సర్వనాశనం చేయాలని నిశ్చయించుకున్నాడు. అకారణంగా రాజపుత్రులతో అతడు జరిపిన యుద్ధాలకు ఇదే కారణం. నిజంగా తమ దేశంలోని ప్రజల సంరక్షణే రాజులయొక్క పని. కాని ఔరంగజేబు ప్రజలను పీడిస్తున్నాడు. దానివలన దేశానికి చాల నష్టం కలుగుతుంది. కాన ఔరంగజేబును సింహాసనం నుండి దించవలసిన అవసరంవుంది. ఈ పనిని నేను చేయదలచాను మీరు సహాయంచేస్తే ఆ పని తప్పక సాధించవచ్చు. ఆ తర్వాత నేను నామ మాత్రంగా సమష్టిగా పాదుషాగా వుంటాను దేశ పరిపాలనను మీరందరూ నిర్వహించవచ్చు. ఈ యత్నంలో శ్రీ దుర్గాదాసు రాఠోడు వారి మార్గ దర్శనంలోనే నేను కృషిచేస్తున్నాను. వారు ప్రస్తుతం నా వెంట వస్తు న్నారు. ఈనాడు రాజపుత్రులందరూ నాకు సహాయం చేయటానికి సిద్ధంగా ఉన్నారు. నా విషయంలో మీరెట్టి సందేహం పెట్టుకోకుండా సహకరించ గోరుతాను" అని వ్రాసాడు. ఈ విధంగా శంభాజీకి జాబు పంపిన తర్వాత అక్బరు, దుర్గాదాసులు అక్కడ ఆగలేదు. ఢిల్లీ పాదుషా సైన్యం

వారి ఆచూకీ గ్రహించి తరుముకుంటూ వారి వెనుకనే వస్తూండడం వలన శంభాజీ వద్దనుండి తిరుగు జాబు వచ్చేవరకు ఆగకుండా 11-5-1681 నాటికి వారు ఖాన్‌దేశ్ నుండి మహారాష్ట్రానికి వచ్చారు. పాదుషా యొక్క సుబేదారు ఖాన్ జహాన్‌కు వీరిద్దరు దక్షిణానికి బయలు దేరిన విషయం తెలిసింది. వారిని అడ్డగించటానికి అతడు నాసికవైపుగా ససైన్యంగా వెళ్ళాడు. కాని అంతకు క్రితం రోజే వారు నాసికనుండి బయలుదేరి త్ర్యంబక లోయగుండా కొంకణ దేశాన్ని చేరారు. అక్కడ వీరితో శంభాజీ అనుచరులు కలిసి వారిని వెంటబెట్టుకొని రాయగఢకు ఉత్తర దిశను యిరువదిమైళ్ళు దూరంగా అంబానది ఒడ్డుననున్న 'పాలి' యనే గ్రామానికి వెళ్ళారు. అక్బరును అక్కడేవుంచి అతని రక్షణకు అన్ని ఏర్పాట్లు చేశారు (1-6-1681).

అక్బరు దగ్గరనుండి శంభాజీకి జాబుచేరేనాటికి శంభాజీ రాజయి సంవత్సరం మాత్రమే గడిచింది. ఛత్రపతి శివాజీ మహరాజు 4-4-1680న పరమపదించాడు. తండ్రి బ్రతికియున్నప్పుడు శంభాజీ ప్రవర్తన సరిగా లేనందువలన శివాజీ అనంతరం అతడు సింహాసనానికి రాకూడదని మహారాష్ట్ర సరదారులు భావించారు. ఈ విధమైన వ్యతిరేక వాతావరణంలో శంభాజీ రాజయ్యాడు. రాజైన తరువాత గూడ వారు శంభాజీతో మనఃస్ఫూర్తిగా సహకరించలేదు. తన రాజ్యంలో పరిస్థితి యిట్లా వున్నప్పటికీ ఢిల్లీ పాదుషాను వ్యతిరేకించడానికిగాను అక్బరు తనదగ్గర వుండటం ఒక సదవకాశంగా భావించిన శంభాజీ అక్బరును తన రాజ్యంలో వుండనిచ్చాడు. దానివలన ఢిల్లీ చక్రవర్తి కుమారుడే తమతో చేరినప్పుడు, ఔరంగజేబును తాము విజవంతంగా ఎదిరించ వచ్చుననే ఆత్మవిశ్వాసం మహారాష్ట్రలోని హిందూ వీరులందరిలోనూ నిర్మింపబడింది. ఛత్రపతి శివాజీ జీవించి యుండగా 1672 ఫిబ్రవరిలో సాల్హేర్ వంటి

సమతల మైదానాలలో జరిగిన యుద్ధాలలో ఎంతో పెద్ద సైన్యంతో వచ్చిన పాదుషా సైన్యం హిందువుల చేతుల్లో ఓడిపోయింది. ఇంక కొండ ప్రదేశాలలో జరిగే యుద్ధాలను గురించి వేరు చెప్పవలసిందేమీలేదు. ఈనాడు సమతల మైదానాలలో జరిగే యుద్ధాలలోకూడా హిందువులు గెలువగలరనే నమ్మకం మహారాష్ట్రంలోవున్న వారికిమాత్రమేగాక, సుదూర రాజ్యాలలోవున్న దుర్గాదాస్ లాంటివారికి కూడాఉండేది. అట్టి సమైక్య హిందూ శక్తిని, అక్బరును వినియోగించుకొని అతని తండ్రియైన ఔరంగజేబును సింహాసనంపై నుండి దించి, ఉత్తరహిందూదేశంలో స్వరాజ్యం స్థాపించ వచ్చునని దుర్గాదాసు ఊహ. అట్టి ఆలోచనతోనే శంభాజీ అక్బరును తన రాజ్యంలో ఉండనిచ్చాడు. శంభాజీ అక్బరుకు యిచ్చిన చక్కని స్వాగత సత్కారాలు చూచి దుర్గాదాసుకు తన పథకం విజయవంత మవుతుందనే ఆశ కలిగింది.

అక్బరు శంభాజీల మధ్య రాయబారాలు ప్రారంభమయాయి. శంభాజీ పంపగా నేతాజీ పాల్కర్, హీరోజీ ఫర్చంద్‌లు అక్బరు దగ్గరకు సంప్రదింపులకు వచ్చారు. వారి వెంట రత్నఖచితహారములు, కొంతధనం అక్బరుకు కానుకలుగా పంపబడ్డాయి. మాటలాడటం అయిం తర్వాత హీరోజీ ఫర్చంద్ రాయగడ్ తిరిగివచ్చాడు. కాని నేతాజీ పాల్కర్ మాత్రం సంప్రదింపుల అనంతరం అక్బరు దగ్గరనే పదిహేను రోజులు మకాం చేసాడు. నేతాజీ పాల్కర్ లోగడ మహమ్మదీయుడై ఢిల్లీ పాదుషా వద్ద కొలువు చేసినందువలన అతనికి అక్బరుభాష, ఆచార పద్ధతులు బాగా తెలుసును. అవన్ని తెలిసిన వానిని ముందుగా అక్బరుపై నిఘాగా అతని వద్ద ఉంచడం మంచిదని శంభాజీ భావించాడు. స్వయంగా తానే వెళ్ళి అక్బరును కలియవలెనని శంభాజీకి మనసులో ఉంది. కాని అక్బరుయొక్క ప్రవర్తన వలన అతనికి కొంత సంశయం కలిగింది. అందుకే నేతాజీని అతనివద్ద కొంతకాలం ఉంచాడు.

అక్బరు పాలీ గ్రామంలో ఉన్నప్పుడుకూడా తానొక పాదుషాలాగా నిత్యం దర్బారు నేర్పాటు చేస్తూండేవాడు. అతడు తన క్రిందనొక దివానును నియమించుకుని, తన పేరుతో కొన్ని ఆజ్ఞాపత్రాలు జారీచేస్తుండే వాడు. అతనివద్ద రెండువేల గుర్రపు సవారులు ఉన్నాయి. ఇదంతా చూచిన శంభాజీకి ఔరంగజేబు సూచన ప్రకారంగానే అతని కుమారుడైన అక్బరు మాయమాటలు చెప్తూ తనవద్దకు చేరాడేమోననే అనుమానం కలిగింది. అందుచేతనే చాలాకాలం వరకూ తాను స్వయంగా వెళ్ళి అక్బరును కలియలేదు నేతాజీ పరిశీలనబట్టి కొంతకాలం తర్వాత అతనిలో ఆ సంశయం తొలగి పోయింది. ఆ తరువాత శంభాజీ ప్రతినిత్యం అక్బరునకు దిన బత్తెం క్రింద కొంతధనం పంపించాడు. అంతేగాక 18-11-1681 నాడు తాను స్వయంగా పాలికి వెళ్ళి అక్బరును కలిసి, ఔరంగజేబు నెదిరించటంలో అతనికి తన పూర్తి సహకారం యిస్తానని వాగ్దానం చేసాడు. దుర్గాదాసు తన పథకం ఫలోన్ముఖమయిందని చాల ఆనందించాడు.

శంభాజీ అక్బరును కలిసిన రెండురోజుల తర్వాత ససైన్యంగా ఔరంగజేబు బరహాన్‌పూర్ చేరాడు. అతని వెంట పరాక్రమవంతులైన అతనిపుత్రులు ముగ్గురు,పౌత్రులు, అనేకమంది పెద్దపెద్ద సేనాధిపతులు,వారి వెంట చక్రవర్తి యొక్క సైన్యమంతా తరలివచ్చింది. రాజపుత్రుల, మహారాష్ట్రుల కలయికతో నా దేర్పడిన బ్రహ్మాండమైన హిందూ రాష్ట్ర శక్తిని ఎదిరించి స్వైరనాశనం చేసి, మొత్తం దక్షిణ హిందూస్థానమును మొగలు పాదుషాహి లోనికి తీసికొని రావటానికి, తన్నెదిరించి వచ్చిన అక్బరును పట్టుకొని దండించి బుద్ధి చెప్పటానికి గాను అంతటి శక్తి సామర్థ్యాలతో అతడు దక్షిణానికి వచ్చాడు. అక్బరు దక్షిణానికి చేరిన వెంటనే ఔరంగజేబుపై దాడి చేయటానికి ఆరంభించినట్లయితే దుర్గాదాసు వేసిన పథకం సఫలమయేందుకు చాలా అవకాశాలుండేవి. ఔరంగజేబు

యుద్ధ సన్నద్ధుడయే లోగానే శంభాజీ, రాజపుత్రులు, అక్బరులు కలిసి కట్టుగా దాడి చేసి ఉంటే వారు గెలువటం సులభమయేది. నాటితో చరిత్ర గతే మారిపోయి ఉండేది. కాని శంభాజీ మనస్సులో అక్బరుపట్ల గల్గిన సంశయం ఆలస్యానికి కారణమయింది. వాస్తవానికి అట్టి సందేహం అతనికి కలగటం సహజమే అనిపిస్తుంది.

ఔరంగజేబు కుటిలనీతి శంభాజీకి బాగా తెలుసు. క్రీ॥ శ॥ 1666 లో తండ్రియైన శివాజీతో పాటు శంభాజీ ఔరంగజేబు యొక్క ఆగ్రా జైలులో కొంతకాలం ఉన్నాడు. ఇతర హిందూ రాజులను, తన దగ్గర కొలువు చేస్తున్న అనేకమంది హిందూ సరదారులను ఔరంగజేబు మోసంచేసిన ఉదాహరణలెన్నో శంభాజీకి తెలుసు. అంతేగాక ప్రస్తుతం తనవద్దకు వచ్చిన అక్బరు లోగడ తండ్రి యాజ్ఞ ప్రకారం రాజపుత్రులపై దండెత్తాడని, తరువాత వారితో లాలూచి పడ్డాడని, చివరకు ఒకదశలో ఆ రాజపుత్రులు గూడా అతనిని అనుమానించారని కూడా అతనికితెలుసు. ఈ కారణాలవల్లనే శంభాజీ అక్బరు మాటను వెంటనే నమ్మలేకపోయాడు. దానికితోడు స్వీయ రాజ్యంలో కొందరు అతనంటే యిష్టపడని వారున్నారు. ఇట్టిస్థితిలో విశ్వాసఘాతం కావటానికి ఎటువంటి తావు ఇవ్వకూడదనీ, ముందువెనుక లాలోచించకుండా ఏ నిర్ణయం తీసుకోరాదని అనుకున్నాడు. అయితే యీ ఆలస్యమే ఔరంగజేబుకు లాభం సమకూర్చింది. ఈ వ్యవధిలో అతడు సర్వశక్తులనూ సమీకరించుకొని ససైన్యంగా దక్షిణ హిందూస్థానం చేరుకున్నాడు.

దక్షిణ దేశానికి చేరిన వెంటనే ఔరంగజేబు శంభాజీని నాశనం చేసేందుకు సర్వ ప్రయత్నాలు ప్రారంభించాడు. తనశక్తి యుక్తులన్ని ప్రయోగించాడు. విరోధియొక్క విరోధి మనకు మిత్రుడన్నట్లు, ఆనాడు శంభాజీకి విరోధులుగా అతని రాజ్యపు సరిహద్దుల్లో వున్నవారిని మహా

రాష్ట్రంపై దండెత్తి గమ్మని కబుర్లంపాడు. పడమటి సముద్ర తీరంలో బలవత్తరమైన నౌకాబలంతో వృన్న సిద్దీని, పోర్చుగీసువారిని, శంభాజీ పైకి దండెత్తి వచ్చేట్లు చేసాడు. పశ్చిమ దిశనుండి వారు ముట్టడి చేస్తూంటే, తాను తన శక్తినంతా కేంద్రీకరించి, మిగిలిన మూడు దిక్కుల నుండి శంభాజీని ముట్టడించాడు. ఒకేసారి నాలుగు దిక్కుల యుద్ధంచేస్తూ తన్ను తాను రక్షింపు కోవలసి వచ్చింది శంభాజీ. దానికి తోడు స్వీయ రాజ్యంలోనే కొందరతనికి వ్యతిరేకులు. ఇబ్బందులెన్ని ఉన్నప్పటికీ శంభాజీ తన నేర్పరితనంతోనూ శివాజీ సృష్టించిన రాష్ట్రీయ సంఘటనా భావనతో నిండిన అనేకమంది వీరుల సహకారంతోనూ ఈ దండయాత్రలను తట్టుకొని నిలబడ్డాడు. ఎంత శక్తి ఉన్నా, యెన్ని యుక్తులు పన్నినా దాదాపు మూడు సంవత్సరాలవరకూ ఔరంగజేబు శంభాజీని ఏమి చేయలేక పోయాడు.

శంభాజీని గెలవటానికి ప్రయత్నాంతోబాటు, తన కుమారుడైన అక్బరు తను లేని సమయంలో ఉత్తరరాపథానికి వెళ్ళకుండా చేయటానికి కూడా ఔరంగజేబు ప్రయత్నించ వలసి వుంది. ఔరంగజేబు ఢిల్లీలో తన రాజధానిని కాపాడేందుకు కొద్ది సైన్యం మాత్రం ఉంచి, మిగతా సైన్యాన్నం తనూ తీసుకొని దక్షిణానికి వచ్చాడు. ఈ పరిస్థితిలో అక్బరు శంభాజీ వద్దనుంచి కొంతసైన్యం తీసుకొని ఉత్తరానికి చేరితే అతనికి రాజపుత్రులందరూ మరల సహాయం చేయవచ్చు అంతేగాక స్వయంగా చక్రవర్తి కుమారుడు ససైన్యంగావస్తే ఢిల్లీలోని మొగలు సైన్యంకూడ అతనితో చేరిపోవచ్చు. అప్పుడు మరింత ప్రమాదం జరుగుతుంది. వీటన్నిటి దృష్ట్యా ఔరంగజేబు తన కుమారుడైన అక్బరు ఏ విధంగాను తనను దాటి ఉత్తరానికి చేరరాదని నిశ్చయించుకొని ఉత్తరానికి పోయే మార్గాలన్నిటినీ కట్టుదిట్టం చేయించాడు.

తన తండ్రి ససైన్యంగా దక్షిణానికి చేరటం అక్బరుకు చక్కని అవకాశమయింది. అదను ఉపయోగించుకోవాలని అతడు చాల ప్రయత్నించాడు. అక్బరు ఉత్తరానికి వెళ్ళగలిగి ఉన్నట్లైతే, ఢిల్లీకి అతడు తప్పక పాదుషా అయి వుండే వాడు. అతని రాకకొరకు రాజపుత్రులుగూడా ఎదురు చూస్తున్నారు. అనేకసార్లు అతనికి జాబులుకూడా వ్రాసారు. జున్నరు, అహ్మద్‌నగర్, ఔరంగబాదు, బర్హాన్‌పూర్‌లలో ఉన్న పాదుషా సైనిక స్థావరాలలో ఏదో ఒకదానిపై దాడిచేసి విజయం పొందితే అతడు ఉత్తరానికి ప్రయాణం చేయటం సులభమవుతుంది. మొగలు సైన్యాలు గూడా అప్పుడు అక్బరు కర్తృత్వ శక్తిని గుర్తించి సహాయం చేస్తాయి. దుర్గాదాసు యీ పథకాన్ని శంభాజీకి చెప్పాడు. శంభాజీకి అది అంగీకారమే గాని అతడు ఒకేసారి అనేక రంగాలలో శత్రువుల నెదిరించవలసి రావటం వలన అందు నిమిత్తమై అనేక ప్రయత్నాలలో లీనం కావటం వలన అక్బరు పథకం ప్రకారం ఆచరించలేకపోయాడు. అక్బరు మొగలాయి శిబిరంపై దాడి చేద్దామని ఒక సమయం, ఒక స్థలం నిర్ణయించి కబురంపితే ఆదే సమయానికి వేరొక పని మీద శంభాజీ వెళ్ళవలసి రావడంతో వారిద్దరూ కలిసి ఔరంగజేబుతో యుద్ధంచేయటం జరగలేదు.

అక్బరు శంభాజీ వద్దకు చేరి సంవత్సరంన్నర గడచినా, వారిద్దరూ కలిసి ఔరంగజేబుపై దాడి చేయటం జరగలేదు. అందుచే అక్బరుకు చాల బాధనిపించింది. దానికితోడు అతనికి ఓర్పు, అనుభవం తక్కువ. పాదుషా సైన్యం నాలుగు వైపులా ఉన్నందున మధ్య వున్న అక్బరుకు తాను బంది ఖానాలో వున్నట్లనిపించింది. చివరకు క్రీ॥ శ॥ 1682 డిశంబరులో అక్బరు దుర్గాదాసులు గోల్కొండ దుర్గానికి బయలుదేరారు. కాని మధ్య త్రోవలో వారిని మొగలాయి సైన్యాలు ఎదుర్కొవటంతో గమ్యం మార్చి వారు సావంత వాడి చేరుకున్నారు. అప్పటికి తానింక తన తండ్రిని గెలవ లేననే నిరాశ అక్బరుకు కలిగింది. సావంతవాడిలో ఉండగానే అతడు

పోర్చుగీసువారితో మంతనాలు ప్రారంభించాడు. ఇంక ఉత్తరానికి చేరే ఆశ లేదు. అందుచేత తనను నౌకలపై అరబ్‌స్థాన్‌కు చేర్చమని వారిని కోరాడు. తన తండ్రి నుండి వీలున్నంత దూరంగా పోవటమే అతని కోరిక. కాని ఔరంగజేబుకు భయపడిన పోర్చుగీసువారు అక్బరుకు సహాయం చేయ నిరాకరించారు. పిమ్మట అక్బరు డచ్ వారి సహాయం కోసం ప్రయత్నం చేసాడు. వారి వద్దనుండి కూడ అతనికి ఎట్టి సహాయం లభించలేదు. ఇతరుల నాశ్రయించిన ప్రయోజనం ఉండదని తలచిన అక్బరు స్వయంగా ఒక నౌకను కొని దానిలో ప్రయాణం చేసేందుకు సిద్ధమయ్యాడు. కాని ఈవార్త వినిన శంభాజీ అక్బరు తనవద్దకు వచ్చి నిరాశతో వెళ్ళటం యిష్టంలేక, 'ఈసారి తప్పనిసరిగా మనమిద్దరం కలిసి దండయాత్ర చేద్దాం రమ్మ'ని కబురంపాడు. అక్బరు మొదట దానిని విశ్వసించలేదు. కాని శంభాజీ మంత్రి పదే పదే కోరటంతో, అందు కంగీకరించి ప్రయాణం మానుకున్నాడు. ఆ తర్వాత కూడా శంభాజీ అక్బరు కిచ్చిన మాటను నిలబెట్టుకోలేకపోయాడు. అక్బరు చేస్తున్న ప్రయత్నాలన్నీ ఎప్పటికప్పుడు ఔరంగజేబుకు తెలుస్తూనే ఉన్నాయి. కొడుకు తనకు భయపడి నిరాశతో తననుండి దూరంగా పోవటానికి ప్రయత్నిస్తున్నాడని గ్రహించిన అతడు "నీవు చేసిన అపరాధాలన్నీ క్షమిస్తాను. నా దగ్గరకు రమ్మ"ని అనేక పర్యాయములు ఈ మధ్యకాలంలో అక్బరుకు రహస్యంగా కబుర్లు పంపించాడు. అక్బరు యీ మాటలు నమ్మలేదు. తండ్రివద్దకు పోలేదు. అక్బరును, దుర్గాదాసును విడదీయాలని ఔరంగజేబు అనేక ప్రయత్నాలు చేశాడు. ఒకసారి ఎనిమిదివేల మొహరీలు రహస్యంగా ఔరంగజేబు దుర్గాదాసుకు పంపాడు. దుర్గాదాసు లంచాల కాసపడి పక్షం మార్చే మనిషి కాదు. తండ్రి పంపిన ధనాన్ని కొడుకైన అక్బరుకు యిచ్చివేశాడు దుర్గాదాసు. వేరొకసారి ఐదువేల సైనికులపై అధికారిగా నియమిస్తాను రమ్మని దుర్గాదాసుకు ఔరంగజేబు కబురంపాడు.

అందుకు కూడా దుర్గాదాసు ఆశపడలేదు. ధనాజీకీ, పదవికి ఆశపడేవాడైతే దుర్గాదాసు జీవితమంతా ఔరంగజేబు కొలువులో ఎంతో ఆనందప్రదంగా గడిచేది. ఎంతటి బీదరికంలో వున్నా, యిబ్బంది పడుతున్నా సరే తన మాతృదేశం నుండి విదేశీపాలనను అంతం చేయాలనే దృఢనిశ్చయం కలిగిన దుర్గాదాసు, అక్బరును వదలలేదు. అతనిద్వారా లక్ష్యం సాధించా లని అతడు నిశ్చయించుకొని జీవితాంతం అతనికి పూర్తి సహకారం యిచ్చాడు. వారిద్దరూ కలిసి సూరత్ మీదుగా ప్రయణం చేయాలని ప్రయత్నించారు కాని ఔరంగజేబు వలన అది విఫలమయింది.

క్రీ॥ శ॥ 1688 ప్రాంతంలో ఔరంగజేబు బీజపూరుపై దాడిచేసి నప్పుడు అక్బరు, శంభాజీ లిద్దరూ కలిసి బడోచ్‌పై దండయాత్ర చేసారు. ఆ యుద్ధంలో గెలిస్తే ఉత్తరానికి వెళ్ళాలని, లేకుంటే యింగ్లీషువారి నౌకనెక్కి మక్కాకు పోవాలని అక్బరు భావించాడు. బడోచ్ నివాసులు గూడా అక్బరునే ఢిల్లీ పాదుషాగా అంగీకరించారు. వారివద్దనుంచి అక్బరు పేరుపై కప్పంకూడా ఒకసారి శంభాజీ వసూలు చేసాడు. ఆ తరువాత అక్బరు ససైన్యంగా బడోచ్ మీదుగా గుజరాత్ దిశగా ప్రయాణం చేస్తు న్నాడని తెలిసి ఔరంగజేబు శక్తివంతమైన ఒక సైన్య పటాలాన్ని అతని పైకి పంపించాడు. చాకాబ్ అనే గ్రామంవద్ద వారిరువురిమధ్య పెద్ద పోరాటం జరిగింది. దానిలో అక్బరు ఓడిపోయి అనేక యిబ్బందులకు గురి అవుతూ చివరకు కొన ఊపరితో 'మాహులీ' చేరుకున్నాడు. అక్కడ నుండి సూరత్‌కు చేరటానికి మరొకసారి ప్రయత్నం చేశాడు. కాని అప్పుడుకూడా అతడు విఫలుడయ్యాడు. దాంతో అక్బరులో పూ నిరాశకలిగి, ఓర్పు నశించింది. ఇంక అతడు తనతోపాటు ధైర్యంగా నిలబడి ఢిల్లీ పాదుషా నెదిరించలేడని అభిప్రాయపడిన దుర్గాదాసు అక్బరును ఇరాను దేశం పంపే ఏర్పాటు చేశాడు. దాని ప్రకారం అక్బరు

క్రీ॥ శ॥ 1687 ఫిబ్రవరిలో రాజాపూర్ రేవుపట్టణంలో ఒక ఆంగ్లేయ నౌక నెక్కి మస్కత వెళ్ళి అక్కడనుండి 24–1–1688 నాడు ఇస్ఫాహన్‌లోని ఇరాన్ షాహ దగ్గరకు చేరాడు.

ఈ విధంగా దుర్గాదాసు వంటి సామాన్య వ్యక్తి, ఢిల్లీ చక్రవర్తిని సింహాసన భ్రష్టుణ్ణి చేసేందుకు తీవ్రంగా కృషి చేశాడు. ఈ ప్రమాదం నుండి తప్పించుకునేందుకు ఔరంగజేబు ఎంతో శ్రమపడవలసి వచ్చిందంటే దుర్గాదాసునియొక్క దీక్ష, శక్తి ఎటువంటివో తెలుస్తుంది. అతని ప్రయత్నాలన్నీ సులభ సాధ్యాలుగా కనిపించేవి. కాని దురదృష్టవశాత్తు ఏ ఒకటి పూర్తిగా విజయం పొందలేదు.

అక్బరును ఆంగ్లేయుల నౌకపై ఎక్కించిన తరువాత దుర్గాదాసు ఉత్తరానికి ప్రయాణం చేసి మార్వారు చేరుకున్నాడు జోధపూర్ చేరిన వెంటనే అతడు ఢిల్లీ పాద్‌షాతో యుద్ధానికి దిగాడు. బూందిరాజైన దుర్జనసాల్‌కూడా దుర్గాదాసుకు ఆ యుద్ధంలో సహాయం చేశాడు. పాదుషా సైన్యంలో ఎక్కువభాగం దక్షిణాన వుండిపోవుటవలన రాజపుత్రులకు యుద్ధము చేయుట సులభమయినది. కాని గుజరాతులోని మొగలు సుబేదారు సుజాయత్‌ఖాన్ చాకచక్యము సామర్థ్యములవలన ఔరంగజేబునకు నష్టం ఎక్కువ కలుగలేదు.

క్రీ॥ శ॥ 1681 లో తాను దక్షిణానికి బయలుదేరుతూ అక్బరు తన కుమారుడైన అఖ్‌తారును, కుమార్తెయైన సఫీయతున్నిసాను మార్వాడులోని రాఠోడుల రక్షణలో ఉంచాడు. ఔరంగజేబునకు అక్బరు ఇరాను వెళ్ళినట్లు తెలసింది. కాని తన మనుమడు మనుమరాళ్ళు తనకు విరోధులైన హిందువుల రక్షణలో ఉండటం ఔరంగజేబున కేమాత్రం యిష్టం లేదు. ఎట్లయినా వారిద్దరినీ తనవద్దకు చేర్చమని తన రాజ్యంలో గుజరాతు పరిపాలకుడుగా వున్న సుజాయత్‌ఖాన్‌ను అతడు ఆజ్ఞాపించాడు. సుజాయత్

ఖానుని వద్ద ఈశ్వరదాసు నాగర్ అను పేరుగల హిందువుడొకడు కొలువు చేస్తున్నాడు. అతనికి దుర్గాదాసునకు మంచి స్నేహముంది. ఖానుడు అతనిని దుర్గాదాసు వద్దకు రాయబారిగా పంపి అక్బరు సంతానమును ఔరంగజేబున కప్పగించమని కోరాడు. అతని కృషి వలన దుర్గాదాసు ఔరంగజేబుల మధ్య నొక ఒప్పందం కుదిరింది. ఆ ఒప్పందంలో దుర్గాదాసు తన కొరకేమీ కోరలేదు. యశ్వంతసింహుని కాలంలో వలెనే జోధపూరు రాజ్యాన్ని ప్రశాంతంగా రాజపుత్ర పాలనలో ఉంచనిస్తాననే వాగ్దానం ఔరంగజేబు వ్రాతపూర్వకంగా యివ్వాలని దుర్గాదాసు అడిగాడు. ఆ విధంగా ఔరంగజేబు సుజాయత్‌ఖాను ద్వారా, తన వాగ్దాన పత్రం దుర్గాదాసుకు పంపించాడు. ఆపైన దుర్గాదాసు తన రక్షణలో ఉంటున్న అక్బరు కుమార్తెయైన సఫయతున్నిసాను ఔరంగజేబు వద్దకు పంపించాడు (1696 లో). సుజాయత్‌ఖాను ఆ బాలికను ఈశ్వరదాసుని వెంట బ్రహ్మపురం శిబిరంలో పాదుషా దగ్గరకు పంపించాడు. పాదుషా తన మనుమరాలిని ఆనందంతో దగ్గరకు తీసుకొని "పరమతస్థుల యింటిలో యింతవరకు గడిపిన నీకు యిస్లాము మతం గురించి ఏమీ తెలిసియుండదు. కాబట్టి యికనుంచి నీవు నిత్యం ముస్లిం మతం గురించి చదువుకొ"మ్మని ఆమెకు చెప్పాడు. కాని ఆ బాలిక ఆశ్చర్య పడుతూ "దుర్గాదాసుగారు అజ్మీరులోని ఒక పంతులమ్మ ద్వారా నాకు యిస్లాం మతం గురించి బోధింపజేశారు. నాకు యిప్పుడు ఖురాన్ కంఠస్థంగావచ్చును" అని సమాధాన మిచ్చింది. అది వినిన పాదుషా నిర్ఘాంతపోయాడు. దుర్గాదాసు వంటి సాధారణ హిందువు తాను అనేక యిబ్బందులు పడుతూ గూడా తన రక్షణలో ఉన్న ముస్లిం బాలికను పెంచి పోషించి వాళ్ళ మత ధర్మం ఆమెకు బోధింపజేశాడు. కాని ఢిల్లీ చక్రవర్తి అయిన ఔరంగజేబు తనవద్ద విశ్వాసపాత్రుడై వున్న యశ్వంతసింహునియొక్క పసిబాలుని చంపించటానికి ప్రయత్నించాడు. ఆ ప్రయత్నాలు విఫలమైన తర్వాత

ఎట్లాగైన ఆ బాలుడైన అజితసింహుని తన ముస్లిం మతంలోనికి బలవంతంగా మార్చుదామని ప్రయత్నించాడు. ఆ ప్రయత్నం కూడా సాగక, అజితసింహుని పోలిన బాలకుని ఒకనిని కొలువులో చేర్చి, వానికి తన మత మిప్పించి, వానికి మహమ్మదీరాజ్ అను పేరు పెట్టి వానినే జోథపూర్ సింహాసన మెక్కించటానికి ప్రయత్నం చేశాడు. ఆ విధంగా జోథపురాన్ని తన రాజ్యంలో చేర్చుకోవాలని ఆశించాడు. ఒక సామాన్య హిందూ సరదారునకు, ఒక ముస్లిం పాదుషాకు ఆలోచనలలో, ఆచరణలలో, వ్యక్తిత్వంలో ఎంతటి వ్యత్యాసం ఉంది? ఈ ఔరంగజేబు యత్నాలన్ని రాజభక్తి, దేశభక్తి, సమయస్ఫూర్తి, సహనముగల దుర్గాదాసు వలన విఫలములై అజితసింహుడే జోథపూర్‌లో పెరిగి పెద్దవాడు కాగలిగాడు. సింహాసన మెక్కాడు.

అక్బరు కుమార్తె ఔరంగజేబు వద్దకు చేరింది. కుమారుడైన బులంద్ అఖతర్ మాత్రం దుర్గాదాసు అధీనంలోనే ఉన్నాడు అతనిని కూడా తనవద్దకు చేర్చమని మళ్ళీ ఈశ్వరదాసు ద్వారా పాదుషా కబురు పెట్టాడు. "మొట్టమొదట జోధపూర్ రాజ్యాన్ని యశ్వంతసింహుని పుత్రుడైన అజితపింహునకు స్వాధీనం చేసిన తరువాతనే బులంద్ అఖతర్‌ను ఢిల్లీకి పంపుతా"నని దుర్గాదాసు పాదుషాకు సమాధానం పంపాడు. ఇలా దుర్గాదాసు, పాదుషాల మధ్య రెండు సంవత్సరాలు ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి. కాని ఏ నిర్ణయం జరుగలేదు. కాని అనేక సంవత్సరాలుగా ఔరంగజేబుతో యుద్ధాలు చేసి అలసిపోయిన అజితసింహుడు ఏదో విధంగా, ఔరంగజేబుతో సంధి చేసుకోవడం మంచిదని దుర్గాదాసును కోరాడు. అందుచేత దుర్గాదాసు చివరకు బులంద్ అఖతర్‌ను వెంటబెట్టుకొని బ్రహ్మపురి శిబిరానికి చేరాడు. దర్బారులో ప్రవేశించబోతున్న దుర్గాదాసును, కత్తినివదలి చేతులుకట్టుకు లోనికిరమ్మని పాదుషా కబురంపాడు. అది వినిన దుర్గాదాసు కోపోద్రిక్తుడై ఒరనుండి

కత్తినిలాగి అక్కడనున్నవారి నందరినీ హతమార్చటానికి సిద్ధమయాడు. ఆవార్త వినిన ఔరంగజేబు సగౌరవంగా దుర్గాదాసును లోనికి ఆహ్వానించి అతనికి బహుమానంగా రత్నాలు పొదిగిన ఒక ఛురికను, లక్షరూపాయ లను బహూకరించాడు. కాని జోథపూరును మాత్రం అజితసింహునకు యివ్వనన్నాడు. ఆ తర్వాత దుర్గాదాసు మార్వారు చేరుకొని తీవ్రంగా ప్రయత్నించి సర్వసన్నద్ధతతో ఔరంగజేబు నెదిర్చి, అతని స్వాధీనంలో వున్న మార్వారు భూభాగంలో చాలా భాగం స్వాధీనం చేసుకున్నాడు. (క్రి. శ. 1706).

తరువాత కొద్దికాలానికే ఔరంగజేబు చనిపోయాడు. పిమ్మట తురకల నివాసంతో అపవిత్రమైన జోథపూరు కోటను దుర్గాదాసు గంగా జలంతో పరిశుద్ధం చేయించి, అజితసింహుని అందులో ప్రవేశపెట్టాడు. ఔరంగజేబు వంటి శక్తివంతుడైన చక్రవర్తితో యిరువదియైదు సంవత్స రాలు పోరాడి, చివరకు దుర్గాదాసు తన ప్రభువైన యశ్వంతసింహుని కుమారుడగు అజితసింహుని జోథపూర్ సింహాసనంపై ప్రతిష్ఠించాడు. దానితో తన జీవనకార్యం సఫలమయిందని భావించి, దుర్గాదాసు అమితా నందం పొందాడు. కాని సింహాసనం ఎక్కిన కొద్దికాలానికే అజిత సింహుడు అహంకారంతో దుర్గాదాసును అవమానం చేశాడు. మాతృ గర్భంలో ఉన్నప్పటినుంచీ తనను కాపాడి, ఢిల్లీ పాదుషా అంతఃపురం నుండి వెలికి తెచ్చి, పెంచి, పోషించి సింహాసన మెక్కించిన మహా పురుషుని, ఆదర్శ దేశభక్తుని, నిస్వార్థ వీరుని అజితసింహుడు అవమానిం చాడు. అదే దుర్గాదాసుని హృదయాన్ని ఎంతో బాధపెట్టింది. అతడు ఎదురుతిరిగి ప్రతీకారం చేయదలిస్తే అజితసింహుడు నిలువలేడు. కాని చిరకాలార్జితమైన జోథపుర హిందూసామ్రాజ్యం సుస్థిరంగా ఉండాలనే ఉద్దేశంతో అతడు అజితసింహుని ఏమీ అనకుండా జోథపురం వదలి, ఉదయపూర్ చేరుకున్నాడు. కొన్ని రోజుల తర్వాత అజితసింహుడు తన

తప్పిదం తెలుసుకొని, పశ్చాత్తాపపడి, వెంటనే ఉదయపూర్ పోయి క్షమించమని దుర్గాదాసును కోరాడు. దేశక్షేమాన్ని కోరిన దుర్గాదాసు అజితసింహుని వెంట జోథపూర్‌కువచ్చి, జీవితాంతం దేశ సేవలో గడిపాడు. ఆతని సలహాలతో అజితసింహుడు చక్కని పరిపాలనతో ప్రజలను, దేశాన్ని ఆనందింపచేశాడు.

# గురు గోవింద సింహుడు

మర్త్యుడుగా జన్మించినప్పటికీ, తన శీల సంపదచేత, భగవదనుగ్రహంచేత ఈ లోకంలో అమరుడగా రూపొందిన దివ్య పురుషుని జీవితగాథ ఇది. పుట్టినది రాజవంశంలో; కానీ జీవితాంతం యోగిగా ఉండటాన్నే అతడు కాంక్షించాడు. పరిస్థితులు ఆ సాధుపుంగవునిని మహా యోధునిగా చేశాయి. కాని అంతరాత్మ మాత్రం సాధుభావాన్ని విసర్జించలేదు. యుద్ధాలు చేశాడు విజయలక్ష్మిని వరించాడు. కాని తన కొరకు అంగుళంమేర భూమినైనా సంపాదించలేదు. ధ్యేయ సాధనలో ఆత్మ బలిదాన మొనర్చిన ఒక మహామహుని ముని మనుమడై, అట్టి వేరొక మహా త్యాగమూర్తి పుత్రుడై, భగవంతుని చరణపీఠం వద్ద తననేకాక, తన కుమారులను, తల్లిని, తనవద్ద చేరిన వారందరినీ సమర్పించుకున్న మహావ్యక్తి అతడు. ఆయన అర్హత ప్రధానం కాని వంశపారంపర్యపు హక్కును విడనాడినాడు. ఉదాత్తమైన ఒక లక్ష్యం కోసం మృత్యుముఖంలో ప్రవేశించటమే జీవిత పరమావధి అని చాటిచెప్పి, మానవ జీవితానికే ఒక నూతన అర్థాన్ని ప్రతిపాదించాడు. జాతి, వర్గ, వర్ణ స్థితిగతులనుబట్టి ప్రత్యేకాధికారాలను పొందే పద్ధతికి స్వస్తి చెప్పాడు. ఆ మహనీయుడే గురుగోవింద సింహుడు.

శిక్కు సంప్రదాయంలో తొమ్మిదవ గురువైన తేజ బహద్దూర్ ఒకసారి దైవకార్య నిమిత్తమై అస్సాం వెళుతూ, త్రోవలోని పాట్నా నగరంలో తాత్కాలికంగా బసచేశాడు. అక్కడే ఆయన ఏకైక సంతానమైన గోవిందరాయ్ జన్మించాడు. బాల్యంనుండి గోవిందసింహుడు తండ్రి వలె తానుకూడ నిత్యము గంటల తరబడి తీవ్రమైన ధ్యాన నిష్ఠలో మునిగి ఉండేవాడు. కొంతకాలం తర్వాత గురు తేజబహద్దూర్ పంజాబుకు తిరిగి వెళ్ళాడు. కాని కుమారుని విద్యాభ్యాసానికి అంతరాయం కలుగకుండా కుటుంబాన్ని పాట్నాలోనే ఉంచాడు. పంజాబు చేరిన కొద్దికాలానికే తేజబహద్దూర్ హోషియార్‌పూర్ జిల్లాలోని మఖావల్ గ్రామంలో తాను కొని నిర్మించుకున్న ఆనందపురమనే ప్రదేశానికి భార్యా పుత్రులను పిలిపించుకొన్నాడు ఆ ప్రదేశము ప్రకృతి సౌందర్యంతో విలసిల్లే శివాలిక్ పర్వతాల నడుమ ఉంది.

ఒకసారి కాశ్మీర్‌లో నివసించే హిందువుల పక్షాన ఒక ప్రతినిధి వర్గం వచ్చి గురు తేజబహద్దూర్‌ను కలిసింది. ఆ సమయంలో గోవింద సింహుడు తండ్రివద్ద ఉన్నాడు. కాశ్మీర్‌ను పరిపాలించే మొగలాయి రాజ ప్రతినిధి క్రూర కృత్యాలను వారు ఏకరువు పెట్టారు. స్వీకరించటమో, లేక మరణించటమో— ఈ రెండింటిలో దేని కంగీకరిస్తారో తేల్చుకొమ్మని ఆ ప్రతినిధి తమను భయపెట్టుతున్నాడని వారు నివేదించారు. ఇది విని తేజబహద్దూర్ "ఈ కాశ్మీర్ పండితులను రక్షించటానికి ఎవరైనా మహనీయుడు ప్రాణత్యాగం చేయాలి" అని అన్నాడు. అలాగైతే ఈత్యాగంచేయటానికి మీకన్న అర్హులెవరున్నా?" రని గోవిందసింహుడు సూచించాడు తేజబహద్దూర్ ఈవిషయాన్ని నిశితంగా ఆలోచించి వారికో సలహా ఇచ్చాడు: "మాకు గురువు, మార్గదర్శి అయిన తేజ్‌బహద్దూర్‌ను ఇస్లాంస్వీకరించేటట్లు మీరు చేయగలిగితే మేమంతా ఆయనను అనుసరిస్తాము; లేనిపక్షంలో మాసనాతన ధర్మాన్ని

విడనాడము"-ఈ విధంగా ఆ రాజప్రతినిధితో చెప్పమని వారిని ఆదేశిం చాడు. గురువు పంపిన సమాధాన్ని మొగలు ప్రతినిధి ఔరంగజేబుకు తెలియజేశాడు. ఇది విని తోకతొక్కిన త్రాచులా మండి పడి, తక్షణం గురువును బంధించి తన సమ్ముఖానికి ఈడ్చుకు రావలసిందని ఆజ్ఞాపిం చాడు ఔరంగజేబు. పాదుషా ఆజ్ఞను సారం తేజబహద్దూర్‌ను ఢిల్లీకి తీసుకువచ్చారు ఇస్లామును స్వీకరించేందుకు అంగీకరించని కారణంచేత, 11-11-1675 న ఢిల్లీ నగరంలోని చాందినీచౌక్ వద్ద అతణ్ణి ఉరితీశారు.

పాదుషా ఆగ్రహానికి గురి అవుతామేమో అనేభయంతో-జనసమ్మ ర్దంతో కిటకిటలాడే ఆ ఢిల్లీ మహానగరంలో చాల రోజులవరకు తేజబహ ద్దూర్ మృతదేహానికి అంత్య క్రియలు జరపటానికి ఒక్కడూ ముందుకు రాలేదు. చివరకు రంగుల అద్దకంచేసే "జైతా" తేజ బహద్దూర్ శిరస్సును తెచ్చి ఆనందపురంలోని గోవిందసింహునికి సమర్పించాడు. తన పితృదేవునిపై విచారణ జరుగుతున్నప్పుడు, బహుకొద్దిమంది మాత్రమే తాము శిక్కులమనే విశ్వాసాన్ని ధైర్యంగా విని గోవిందసింహుడు చాలా బాధపడ్డాడు అధికారులు ప్రశ్నించినప్పుడు తమ మత మేదో చెప్పుకోటానికి సిగ్గుపడే దీనస్థితికి కొందరు దిగజారారు.

హృదయ విదారకమైన తండ్రి మరణాన్ని గురించి గోవింద సింహుడు తానువ్రాసిన "విచిత్ర నాటకం" లో "ఆవిధంగా గురువు హిందువుల నుదుటి తిలకాన్ని, యజ్ఞోప వీతాన్ని సంరక్షించాడు" అని ప్రస్తావించాడు.

తండ్రి చనిపోయిన నాటికి గోవిందసింహుని వయసు తొమ్మిది సంవత్సరాలు మాత్రమే. పరమ కిరాతకుడైన ఔరంగజేబు పాలిస్తూన్న శక్తివంతమైన మొగలుసామ్రాజం దరిదాపులలోనే ఉన్నది. మొగలుల

అఘాయిత్యాలను గోవిందసింహుడు ఎదిరించవలసి ఉన్నది. నానకదేవుని గురుపీఠంకొరకు జరిగిన వారసత్వపు పోరాటాలలో గురుబంధువర్గము మునిగి ఉంది. ఈ కీచులాటలలో ఢిల్లీ చక్రవర్తిని తమవైపుకు త్రిప్పుకోటానికి కొందరు చేసిన ప్రయత్నాలు కొంతవరకు సఫలమైనాయి. ఇది కారణంగా విశ్వాసపాత్రులుగా ఉండవలసిన సహచరులు స్వార్థపూరితులైనారు. శక్తివంతమైన శత్రుసామ్రాజ్యపు తాకిడులను, బంధువుల అసూయా ద్వేషాలను, సహచరుల అధికార కాంక్షను, దౌష్ట్యాన్ని ఎదుర్కొని, ఈ ఆటంకాలను సమూలంగా నిర్మూలించాలని పితృవిహీనుడైన ఆ బాలుడు, ముక్కుపచ్చలారని వయస్సులో, నిశ్చయించుకోవటం ఆశ్చర్యకరమైన ఆత్మశక్తికి నిదర్శనం. స్వల్పమైన తన జీవిత కాలంలోని ఈ ఘనకార్యాలను గోవిందసింహుడు సాధించగలటం అంతకన్న అపురూపమైన విశేషం.

తేకబహద్దూర్ నకు పూర్వపు గురువులు తమ పీఠాన్ని చేరుకునేందుకు అడ్డుతగిలిన కుట్రలను ఎదుర్కొని, పీఠం దక్కించుకోవటం కోసమే జీవితంలో ఎక్కువ భాగం గడుపవలసి వచ్చింది. శిక్కుమతాన్ని సువ్యవస్థితం చేయడానికి, విదేశీ పాలనను ఎదుర్కొనటానికి కావలసిన శక్తిని సమకూర్చుకోటానికి వారికి తగినంత సమయంకాని, సావకాశం కాని లేకపోయింది. తండ్రి బలిదానం తర్వాత తన మత సంప్రదాయాలలో మౌలికమైన, విప్లవాత్మకమైన మార్పులు చేయాలని గోవిందసింహుడు నిర్ణయించుకున్నాడు. మొగలు సామ్రాజ్య తత్వాన్ని ఎదిరించేందుకు సాయుధ పోరాటం తప్ప వేరే మార్గం అతనికి కనిపించలేదు. లోగడ అతని పితామహుడు, ఆరవగురువు అయిన హరగోవిందుడే యీ విధమైన ప్రయత్నాలు చేశాడు. కాని ఆయన అనంతరం శిక్కుపంథా అకర్మణ్యతలో మునిగిపోయింది. తన నిర్ణయాన్ని వెంటనే ఆచరణలో పెట్టదలచి, గురుగోవిందుడు యికనుండి అనుయాయులు కానుకలను గురువు సమక్షం

తోనే సమర్పించాలని, శక్తికలవారు ధనధాన్యాదులకు బదులు ఆయుధాలు, అశ్వాలు సమర్పించాలనీ ఆదేశించాడు. యుద్ధమే వృత్తిగా కలవారిని కూడా తాను సమకూర్చదలచిన చిన్న సైన్యంలోకి చేర్చుకోవటం ప్రారంభించాడు. తన వెంట ఉండే వారంతా గుండెబలం పెంపొందించుకోవటమే కాక, కండబలం సాధించేందుకు కూడా నిత్యం వ్యాయామం చేయాలని ఆజ్ఞాపించాడు. పెద్ద భేరీ నొకదాన్ని తయారు చేయించి తన రాజరికానికి చిహ్నంగా ప్రతిరోజూ ఉదయం, సాయంత్రం మ్రోగించేవాడు. అతని దైనందిన కార్యక్రమంలో వేట ఒక భాగమయింది. దీనివలన అనేక విధములైన ఆయుధాలను ప్రయోగించటంలో ఆయన నేర్పు గడించాడు. స్వయంగా సంస్కృతం, పర్షియన్, అరబ్బీ, పంజాబీ భాషలలో అఖండమైన పాండిత్యాన్ని సంపాదించి, ప్రాచీన నవీన సాహిత్యాలు రెండూ చదివి నిష్ణాతుడైనాడు. నిత్య జీవితంలో తాను చేసే ప్రతి పనినీ దైవపరం చేయాలనే భావన ప్రతి వ్యక్తిలో కలిగించేందుకు ఉదయమూ, సాయంత్రమూ భగవత్సేవ చేసే అలవాటును అనుచరులందరిలో ఏర్పరచాడు.

శివాలిక్ పర్వతాలలోని కొండరాజులు—ముఖ్యంగా బిలాన్‌పూర్‌కు రాజైన భీమచంద్—గురుగోవిందుని కార్యకలాపాలను గమనించి కొంత భయపడ్డారు. ఇది గుర్తించి, గురుగోవిందుని అనుచరులు కొందరు అతని తల్లికి పరిస్థితులు వివరించి, ఏ విధంగానైనా గోవిందసింహుడు ఈ విధమయిన యుద్ధ ప్రయత్నాలు సైన్యసమీకరణలు విరమించేలా చేయమని అర్థించారు. కాని గురుగోవిందుడు తల్లిమాటలను పెడచెవిని పెట్టాడు.

ఒకసారి నహాన్‌ను పరిపాలిస్తున్న రాజు తన సంస్థానానికి వచ్చి డూన్ లోయలో వేటాడవలసిందిగా గురుగోవిందునికి ఆహ్వానం పంపాడు. గోవిందుడు ఆ ఆహ్వానాన్ని అంగీకరించి అక్కడికి వెళ్ళాడు. డూన్ లోయలోని ప్రకృతి శోభ ఆతణ్ణి ముగ్ధుడిని చేసింది. అచటనే యమునా

నదీ సమీపంలో పావోంటా అనే ప్రదేశంలో ఆయన తన శిబిరాన్ని ఏర్పాటు చేసుకున్నాడు. అతని శరీరసౌష్ఠవాన్ని పరాక్రమాన్ని, అతని అనుచరులలోని అనుశాసనాన్ని చూచి నహాన్‌రాజు సంతోషించి, గోవింద సింహుడిని పరివార సమేతంగా అక్కడనే ఉండిపొమ్మని కోరాడు. ఆవిధంగానైనా ఆనందపుర పరిసరాలలోని శతృత్వపూరిత వాతావరణాన్నుండి తప్పించుకోవచ్చుననే ఊహతో–శిష్యులు బలవంతపెట్టి తమ గురువును అందుకు ఒప్పించారు.

పావోంటాలో ఉన్న సమయంలోనే గురుగోవిందుడు సాహసోపేతములు, భక్తిరస ప్రధానములులైన రచన లనేకం చేశాడు. అతని నిర్యాణానంతరం వానిలో లభించిన రచనలనన్నిటినీ సంకలనంచేసి, "దశమగ్రంథం" అనే పేరున ఒక పుస్తకాన్ని శిష్యులు కూర్చారు. అంతేకాక, గురుగోవిందుడు 52 గురు సత్కవులను నియమించి, వీర రసప్రధానములైన అనేక ప్రాచీన పౌరాణిక గాథలు–ముఖ్యంగా చండీదేవి, శ్రీరాముడు, శ్రీకృష్ణుడు మొగలగు వారి సాహస చరిత్రలు-హిందీలో వ్రాయించాడు. భావుకతలో, పద ప్రయోగంలో, ఛందోరీతులలో గురు గోవిందుడు అనన్య సామాన్యమైన ప్రజ్ఞను, సామర్థ్యాన్ని తన రచనలలో ప్రదర్శించాడు. అతని యుద్ధకవిత భారతీయ సాహిత్యంలో ప్రత్యేక స్థానాన్ని అలంకరించింది.

గురుగోవిందుడు ఆనందపురాన్ని వదలి పావోంటాకు వెళ్ళినప్పటికి అతనిపై శివాలిక్ పర్వతరాజుల మాత్సర్యం, విరోధం-శిష్యులు ఆశించిన విధంగా–తగ్గలేదు. చిన్న చిన్న రాజులందరూ ఏకమై భీమచంద్ నాయకత్వంలో గురుగోవిందునిపై దాడికి సిద్ధమైనారు. ఈ సమాచారం తెలిసిన గోవిందసింహుడు తనసైన్యాన్ని ఎగువకు తరలించి, పావోంటాకు ఆరు మైళ్ళ దూరంలో ఉన్న భంగనీ అనే ప్రదేశం చేరాడు. అక్కడనే

1687 లో రెండుపక్షాల సైన్యాలూ ఢీకొన్నాయి. శత్రువు సైన్యాలు అపారంగా ఉన్నాయి. పైపెచ్చు గోవిందసింహుని సైన్యంనుండి చాలా మంది వెళ్ళిపోయారు. అయినా అతడు ధైర్యంతో, తెగువతో పోరాడి విజయం సాధించాడు. ఈ విజయం అతనికి, అతని అనుచరవర్గానికి బ్రహ్మాండమైన ఆత్మవిశ్వాసాన్ని కలిగించింది.

ఈ సంఘర్షణ అయిన తక్షణమే ఆనందపురానికి తరలి వెళ్ళాడు గోవిందసింహుడు. భంగనీలో కలిగిన పరాభవంతో రాజా భీమచంద్రుని మనసు మారింది. అతడు గురుగోవిందునితో స్నేహం కలుపుకున్నాడు. ఇంతలో ఢిల్లీ పాదుషా ఔరంగజేబు, ససైన్యంగా వెళ్ళి పర్వతరాజుల వద్దనుండి కప్పం వసూలు చేయవలసిందని జమ్మూలో తన ప్రతినిధి ఐన మియాంఖానుని ఆజ్ఞాపించాడు. పాదుషా ఆనతి ననుసరించి అలీఫ్‌ఖాన్ సైన్యసమేతుడై పర్వతరాజుల వద్దకు వచ్చాడు. ఈరాజు లందరిలో ప్రముఖుడైన భీమచంద్ అలీఫ్‌ఖానుకు వ్యతిరేకంగా తమ సైన్యాలను సంఘటితపరచి చక్కగా నడిపించగల నాయకునికోసం వెదకుతున్నాడు. అతని దృష్టికి గోవిందసింహుడు ఈ పనికి తగినవాడని తోచింది. ఆయన సహాయాన్ని భీమచంద్ అర్థించాడు. గోవిందసింహు డందుకంగీకరించి, 1688 లో నందౌన్ అనే చోట మొగలుల నెదిరించి, విజయంసాధించాడు. ఇది అతని రెండవ యుద్ధం.

ఈ యుద్ధం పూర్తయి గోవిందసింహుడు ఆనందపురం చేరిన తర్వాత దాదాపు ఏడు సంవత్సరాలు శాంతియుతంగా గడిచింది. ఈ సమయంలోనే అతని సైనికశక్తి క్రమక్రమంగా పటిష్ఠమౌతున్నది పంజాబు ప్రాంతానికి మొగలు ప్రతినిధిగా ఉన్న దిలావర్‌ఖాన్‌కు ఇది కంటకమైంది. అందుచేత 1695 సంవత్సరంలో అతడు 11వేల సైన్యాన్ని తోడిచ్చి గురుగోవిందుని వద్దనుండి కప్పం వసూలు చేసుకురమ్మని-అతడు

నిరాకరించే పక్షంలో ఆనందపురాన్ని దోచుకురమ్మని—తన కుమారుణ్ణి సాగనంపాడు. దండెత్తి వస్తున్న మొగలు సైన్యాలను గురుగోవిందుడు సతలజ నదీతీరాన ఎదుర్కొని చిత్తుగా ఓడించాడు. ఆ తరువాత దిలావర్ ఖాన్ గురుగోవిందునిపైకి హుసేన్ అనే మరో వీరుణ్ణి పంపాడు. అతడు ఒక దానితర్వాత ఒకటిగా అనేక గ్రామాలు దోచుకుని ధ్వంసం చేస్తూ ముందుకు రాసాగాడు. అతని ధాటికి భయపడి రాజా భీమచంద్ దాసోహ మన్నాడు. ఇతర పర్వతరాజులు హుసేన్‌కు కప్పం చెల్లించి మొగలుల పక్షంలో చేరిపోయారు.

ఆనందపురం మార్గంలోని గులేర్‌కు రాజు గోపాల్. మొగలులకు కప్పం కట్టటానికి ఇతడు నిరాకరించిన కారణాన, హుసేన్ గులేర్‌ను మొదట ధ్వంసం చేద్దామని బయలుదేరాడు. రాజా గోపాల్ గురుగోందుని సహాయాన్ని అర్థించాడు. గురువు సహాయంతో, రాజా గోపాల్ హుసేన్‌ను హతమార్చి గెలుపు సాధించాడు. ఈ వార్త విని ఔరంగజేబు మండిపడి, తన కుమారుడైన ముఅజ్జమ్‌ను, ఆ తరువాత ఒకరి వెనుక ఒకరుగా మీర్జాబేగ్‌ను, మరి నలుగురు వీరులను పంపాడు. వారు తమ పగ అంతా కొండరాజులపై తీర్చుకున్నారు కాని, గురుగోవిందుని మాత్రం వారు ఏమీ చేయలేదు.

అటు తర్వాత దాదాపు ఆరు సంవత్సరాలు గురుగోవిందుని జీవితం ప్రశాంతంగా సాగింది. ఈ సమయాన్నంతా అతడు శిక్కు మతానుయాయులను సంఘటిత పరచటానికి వెచ్చించాడు. యువకుల ననేకమందిని చేర్చుకొని సుశిక్షితులను చేసి, చక్కటి సైన్యాన్ని తయారు చేశాడు. ఆనందపురంలోని తన కేంద్రాన్ని పటిష్ఠం చేసుకున్నాడు. పరిసర ప్రాంతాన్ని కొని, సతలజ, యమునా నదుల మధ్య అనేకములైన కోటలను నిర్మించాడు. క్రమంగా ఆనందపురంలోని అతని దర్బారు సరస్వతీ నిలయమైంది. పావోంటాలో ప్రారంభించిన తన కవితారచనలను

అతడు కొనసాగించాడు. దుష్ట పరిపాలను తమ భుజబలంతో ఎదురొడ్డి పోరాడిన మహావీరుల గాథలు ప్రతి సాయంత్రం శిక్కులు చెవులకింపుగా వింటుండేవారు. ఉద్రేకంతో జ్వలిస్తున్న వారి హృదయాలు పూర్వవీరులను మించిన సాహస కృత్యాలను ప్రదర్శించాలని ఆరాటపడుతుండేవి. దుర్మార్గాన్ని, అధర్మాన్ని ఎదిరించి గురువు కొనసాగిస్తున్న ధర్మ యుద్ధంలో తమ సర్వస్వాన్ని సమర్పించాలనే తీవ్ర వాంఛతో వారు సిద్ధమైనారు. వాతావరణం పౌరుష పూర్ణమైంది.

ఈ ప్రయత్నమంతా సమయోచితంగా, ప్రణాళికా బద్ధంగా చేసాడు గోవిందసింహుడు. హిందువులు ఎంతటి పిరికిపందలుగా వ్యవహరిస్తున్నారో, ఎంతటి స్వార్థపరులైనారో, చావంటే ఎంత భయపడుతున్నారో, ఎంతటి బలహీనులైనారో, యిదే అదనుగా విదేశీ శక్తులు తాము అల్ప సంఖ్యాకులైనప్పటికీ హిందువుల నెంతగా అణచి కాలరాస్తున్నారో, గురు గోవిందుడు పూర్తిగా అర్థం చేసుకున్నాడు. హిందువులలో యిట్టి అవగుణాలన్నీ పోవాలి. దానికై తగిన ప్రయత్నం చేస్తూనే, అతడు సంసార భారాన్నికూడా మోస్తున్నాడు. ఆదర్శమైన గృహస్థుగా జీవిస్తూనే, వ్యక్తి సమాజంపట్ల తన కర్తవ్యాన్ని పూర్తిగా నెరవేరుస్తూ, అవసరమైతే రాష్ట్రసేవలో తనది అనే ప్రతి దాన్ని సమర్పించేందుకు ఎలా సంసిద్ధంగా ఉండాలో ఒక ఉదాహరణగా తన జీవితాన్ని గడిపాడు. ఇట్టి గుణగణాలు తన అనుచరులలో ఏర్పడి, కష్ట సమయాల్లో వారి ప్రవర్తన ఆదర్శప్రాయంగా ఉండటం కొరకు అతడు విశేషంగా శ్రద్ధ వహించాడు. ఆయనకు జీతో, సుందరి అని యిద్దరు భార్యలు. కుమారులు నలుగురు—అజిత్‌సింగ్, ఝుజార్‌సింగ్, జొరావర్‌సింగ్, ఫతేసింగ్.

సైనిక నిర్మాణ కార్యకలాపాలు, గృహవిషయాలు నిర్వహిస్తూనే, ఆయన మౌలికంగా శిక్కుపంథాలో అనైక్యత, బలహీనత ప్రవేశించ టానికి కారణమేమిటని ఏకాగ్రచిత్తంతో ఆలోచిస్తూ ఉండేవాడు. శిక్కు

పంథాలోని ఈ లోపాలను సవరించుకోవాలని ఆయన నిశ్చయించాడు. 1699 ప్రారంభంలో వైశాఖ పౌర్ణమి మహోత్సవంలో తనతో వచ్చి కలియవలసిందిగా అనుచరులందరికీ ఆహ్వానాలు పంపాడు. ప్రతి ఒక్కరూ ఆ ఉత్సావానికి కేశఖండన చేసుకోకుండా రావాలనికూడా ఆజ్ఞాపించాడు. శిక్కుల చరిత్రలో ఆదినం అశేషమైన ప్రాముఖ్యం వహించింది. అనేక ప్రాంతాలనుండి తండోపతండాలుగా అనుచరులు ఆనందపురం చేరుకున్నారు. ఉదయం ప్రార్థనలు ముగిశాయి. గురుగోవిందుడు వారిముందు నిలుచున్నాడు. ఒరనుండి ఖడ్గాన్ని వెలికితీసి "బలికోసం ఐదుగురు వ్యక్తులు కావాలి. అందుకు సిద్ధంగా ఉన్నవారు ముందుకురండి!" అన్నాడు. సమావేశం నిశ్శబ్దమయింది. ఆయనకు మతి చలించిందా అని కూడా కొందరు అనుకున్నారు. కొద్ది సమయం గడిచిన తరువాత ఒకరొకరుగా ఐదుగురు శిష్యులు ముందుకు వచ్చారు. ఆయన ఒకరితర్వాత ఒకరుగా వారిని గుడారంలోకి తీసుకువెళ్ళి, ప్రతిసారీ ఒక మేకనుచంపి, దాని రక్తంతో తడిసిన కత్తితో వెలుపలికి వచ్చాడని చెబుతారు. ఆవిధంగా ముందుకువచ్చిన అయిదుగురూ 'పంచప్యారాలు'గా దీక్ష స్వీకరించారు. ఖల్సా (అంటే నిర్మలమని అర్థము) అనే వీరసంప్రదాయము ఈ విధంగా ఏర్పడింది. పంచప్యారాలలో ఒకడు బ్రాహ్మణుడు; మరొకడు క్షత్రియుడు, ముగ్గురు శూద్రులు.

గురుగోవిందుడు వారికి ఒక నూతన పద్ధతిలో దీక్ష నిచ్చాడు. మంచినీళ్ళలో పంచదారను కలిపి,ఆ ద్రావకాన్ని ఇరువైపులా పదునుగల ఒక ఛురికతో గురువు చిలుకుతుండగా, పవిత్రమైన మంత్రాలు, గోవింద సింహుని రచనలలో కొన్ని భాగాలు ఉచ్చరింపబడ్డాయి. గురువువలెనే పంచప్యారాలుకూడా చిలికారు. పిమ్మట ఆ ఐదుగురిచేత ఆ అమృత రసాన్ని గురుగోవిందుడు ఒకే పాత్రతో త్రాగించాడు-సమాజంలో సమానత్వానికి సూచకంగా, ఈ దీక్షాగ్రహణ కార్యక్రమానికి "పహుల్" అని

పేరు. ఈ దీక్ష వహించిన శిక్కు ద్విజుడైనాడు. కరుడుగట్టిన కుల విభేదాలు హిందూజాతి సమైక్యతకు అడ్డమవుతున్నాయనీ, పహుల్ అనే ఈ విధానంద్వారా అందరినీ ఏకత్రితం చేయవచ్చనీ అతడు గుర్తించాడు పహుల్ స్వీకరించటమేగాక, తన శిష్యులందరూ పంచ "కకారములు"- కేశ, కంగ, కడ, కచ్ఛ, కృపాణ-ఎల్లప్పుడూ ధరించాలని నియమాలను (1) కేశఖండన చేసుకొనరాదు (2) పొగాకు, తదితర పదార్థాలు వాడరాదు. (3) కోషేర్ మాంసం తినరాదు (4) స్త్రీలను, ముస్లిముల నైనాసరే, మానభంగము చేయరాదు—పాటించాలని ఆజ్ఞాపించాడు. అందరూ తమ పేరునకు చివర "సింగ్" అనే ఉపనామాన్ని ఉంచుకోవాలనీ, ప్రతి ఖల్సా అనుశాసనం కలిగిన సైనికుడై తన జీవితాన్ని భగవత్సేవలో వినియోగిస్తూ, ధర్మ కార్యం కోసం ఎంతటి త్యాగమైనా చేసేందుకు సిద్ధంగా ఉండాలని గురుగోవిందుడు ఆదేశించాడు.

పిమ్మట, ముకుళిత హస్తాలతో పంచప్యారాల ఎదుట నిలబడి, గోవిందసింహుడు "నన్నుకూడా మీ ఖల్సా సంప్రదాయంలో చేర్చుకొని, నాకు అమృతాన్ని ప్రసాదించండి" అని కోరాడు. ఈ కోరిక వారినేకాక, అక్కడ చేరిన వారినందరినీ సంభ్రమాశ్చర్యాలలో ముంచింది. "స్వామీ! మీరు మాకు గురువులు. ఆధ్యాత్మిక సాధనలో మార్గదర్శకులు. మీకు మేము దీక్షనివ్వటమా? అమృతాన్ని ప్రసాదించటమా?" అని పంచప్యారాలు ప్రశ్నించారు. "ఉచ్చ నీచ అనే వ్యత్యాసాలు ఈ నాటితో తొలగిపోయేందుకే నేనీనాడు ఈ కొత్త విధానాన్ని ప్రవేశ పెడుతున్నా"నని గోవిందుడు సమాధానమిచ్చాడు. అనుయాయులందరూ విస్మయ పడుతూండగా పంచప్యారాలు గురువుకు అమృతాన్నిచ్చారు. ఈ పవిత్ర క్రియ ద్వారా తన వ్యక్తిత్వాన్ని గోవిందసింహుడు ఆ అయిదుగురిలో నిక్షేపించాడు. మానవాకారంతో అంత వరకూ ఉన్న గురుత్వచిహ్నం నాటితో అంతమయింది. ఏ సంఘటనా అక్కడి వాతావరణాన్ని అంత తీవ్రంగా



"పంచప్యారా"ల నుండి అమృతం స్వీకరిస్తున్న గురుగోవింద సింహుడు

ప్రభావితం చేసి ఉండజాలదు. అప్పటికప్పుడు 20 వేల మంది శిక్కులు ఖల్సా దీక్షను స్వీకరించారు. మరి రెండు వారాలలోనే ఆ సంఖ్య ఎనభై వేలకు పెగిరింది. ఆ మహోత్సవం ముగిసిన వెంటనే వారందరూ పరస్పరం "ఖల్సాలు భగవంతుని అనుగుబిడ్డలు. మన భగవానునికి జయమగుగాక!" అని నూతన అభినందనలు తెలుపుకున్నారు. నాటినుండి గడ్డాలు మీసాలతో, ధర్మరక్షణకు సదా సన్నద్ధంగా ఆయుధములు సర్వదా ధరించియుండే ఒక మానవ సమూహం ఈ భరతభూమిలో ప్రభవించింది. వారి యుద్ధభేరీ నినాదములతో, సమర సన్నాహ కోలాహలముతో ఆనందపుర పరిసర ప్రాంతం ప్రతిధ్వనించింది.

ఆకస్మాత్తుగా ఏర్పడిన ఈ సైనిక సంసిద్ధత కొండరాజులకు గంగవెర్రులు ఎత్తించింది. ఈ శక్తికి అడ్డుకట్ట వేయకపోతే మొగలు పాదుషా ఆగ్రహానికి గురి అవుతామేమోనని వారు భావించారు. ఏదో విధంగా గురుగోవిందుని పర్వత ప్రాంతాలనుండి తరిమివేయాలని అనుకున్నారు. తాను ఆక్రమించిన భూభాగానికి అద్దె చెల్లించవలసినదని బిలాస్‌పూర్ జురా గురుగోవిందునికి కబురంపాడు. 'ఆ భూములు ఎన్నడో మాతండ్రి కొన్నారు. కాబట్టి నేను అద్దె బకాయి పడలే'దని గోవిందుడు సమాధానమిచ్చాడు. దానితో పర్వతరాజు లందరూ ఏకమై గురుగోవిందునకు ఆహార పదార్థాలు అందటాన్ని ఆపుచేశారు. శిక్కులు ఆ వ్యూహాన్ని ఛేదించి 1701 సంవత్సరంలో శత్రుసైన్యాలను ఓడించారు. కానీ, ఆహార ధాన్యాలు సమకూర్చుకోవటం మాత్రం కష్టసాధ్యమైంది. అందుచేత వారు తప్పనిసరిగా ఆహార పదార్థాలకొరకు, కొన్నిసార్లు ప్రతీకారం తీర్చుకోవటం కొరకు గ్రామాలు దోచవలసి వచ్చింది.

గురుగోవిందుని ఓడించటం తమశక్తికి అసాధ్యమని కొండరాజులు గుర్తించారు. అందుచేత తమకు సహాయం చేయవలసిందని ఢిల్లీ పాదుషాను

కోరారు. ఖర్చులు భరించి నట్లయితే వారి కోరికను మన్నిస్తానని ఔరంగజేబు కబురంపాడు. పర్వతరాజులు అంగీకరించారు. మొగలాయి సైన్యాలు సర్ హింద్, లాహోర్‌లనుండి వచ్చి పర్వత రాజులతో కలిసాయి. అందరూకలిసి, నిర్మోహ్ వద్ద 1701లోగురుగోవిందుని ఎదిరించారు. ఖల్సా వీరులు 24గంటలకాలం వీరోచితంగాపోరాడారు. ఈవీరులు ఆనందపురంనుండి ఒక్కుమ్మడిగా వెలికివచ్చి, శత్రు సైన్యాలను చీల్చుకుంటూ పోయి సతలజ నది ఆవలి తీరాన నూతన శిబిరాలు ఏర్పాటు చేసుకున్నారు. తమను నిరోధించేందుకు మొగలులు చేసిన అనేక ప్రయత్నాలను వమ్ముచేశారు. గురుగోవిందుడు బసాలిలో మకాంవేసి విశ్రాంతి తీసుకున్నాడు. బిలాస్‌పూర్ రాజు గోవిందసింహుని ఓడించేందుకు మరల ఒకసారి ప్రయత్నంచేసి చావుదెబ్బలు తిన్నాడు. ఇక సంధి చేసుకోక తప్పిందికాదు. గురుగోవిందుడు ఆనందపూర్ వదలిపోయాడు గదా అని కొండరాజులు సంతృప్తి చెందారు. కాని కొద్దికాలానికే మళ్ళీ రణభేరి మ్రోగిస్తూ ఆనందపురం ప్రవేశించాడు గోవిందసింహుడు.

పదే పదే కొండరాజులు కోరినమీదట, 1703 వ సంవత్సరంలో మొగలాయి సైన్యాలు సయ్యద్ ఖాను నాయకత్వాన ఇంకోపర్యాయం ఆనందపురంపై దాడి చేశాయి. సరిగ్గా ఆ సమయానికి! గోవిందునివద్ద 500 సైనికులుమాత్రమే వున్నారు. అందుచేత శత్రుసైన్యాలను జయించలేక అందరూ ఆనందపురం విడిచి వెళ్ళవలసి వచ్చింది. మొగలు సైన్యాలు ఆనందపురాన్ని ఆక్రమించుకొని కొల్లగొట్టాయి. ఈ ఓటమితో సిగ్గుపడి శిక్కులుపరాభవాన్ని సహించేకన్న పోరాటంలోమరణించటమేమేలు కనుక శత్రువును తరమటానికి అనుజ్ఞను కోరారు. గురువు సమ్మతించాడు. వెంటనే శరవేగంతో శత్రుసైన్యాలను తరిమి వారిలో అనేకులను వధించటమేకాక, వారు దోచుకుపోతున్న ఆస్తిలో చాలభాగం శిక్కులు స్వాధీన

పరచుకున్నారు. ఆ యుద్ధంలో అనేకమంది శిక్కులు మరణించినా, మిగిలినవారు తమ విజయంతో గోవిందసింహునికి ఆనందం కలిగించారు. అతడు వారితో బాటు ఉత్సాహంతో తిరిగి ఆనందపురాన్ని ప్రవేశించాడు.

తాను పంపిన అపారమైన సైన్యం ఘోర పరాజయం పొందటంతో ఔరంగజేబు "మన మతాలు రెండూ ఏకేశ్వర సిద్ధాంతాన్ని నమ్ముతాయి. కాని, ప్రభువైన అల్లానుండి నేను పొందిన సర్వంసహాధికారాన్ని నీవు గాని, మరెవ్వరు కాని అంగీకరించక తప్పదు. అందుచేత నీకేదైనా తీరని కోరిక ఉంటే నన్ను వచ్చి కలుసుకో, నిన్ను పవిత్ర వ్యక్తిగా ఆదరిస్తాను. అంతేకాని, నా ఆధిపత్యాన్ని సవాలు చేయటానికి ప్రయత్నించకు. ఆలా ప్రయత్నిస్తే, నేనే స్వయంగా నీపై దండెత్తి నిన్ను సర్వనాశనం వేస్తాను" అని జాబు వ్రాశాడు. దీనికి గురుగోవిందుడు వెంటనే "భగవంతుడొక్కడే సర్వంసహాధికారాన్ని కలిగినవాడు. ఆయన ఆజ్ఞలకు నీవు, నేను కూడ బద్ధులమే. కాని, నీవు దీన్ని గుర్తించక నీ అభిప్రాయాలతో ఏకీభవించని వారిని కష్టాలపాలు చేయటమేకాక, వారి ప్రాణాలకూ, మతానికీ అపాయం కలిగిస్తున్నావు. ఈ భూమిపై ధర్మోద్ధరణ అనే దివ్య కార్యాన్ని భగవంతుడు సాధించటానికి నన్ను పంపించాడు. మన మార్గాలు వేరుగా ఉన్నంతకాలం మనమధ్య శాంతి అనే ప్రశ్నేలేదు." అని జవాబు వ్రాశాడు.

తనచుట్టూ పూర్తిగా ప్రశాంతత అలముకున్నా, అది అంతా పెనుతుఫాను వీచేముందు ఉండే తాత్కాలికమైన నిశ్శబ్దత మాత్రమే అని గురుగోవిందుడు గుర్తించాడు. ఏ క్షణాన్నైనా, ఏ దిశనుండైనా తనపై అకస్మాత్తుగా దాడి జరిగితే, దాన్ని ఎదుర్కొనటానికి తాను అప్రమత్తుడై ఉండాలని అనుకొన్నాడు. వివిధ ప్రాంతాలనుండి శిక్కులు అశ్వాలను, ఆయుధాలను తెచ్చి గురువుకు కానుకగా అర్పించి,అక్కడనే యుద్ధశిక్షణ పొందసాగారు. అప్పటివరకు నిటారుగా ఉన్న ఒక కొండ చరియలో

నామమాత్రంగా కొద్ది బురుజులతో ఒక చిన్న కోటగా ఉన్న ఆనంద పురానికి చుట్టూ గురుగోవిందుడు బ్రహ్మాండమైన గోడ కట్టించి, దానిలో ఆయుధాలను భద్రపరుచసాగాడు.

ఎదురుచూచిన క్షణం రానేవచ్చింది. గురుగోవిందుడు ఒక కొత్త మతాన్ని స్థాపించి, హిందువులందరినీ దానిలో చేర్పించి మొగలుల నెదిర్చి పోరాడవలసిందిగా కోరుతున్నాడని పర్వతరాజులందరూ పాదుషాకు విన్న వించుకున్నారు. ఇది వినిన పాదుషా యీసారి సర్‌హింద్ సుబేదారయిన వజీర్‌ఖాన్ నాయకత్వాన పెద్ద సైన్యాన్ని దాడికి పంపించాడు. ఆ సైన్యం ఆనందపురాన్ని చుట్టుముట్టింది. గురుగోవిందుని శతఘ్నుల గురికి శత్రు సైనికులు వందలాదిగా హతులైనారు. అశ్వదళం గుట్టలు గుట్టలుగా నేల కొరిగింది. ఆ దినం యుద్ధం ముగిసేముందు ఉదయసింగ్, దయాసింగ్ అనే యిద్దరు సేనానాయకులను శత్రుసంహారం చేయమని ఆజ్ఞాపించాడు గోవిందసింహుడు. వారు శత్రుసైన్యాలపై బెబ్బులులవలె విరుచుకుపడి వారికి లెక్కలేనంత నష్టాన్ని కలుగజేశారు. ఈ ధాటికి తట్టుకోలేక శత్రు సైన్యాలు తమ యుద్ధ తంత్రాన్ని మార్చివేశాయి. కోటలోనికి వెళుతున్న ఆహార సరఫరాలన్నిటినీ ఆపివేసినట్లయితే గోవిందసింహుడు దాసోహమం టాడని వారు భావించారు. ఈ ముట్టడి చాలదినాలు జరిగింది. రోజులు గడుస్తున్న కొద్దీ కోటలోనివారి కష్టాలు ఎక్కువవుతున్నాయి. చివరకు నీరుకూడా కరువయింది. కొంతకాలం చెట్లఆకులు, బెరడులు తిని జీవిం చారు. వందలకొలది శిక్కులు కోటవిడచి వెళ్ళటానికి అనుమతి కోరటం, గోవిందసింహుడు అనుమతించటం జరిగింది. మిగిలిన వారు మాత్రం అక్కడే అదేవిధంగా ఉండదలచారు.

ఏడు మాసాలైనా శిక్కులు లొంగలేదు. వారిని జయించటానికి పర్వతపాలకులు వేరొక పథకం వేశారు. "నీవు కోటవిడచి వెళ్ళిపోతే

చాలు, మొగలు సైన్యాలు ముట్టడి ఆపి తిరిగి పోతా"యని గురుగోవింద నకు తెలియజేశారు. దీనిలో ఏదో కుతంత్రం ఉన్నదని పసికట్టిన గోవింద సింహుడు దాని కంగీకరించలేదు. కాని, అతని తల్లి, అనుచరులు దానికి ఒప్పుకోవలసిందిగా బలవంతపెట్టారు. అప్పుడు ఆ సందేశంలోని నిజానిజాలు తెలుసుకోవాలనే ఉద్దేశ్యంతో గురుగోవిందుడు కొన్ని ఎద్దులను కొంత ఆస్తితో కోట వెలుపలికి ఒక రాత్రి పంపించాడు. ఆ ఎద్దుల గుంపు బైటికి రాగానే శత్రువులు వాటిని చుట్టుముట్టారు. ఈ విధంగా శత్రువుల కుతంత్రం తేట తెల్లమయింది.

ఆ తరువాత పాదుషాపేరుతో అనేక సందేహాలు రాసాగాయి. గోవిందుని తల్లి, అనుచరులు మరల ఒత్తిడి చేశారు. ఈసారి శత్రువు మోసగించినా అర్థాకలితో కోటలో చనిపోవటం కంటే యుద్ధం చేస్తూ చనిపోవటమే ఉత్తమమని గోవిందసింహుడు నిర్ణయించాడు. తన వస్తువులన్నిటినీ అగ్నికి ఆహుతి చేశాడు. తగులబెట్టటానికి వీలులేని వాటిని నేలలో పాతించాడు. ముందుగా గురుగోవిందుని తల్లి, ఆరు, ఎనిమిది సంవత్సరాల వయస్సుగల కుమారులు, యిద్దరు భార్యలు కోట దాటలనీ, వారు దాటిన తరువాత యిద్దరు పెద్ద కుమారులు, తాను, 50 మంది సైనికులతో తప్పించుకుపోవాలనీ పథకం ప్రకారం ఏర్పాట్లు చేసుకున్నాడు. ఈ సంఘటన జరిగింది ఎముకలు కొరికే చలికాలంలో-1704 డిసెంబరు మాసంలో.

ఈ విధంగా తప్పించుకొని పారిపోతున్న సమయంలో దురదృష్టవశాత్తు గురుగోవిందుని పత్నులు యిద్దరూ, గురువు తల్లి, యిద్దరు కుమారుల నుండి విడిపోయి, ఢిల్లీవైపు వెళ్ళారు. గోవిందసింహుడు అతని అనుచరులు సర్సా చేరిన కొద్ది సమయానికి అతని తల్లి, ఇద్దరు కుమారులు వచ్చి కలిశారు. తల్లిని, ఆఖరు కుమారుల నిద్దరినీ విశ్వాసపాత్రుడైన ఒక శిక్కుకు అప్పగించి వారిని ఢిల్లీకి పోతున్న తన భార్యల వద్దకు చేర్చ

వలసిందిగా ఆదేశించాడు. త్రోవలో రూపార్ వద్ద గోవిందసింహుని తల్లి, ఒకప్పుడు తమ ఇంటిలో వంటవాడుగా నున్న గంగు అనే బ్రాహ్మణుణ్ణి కలుసుకోవటం తటస్థించింది. అతడు వారిని సర్‌హింద్ సమీపంలోని ఖేరీఅనే తన గ్రామానికి తీసుకొనిపోయి, మోసగించి, సర్‌హింద్ నవాబుకు అప్పగించాడు. ఆ నవాబు "మీరు ఇస్లాం మతం స్వీకరిస్తారో, లేక మరణిస్తారో కోరుకొమ్మని" గురుగోవిందుని కుమారుల నడిగాడు. పెద్ద వాడైన జొరావర్‌సింగ్ "ఓటమి ఎరుగని గురుగోవిందసింహుని బిడ్డలము మేము. మా పితామహుడు ప్రాణాలైనా త్యజించారు, కాని స్వధర్మాన్ని పరిత్యజించలేదు. మేమూ ఆ మార్గాన్నే అనుసరిస్తాము" అని జవాబిచ్చాడు. తమ పితృదేవుని ఆయన అనుచరుల రక్తాన్ని త్రాగటానికి ఉవ్విళ్లూరుతూ క్రూరత్వానికి ప్రతీకంగా ఉన్న ఆ నవాబు ముందు తలవంచక, అతని అధికారాన్ని తృణీకరిస్తూ నిలుచున్నారు ఆ బాలవీరులు. నవాబు "మీ తండ్రి మరణించాడు. ఆయనమీద ఆశ వదులుకొండ"ని అనగా "మా తండ్రి అమరు"డని వారు సమాధానమిచ్చారు. వయసుకు చిన్నవారైనా, వారి మనో నిబ్బరము అమితమైనదనీ స్వధర్మముపై వారి విశ్వాసము అచంచలమనీ గ్రహించి, ఆ యిద్దరు పసివారినీ జీవసమాధి చేయవలసిందిగా ఆజ్ఞాపించాడు. * ఈ కిరాతక హత్యాసమాచారం విని గురుగోవిందుని తల్లి స్పృహతప్పి పడింది. ఆ అఘాయిత్యానికి తట్టుకొనకలేక అక్కడే మరణించింది (26-12-1704).

ఇచ్చినమాట విస్మరించి మొగలు సైనికులు గురుగోవిందుని వెంబడించారు. తాను చమ్‌కౌర్‌లోని మట్టికోటను చేరుకునేవరకూ సైన్యంలో చాలాభాగం శిర్సాలోనే ఉండేటట్లు ఏర్పరచి, గోవిందసింహుడు తన యిద్దరు కొడుకులను, 40 మంది శిక్కులను తీసుకొని చమ్‌కౌర్ చేరు

* ఈ హత్యాకాండ వివరాలు బందాసింహుని కథలో చూడవచ్చు.

కున్నాడు. మొగలులు చమ్‌కౌర్‌ను ముట్టడించారు (1704). అక్కడ జరిగిన ఘోర యుద్ధంలో గురువు వెంట ఉన్న శిక్కులలో ఐదుగురు మాత్రం మిగిలారు. పెద్దకొడుకులు యిద్దరూ-అజిత్, ఝుజార్ లు-యుద్ధంతో ధైర్యంగా పోరాడుతూ వీరమరణం పొందారు. వారి మరణానికి యితరులు మిక్కిలి చింతిస్తుండగా, గురుగోవిందుడు మాత్రం తన పుత్రులు దేశంకోసం మరణించడంలో మొట్టమొదటివాడు కాలేకపోయినా, చివరివారు మాత్రం కాలేదని సంతోషించాడు. తన కళ్ళముందే వీరమరణ మొందిన ఆ యిద్దరినీ చూచి గురుగోవిందుడు "ఓ దేవా! నీకు చెందిన దానిని నీకే తిరిగి సమర్పించేశాను" అని భగవంతునికి నివేదించాడు.

అంతా ముగిసిపోయినట్లనిపించినా, శిక్కులు తమ నమ్మకాన్ని మాత్రం వదలలేదు. అక్కడ నుండి తప్పించుకొని పోవాల్సిందిగా గురువుచేత ఒప్పించారు. గోవిందుని పోలికలుగల ఒక శిక్కు, గురువు దుస్తులు ధరించి రణరంగంలో దూకాడు. అతను చనిపోగా, అతని శిరస్సును చక్రవర్తికి కానుకగా మొగలు సైనికులు తీసుకువెళ్ళారు. నిజమైన గోవిందసింహుడు ఈ అవకాశం చూసి తప్పించుకు పోయిన విషయం మాత్రం వారు పసికట్టలేకపోయారు. గోవిందసింహుడు లూధియానా సమీపాన మచ్చివారా అడవులలో ముగ్గురు అనుచరులతో తప్పించుకు వెళ్లాడు. మరల మొగలుసైనికులు వారిని ముట్టడించారు. గులాబా, పంజాబా అనే ఇద్దరు మసంద్‌లవద్ద (శిక్కు పంథాలో శిస్తు వసూలు చేసేవారు) ఆశ్రయం కోరాడు గోవిందసింహుడు. కాని భయం కారణంగా వారు ఆశ్రయం నిరాకరించారు. అప్పుడు ఘనీఖాన్, నబీఖాన్ అనే యిద్దరు పఠానులు అతన్ని కాపాడారు. వారు గురువుచేత ముస్లిం ఫకిరువలె నీలివర్ణపు దుస్తులు ధరింపజేశారు. పిమ్మట తెరలుకట్టిన పల్లకీలో తీసుకువెళ్ళారు. త్రోవలో కాపలాఉన్న మొగలు సైనికులతో

ఊచ్‌పీర్ గురువును తాము పల్లకీలో తీసుకుపోతున్నామని చెప్పారు. భగవంతుడు గోవిందసింహుని ఆ విధంగా కాపాడాడు. ముట్టడి ముగిసింది. జాట్‌పురా చేరేసరికి హృదయ విదారకంగా చిన్న కుమారుల బలిదానం, తల్లి మరణవార్త తెలిశాయి. అయినా స్థైర్యాన్ని కోల్పోక, యిదివరకు పెద్దకొడుకులు చనిపోయినప్పటివలె, ఆయన భగవంతునికి ప్రార్థనలు చేశాడు. బాకుతో సమీపంలో ఉన్న ఒక పొదను త్రివ్వి, మొదలంటా పీకివేసి "నేను యీ పొదను వ్రేళ్ళతో సహా పెకలించివేసిన విధంగా యీరాక్షస సామ్రాజ్యం అతి త్వరలో నామరూపాలు లేకుండా నాశన మౌతుంది" అని భవిష్యత్తును సూచించాడు. తర్వాత గోవిందసింహుడు దీనాకు వెళ్లాడు.

గురుగోవిందసింహుడు సర్వము కోల్పోయాడని వినిన ఔరంగజేబు అతనిని లొంగదీయటానికి ఇదే అదనని ఆశించి,ఆయనను తనవద్దకురమ్మని ఆహ్వానించాడు. కాని అతని ఆశ అడియాస అయింది దినా నుండి విజయ సూచకమైన (జఫర్ నామా) సమాధానం పంపాడు. గురుగోవిందుడు. "నీ మాటలపై నేను విశ్వాస ముంచను. కోరి కోరి నాతో పోరాటానికిదిగి తీవ్రమైన అపరాధం చేశావు. పరమ పవిత్రమైన ధ్యేయం నాది. తుచ్ఛమైన ప్రయత్నం నీది. నలుగురు యుద్ధం చేస్తూ మరణిస్తేనేం? వేలకొలది సింహశౌరములు దూకున్నారు రణరంగంలోనికి. నీ గుండెలలో ఆరనిచిచ్చును రగిలిస్తాను. నా ధ్యేయ సాధన పూర్తయేవరకు విశ్రమించను" అని వ్రాశాడు. ఉత్తరం కొన సాగిస్తూ అంటాడు: "సత్యమైన, ధార్మికమైన విజయం నాది. నీ పనులను రానున్న తరాలవారు అసహ్యించుకుంటారు. నేను సాధించిన ఘనకార్యాలను నా అనుచరులు ఉదాహరణగా స్వీకరించి, స్ఫూర్తినంది, నీవంటి రాక్షస పరిపాలకులను సింహాసనాలనుండి కూలద్రోయటానికి నిరంతర ప్రయత్నాలు కొనసాగిస్తూనే ఉంటారు."

గురుగోవిందుడు దీనా కన్న సురక్షిత ప్రదేశమైన కోట్‌కాపురా అనే ఊరికి చేరాడు. గురుపుత్రుల ఘోరహత్యాకాండ కారుచిచ్చులా దేశం అంతటా వ్యాపించింది. వేనకువేలు శిక్కులు కోట్‌కాపురాలో ఉన్న తమ గురువునకు సానుభూతి వ్యక్తం చేయటానికి చేరుకున్నారు. పల్లె సీమల నుండి తండోపతండాలుగా తరలివచ్చారు. వారంతా తమ ప్రభు భక్తిని ప్రకటించుకొని, ఈ కిరాతక చర్యకు ప్రతీకారం తీర్చుకోవటంలో గురుగోవిందసింహునకు తమ సంపూర్ణ సహకారాలు అందజేస్తామని తీవ్ర ప్రతిజ్ఞను చేశారు. వారు తమ అపారమైన దేశభక్తిని నిరూపించడానికి భగవంతుడు మంచి అవకాశం కలిగించాడు. త్వరలోనే గురుగోవిందుని సంపూర్ణంగా నాశనం చేయలనే ఉద్దేశ్యంతో సర్‌హింద్ పాలకుడు వజీర్ ఖాను నాయకత్వాన పెద్ద మొగల్ సైన్యం వస్తున్నట్లు వార్తలందాయి. గురుగోవిందసింహుని వద్ద శత్రువుల నెదిరించటానికి కావలసినంత శిక్కు సైన్యం ఉంది. అతడు భయంకరమైన సింహంలా సైన్య సమేతుడై ముస్లిం సైన్యాల నెదిరించి ఫిరోజ్‌పూర్ జిల్లాలోని ఖిద్రానా అనే గ్రామం వద్ద శత్రు సైన్యాలను పిండిచేశాడు. ఆ ప్రాంతంలోని ఒకే ఒక సరో వరం ఈ గ్రామంలోనే ఉన్నది. మొగలు సైన్యం వెనక్కు తగ్గవలసి వచ్చింది. 1704 వ సంవత్సరంలో ఆనందపూర్‌లో గురు గోవిందుడు కష్టదశలో ఉన్నప్పుడు 40 మంది శిక్కులు అతని సాహచర్యం వదలి వెళ్లారు. వారంతా యిప్పుడు తమ తప్పు తెలుసుకొని ఖిద్రానావద్ద గురువును కలిసి యుద్ధములో తమ సహాయాన్ని స్వీకరించ వలసిందని ప్రార్థించారు. మహాన్‌సింగ్‌వారికి నాయకుడు. ఖిద్రానావద్ద యుద్ధం ముగిసిన తర్వాత రణరంగంలో క్షతగాత్రుడై పడిఉన్న మహాన్‌సింగును గురుగోవిందుడు చూచాడు. గురువును పరిత్యజించిన పాపం చేసినప్పటికీ కూడా ఈనాడు యుద్ధంలో ప్రాణాల నర్పించిన నలభైమంది శిక్కు వీరులను తనను, క్షమించి పాపవిముక్తులను చేయవలసిందిగా మహాన్

సింగ్ గోవిందసింహుడిని ప్రార్థించాడు. తక్షణమే గురుగోవిందుడు వారి పాపాన్ని మన్నించాడు. ఆనాటినుండి ఖిద్రానా గ్రామం ముక్తసర్ (ముక్తి సరోవరము) అని పిలువబడుతోంది.

గురుగోవిందుని పరాక్రమము, ఖ్యాతి అసంఖ్యాకులను ఆకర్షించాయి. వారు ఖల్సాను స్వీకరించారు. పాటియాలా, నాభా, జింద్, మాల్వాల రాజవంశాలుకూడా అందులో ఉన్నాయి. ముక్తసర్‌లో కొంత కాలం గడిపి గురుగోవిందుడు పాటియాలా సంస్థానంలోని తలవండి సాబోకి (నేడు దమ్‌దమ్ సాహిబా అని పిలువబడుతోంది) అనే గ్రామంలో విశ్రమించాడు. ఇక్కడే గురుపత్నులు సుందరి, సాహిబ్‌కార్ (జీతో) దాదాపు అయిదు నెలల ఎడబాటు తర్వాత ఢిల్లీ నుండి వచ్చి కలిశారు. కుమారులు నలుగురి మరణాన్ని గురించి గురుగోవిందుడే మొట్టమొదట వారితో చెప్పాడు. ఆ గ్రామంలోనే అయన తీవ్రమైన సాహిత్య కృషిలో మునిగిపోయాడు. తన స్మరణ శక్తిద్వారా ఆదిగ్రంథ్ శుద్ధ ప్రతిని తయారు చేస్తున్నపుడు అతడు మణిసింగ్ అనే శిష్యుని సహాయము తీసికొనెను. తన స్వీయరచనలను సంగ్రహించడానికి కూడ ఆయన కృషి చేశాడు. ఈ రచనల నన్నిటినీ జతపరచి మణిసింగ్ ఆదిమ గ్రంథ్ వలె దశమ గ్రంథ్‌ను తయారుచేశాడు. ఇక్కడ ఉన్న సమయంలోనే దాదాపు 1,20,000 మందిని గోవిందసింహుడు తన పంథాలోనికి మర్చాడు.

1705 ప్రారంభంలో దీనా చేరిన తర్వాత, గురుగోవిందసింహుడు విఖ్యాతి గాంచిన "జఫర్‌నామా" ఉత్తరాన్ని ఔరంగజేబుకు తన శిష్యుడు దయాసింగ్‌తో పంపాడు. ఈ ఉత్తరం ఔరంగజేబు స్వహస్తాలకు అందియ్య వలసి ఉన్నది. దయాసింగ్ తన పనిని చాలా కాలం వరకు చేయలేకపోయాడు. మహారాష్ట్రులతో యుద్ధంచేస్తూ ఔరంగజేబు ఒక ప్రదేశంలో నిశ్చలంగా ఉండలేకపోయాడు. 1706 జనవరి 31వ తేదీన

అతడు అహమద్ నగర్‌లో విడిసినప్పుడు దయాసింగ్‌కు అవకాశం దొరికింది. మహారాష్ట్రులతో జరిగిన 24 సంవత్సరాల యుద్ధంలో ఔరంగజేబు అలసిపోయాడు. మహారాష్ట్రులను నిర్మూలించడం తనకు అసాధ్యమని అతడు రూఢిపరుచుకున్నాడు. ఔరంగజేబుకు ఉత్తరం పంపిన తర్వాతనే గోవిందసింహుడు సర్‌హింద్ సుబేదారు వజీర్‌ఖాన్‌ను ముక్తసర్‌వద్ద జరిగిన యుద్ధంలో ఓడించాడు. ఈ విషయం పాదుషాకి తెలుసు. ఇంకో విషయాన్ని కూడ అతడు గుర్తించాడు. వజీర్‌ఖాన్ హిందువులపై చేసిన అత్యాచారాల వలన, హిందువులు గురుగోవిందుని నాయకత్వాన విప్లవము జరిపి పంజాబులో మొగల్ అధికారాన్ని అంతమొందించే అవకాశాలున్నాయి. మొగల్ సామ్రాజ్యానికి మహారాష్ట్ర ప్రాంతమేకాకఇంకోప్రదేశం కూడా పక్కలో బల్లెమవుతుంది. ఈ సంకటాన్ని తప్పించుకోవటం కోసం ఔరంగజేబు గురుగోవిందుని దక్షిణానికి వచ్చి తనను కలుసుకోవలసిందిగా ఆహ్వానించాడు. వజీర్ ఖానును శిక్షించవలసిందిగా ఔరంగజేబును కోరటానికిది సరియైన సమయమని గోవిందసింహుడనుకొన్నాడు. కాని ఔరంగజేబు మాటలను విశ్వసించటానికి అతడు సిద్ధంగా లేడు. దాదాపు తొమ్మిది మాసాలు ఆలోచించి, 1706 అక్టోబరు 20వ తేదీన దక్షిణానికి బయలుదేరుదామని నిర్ణయించాడు. మార్గమధ్యంలో ఔరంగజేబు 1707వ సంవత్సరం ఫిబ్రవరి 20వ తేదీన మరణించాడని తెలిసింది. అందు వలన తిరిగి పంజాబుకు బయలుదేరాడు గోవిందసింహుడు.

ఒకసారి గురుగోవిందుడు ఢిల్లీ సమీపంలోని షహజహానా బాద్‌తో విడిసి ఉన్నాడు. పాదుషా సింహాసనానికి వారసుడైన మహమ్మద్ అజాంతో జరుగనున్న సంఘర్షణలో అతని సహాయం కోరాడు. అతని విజయానికి తోడ్పడ్డాడు గురుగోవింద సింహుడు. పాదుషా అయిన తరువాత బహదూర్ షా గురువును ఆహ్వానించి సత్కరించాడు. వారిద్దరి మధ్య సంప్రతింపులు ప్రారంభమయినాయి. సర్‌హింద్ యొక్క వజీర్

ఖానును బహదూర్ షా శిక్షించాలని గురుగోవిందుని కోరిక. బహదూర్ షా త్వరలోనే తన సోదరుడు కమ్‌బక్ష్‌తో యుద్ధానికి రాజస్థాన్‌కు, దక్షిణానికి వెళ్ళవలసి వచ్చింది. గోవిందుడు అతణ్ణి అనుసరించాడు. సంధి సంప్రదింపులు కూడ నడిచాయి. నాందేడ్ సమీపంలో వారు విడిసి ఉన్నప్పుడు మహారాష్ట్రులతో పోరాడటానికి గోవింద సింహుని సహాయమడిగినాడు. హిందువులను సంరక్షించే గోవిందసింహుడు హిందువులకు వ్యతిరేకంగా ఎలా సహాయం చేస్తాడు ? గోవింద సింహుడు పాదుషా మాటను ఒప్పుకొనలేదు. ఇది కాక ఇప్పటివరకు బహదూర్ షా తో ఏర్పడిన సంబంధాల వలన వజీర్ ఖాన్ వంటి దుర్మార్గులైన శాసకులకు శిక్షవిధించే సామర్థ్యం బహదూర్ షా లో లేదని గురు గోవిందునకు అర్థమయింది. అందువలన పంజాబులో హిందువులకు జరుగుతున్న అన్యాయములను అరికట్టుటకు పోరాటము తప్ప వేరే మార్గము లేదని నిర్ణయించుకొని సెప్టెంబర్ 1709లో గోవిందసింహుడు బహదూర్ షాను వదలినాడు.

అచటి నుండి గురుగోవింద సింహుడు నాందేడ్ వెళ్ళి అక్కడ మాధవదాస్ బైరాగి అనే ఒక సాధువును కలిసాడు. మాధవదాసు పేరు ప్రఖ్యాతులను, అతని తాంత్రిక విద్యను గురించ అంతకు మునుపే గురు గోవిందుడు విన్నాడు. మాధవధాస్ ఆరామంలో గోవిందసింహుడు చేరిన సమయానికి ఆ తాంత్రికుడు అక్కడ లేడు. అలసి ఉన్న కారణాన గురు గోవిందుడు మాధవదాస్ తల్పంపై విశ్రమించాడు. భోజనం కొరకు శిష్యులు మాంసం వండటం ప్రారంభించారు. మాధవదాస్ వైష్ణవుడు. శాకాహారి. అతని శిష్యులు తమ గురువు కుటీరములో జరుగుతున్న దుష్టాచారాన్ని గమనించి పరుగు పరుగున మాధవదాసు వద్దకు వెళ్ళి విషయాలను వివరించారు. తన తల్పాన్ని పరులెవ్వరో ఆక్రమించటం, తన ఇంటిలో మాంసం వండడం తెలిసి ఆ సిద్ధుడు మండిపడ్డాడు. మంచం మీద నున్న గోవిందుని క్రింద పడవేయటానికి తన మంత్ర తంత్రాలన్నీ

ప్రయోగించాడు. కాని గోవింద సింహుని ఆత్మశక్తి ముందు అవి ఎందుకూ కొరగాకుండా పోయాయి. పరుగు పరుగున మాధవదాస్ తన గృహాన్ని చేరుకున్నాడు. గోవింద సింహుని దివ్య విగ్రహం ముందు నిల బడగానే, అతడు నిశ్చేష్టుడై నాడు ఆగ్రహమంతా మంచులాగా కరిగి పోయింది. 'ఎవరు మీరని" ప్రశ్నించాడు. "నీవెవరినైతే ఎరిగి ఉన్నావో అతనినే" అని గోవిందసింహుడు సమాధానమిచ్చాడు. "అంటే! మీరు గురుగోవిందసింహులా ?" అని మాధవదాసు అడిగాడు. "అవు"నని వచ్చింది జవాబు. మరుక్షణంలో మాధవదాస్ గురుగోవిందునికి సాష్టాంగ ప్రణామం చేసి "స్వామీ! నేను మీ బందాను- మీ సేవకుడను. నన్ను ఆజ్ఞాపించండి" అన్నాడు, అనాటి నుండి అతనికీ బందా బైరాగి అని, బందాసింహుడనీ పేర్లు కలిగాయి.

అటుపైన గురుగోవిందుడు తన అనుచరులకు, ప్రార్థనా సమయాల్లో వచ్చి చేరే యితరులకూ, ఆధ్యాత్మిక మార్గదర్శనం చేస్తూ నాందేడ్‌లో తన కాలాన్ని గడపసాగాడు. జాతీయ పోరాటానికి నూతన ఉత్సాహం ప్రసాదించిన స్వాతంత్ర్య ప్రవక్తగా పేరొందాడు. సాహస ప్రధానమైన ఆరాధనా పద్ధతిని అతడు ప్రవచించాడు.

ఒక రాత్రి గోవిందసింహుడు తన నివాసంలో నిద్రకుపక్రమిస్తున్నాడు. ఇంతలో గుల్‌ఖాను అనే ఒక పఠాను లోనికి ప్రవేశించి హఠాత్తుగా అతని శరీరాన్ని బాకుతో రెండుసార్లు పొడిచాడు (20-9-1708). తల్పము నుండి క్రిందకు దూకి, కత్తిదూసి, పారిపోతున్న ఆ హంతకుని శిరస్సు నరికి వేశాడు గోవిందసింహుడు. తరువాత లభించిన సాక్ష్యాన్ని బట్టి ఈ హంతకుడు సర్‌హింద్ సుబేదారుచే ఈ పనికై నియోగింపబడ్డాడని ఋజువయింది. గాయాలకు వెనువెంటనే చికిత్సచేసి కట్టుకట్టారు కాని కొంత కాలమయిన తరువాత గాయము తిరిగి పగిలింది. తన అంత్యా

కాలం ఆసన్నమైనదని తెలుసుకున్నాడు ఆ మహనీయుడు. అనుచరులను దగ్గరకు పిలిచాడు. గురు పరంపర తనతో అంతం కావాలని తెలియ జేసాడు. 'ఆదిగ్రంథ్'ను తమ గురువు లందరియొక్క అమరవాణిగా స్వీకరించమని ఆదేశించాడు. ఆనాటి నుండి ఆదిగ్రంథ్ "గురుగ్రంథ సాహెబ్" గా పరిగణింపబడుతోంది.

గురుగోవిందునిపై జరిగిన అత్యాచారానికి బందా సింహునిలో ఆగ్రహము కట్టలు తెంచుకొని ప్రవహించింది. పరమ కిరాతకులైన ఈ పాలకులను నేల రాచటానికి పంజాబు తరలి వెళ్ళటానికి గురువు అనుమతి కోరాడు. ఆ ప్రాంతానికి తిరిగి వెళ్ళవలెననే ఉద్దేశ్యం గురుగోవిందుని మనసులోనే ఉండినది. 1707లో అక్టోబరు మధ్యలో తన అనుచరులకు వ్రాసిన ఒకానొక ఉత్తరంలో ఈ విషయం ఆయన ప్రస్తావించాడు. కాని ఈనాడు జరిగిన హత్యాప్రయత్నంతో తనకు తీవ్రమైన అఘాతం కలిగింది అందువలన తాను పంజాబుకు వెళ్ళడం అసంభవం. బందా సింహుని కోరికను అంగీకరించటం మినహా వేరే మార్గం తోచలేదు. గురుపరంపర తనతో అంతమయింది కనుక వేరే గురువును ప్రతిష్ఠాపించే ప్రశ్నే లేదు అందువలన బందాను సిక్కులకు సైన్యాధిపతిని చేశాడు. తన తర్వాత సిక్కులందరూ బాందాను నాయకుడుగా, రక్షకుడుగా స్వీకరించాలని ఆజ్ఞాపించాడు. మొగలులతో పోరాటాన్ని కొనసాగించటానికి బందా సింహుణ్ణి పంజాబుకు సాగనంపారు.

1708 సంవత్సరం అక్టోబరు 7వ తేదీ, అర్థరాత్రి ఒకటిన్నర సమయం. మహనీయుడైన గురుగోవింద సింహుడు రూ లోకాన్ని శాశ్వతంగా వీడి భగవంతుని దివ్య ధామంలో ప్రవేశించాడు. గురుగోవిందుడు

పరమపదించి చాలా కాలం గడిచింది. కాని ఆయన దివ్యస్మృతి హిందువు లందరిలో— బ్రాహ్మణులు, క్షత్రియులు, శిక్కులు, జైనులు, మరి ఏ యిత పేర్లను పెట్టుకొనినవారైన, మనసులలో ఎల్లకాలం నిలిచి పోతుంది.



# బందాసింగ్ బహదూర్

ఆంగ్లేయుల కాలంలో శివాజీనివక్రమార్గ మవలంబించిన దేశ భక్తునిగా విదేశీ చరిత్ర కారులు వర్ణించారు. మొగలు సామ్రాజ్య కాలంలో కూడా అదే విధంగా హిందూ జాతీయ వీరులను అనేకమందిని వక్రంగా చిత్రించారు ముస్లిం చరిత్ర కారులు. బందాసింగ్‌ను గురించి వ్రాస్తూ శిఖ్ఖుల పదవ గురువయిన గురుగోవింద సింహుని తండ్రియగు తేజ్ బహదూర్‌ను, అతని కుమారులను హత్య చేసిన నేరానికి ప్రతీకారంగా ముస్లిములపై అమానుషమైన ఘోర కృత్యాలను ఆచరించిన వ్యక్తిగా వారు అభివర్ణించారు. నిజానికి బందాసింగ్ ఒక మహనీయ వ్యక్తి. భారత మాత దేశానికి ప్రసాదించిన మహత్తర జాతీయ వీరులలో ఒకడు.

పశ్చిమ కాశ్మీర్‌లోని పూంఛ్ జిల్లాలో రాజౌరి అనే గ్రామంలో బందాసింగ్ 27–10–1670వ తేదీన జన్మించాడు. బాల్యంలో అతణ్ణి లక్ష్మణ్‌దేవ్ అని పిలిచేవారు. తండ్రి రామదేవ్. వృత్తికి రైతు. లక్ష్మణ్ లౌకిక విద్యాబుద్ధులు అంతగా నేర్చినవాడు కాడు. కాని నవనీతం వంటి హృదయం కలవాడు. ఒకసారి అతడు ఒక లేడిని చంపటం తటస్థించింది. అప్పుడు ఆ లేడి గర్భవతి. ఆ లేడితోబాటు దాని పిల్లలు కూడ గర్భం నుండి బయల్వెడలి ఎంతో తపిస్తూ ప్రాణాలు వదిలాయి. ఆ మరణ సమయంలో అవి పడిన కష్టాన్ని చూచి బందా భరించలేకపోయాడు. ఆ

సంఘటనతో అతని మనసు కలవరపడింది. దాంతో ప్రాపంచిక విషయాలపై అతడు ఆసక్తి విసర్జించాడు. అప్పుడు అతని వయస్సు కేవలం పదిహేను సంవత్సరాలైనా కుటుంబ విషయాలు పట్టించుకోకుండానే ఎల్లప్పుడు సాధుజనుల సాన్నిధ్యంలో కాలం గడప నారంభించాడు. ఆ రోజుల్లోనే బైరాగీ జానకీ ప్రసాద్ అనే సాధువు రాజౌరి వచ్చాడు. ఈ సాధువు లక్ష్మణ్‌దేవ్‌ను అమితంగా ఆకర్షించాడు. దాంతో సర్వసంగ పరిత్యాగియై లక్ష్మణ్‌దేవ్ ఆ బైరాగికి శిష్యుడైనాడు. బైరాగుల నియమానుసారం అతనికి మాధవదాస్ అనే నూతన నామధేయం యివ్వటం జరిగింది. తరువాత అతడు దేశాటనం చేయటం మొదలుపెట్టాడు. 1686లో రామదాస్ అనే మరో బైరాగికి శిష్యుడైనాడు. కాని అతడు కోరిన ఆత్మశాంతి లభించలేదు. తీర్థయాత్రల నెపంతో అతడు అనేక ప్రదేశాలు తిరిగి తిరిగి గోదావరి తీర్థస్థలమైన నాసిక్ చేరుకున్నాడు. అఘోరనాథ్ అనే వృద్ధ యోగి అక్కడ అతనికి తటస్థపడ్డాడు. అఘోరనాథ్ గొప్ప తాంత్రికుడు. మాధవదాస్‌కు ఈ తాంత్రిక శాస్త్రాన్ని అధ్యయనం చేయాలనే ఆకాంక్ష కలిగింది. భక్తితో అఘోరనాథ్‌ను సేవించి, అతని మన్ననకు పాత్రుడై చివరకు 1691లో తాంత్రిక శాస్త్రం అతడు పూర్తిగా అభ్యసించాడు. తర్వాత కొద్ది కాలంలోనే అఘోరనాథ్ చనిపోయాడు.

గురువు మరణానంతరం మాధవదాస్ నాసిక్ వదలి గోదావరీ తీర మార్గంలో పయనిస్తూ నాందేడ్ చేరుకున్నాడు. అక్కడే స్థిర నివాసం ఏర్పరచుకొని, నూతనంగా తాను నేర్చుకున్న విద్యను ప్రయోగించ సాగాడు. అతనితో అవసరమున్నవారు, మూఢ విశ్వాసం కలవారు తమ కోరికల సిద్ధికోసం అతని వద్దకు చేరసాగారు. మాధవదాస్ అక్కడే ఒక ఆశ్రమం ఏర్పాటు చేసుకొని అనతి కాలంలోనే చాలమంది భక్తులను చేర్చుకొని వైభవంగా జీవనం గడపసాగాడు. యోగిగా కీర్తి పెరిగినకొలది

ఆతనిలో గర్వం కలుగసాగింది. సాధు జీవితానికి కావలసిన మనస్తత్వం అప్పటి కింకా అతనిలో పరిపక్వం జెందలేదు. తాను చాలా గొప్పవాడిననే భావం రావటంతో అతనిలోని సద్గుణాలు క్రమంగా మరుగున పడ్డాయి. నిజానికి అతనిలో శక్తిసామర్థ్యాలకూ, ఉత్సాహానికీ కొదువలేదు. కాని అవి వక్రమార్గంలో ఉపయోగింపబడుతుండేవి. తాంత్రిక విద్యలను తనవద్దకు వచ్చిన సాధుపుంగవులమీద, అతిథులమీద ప్రయోగించి వారు తికమక పడుతుండగా అతడు చూచి ఆనందించసాగాడు. రాజస్థాన్‌కు చెందిన జైత్‌రామ్ అనే మహంత్ ఒకసారి అతనిచేత ఇలా అవమానింపబడ్డాడు. జైపూర్ సంస్థానంలో ఒకసారి గురుగోవిందసింహుని కలసినప్పుడు ఈ జైత్‌రామ్ నాందేడ్‌లో బైరాగి మాధవదాసు మంత్రశక్తుల విచిత్ర ప్రయోగాలద్వారా యితరులను బాధించటాన్ని గురించి ఆయనకు వివరించాడు. ఆ బైరాగిని ఎన్నడూ కలువవద్దని కూడ ఆయనను హెచ్చరించాడు. మాధవదాస్ యీ విధంగా పదహారు సంవత్సరాలు గడిపాక, చిట్టచివరకు 1708 తో గురుగోవిందసింహుడు ఆ యోగిలోని మహత్తర శక్తులు వక్ర మార్గంలో ఉపయోగబడటం అరికట్టి, ఖల్సా సంప్రదాయమనే సన్మార్గ ములో వినియోగ పడేట్లు చేశాడు.

ఒకసారి ఢిల్లీ సమీపంలోనున్న షహజహనాబాద్‌లో గురుగోవింద సింగ్ ఉన్నప్పుడు మొగల్ సింహాసనానికి వారసుడైన బహదూర్ షా తన సోదరుడైన మహమ్మద్ ఆజమ్‌తో జరుగనున్న పోరులో సహాయపడ వలసిందిగా గోవిందసింహుని అర్థించాడు. గురుగోవిందుడు అందు కంగీక రించి బహదూర్ షా విజయానికి తోడ్పడ్డాడు. పిమ్మట బహదూర్ షా గోవిందసింహుని ఆహ్వానించి గౌరవించాడు. వారిద్దరిమధ్య సంప్రదింపులు ప్రారంభమైనాయి. కాని కమబక్ష్ అనే తన సోదరునితో పోరాడటానికి రాజస్థాన్‌కు, దక్షిణానికీ బహదూర్ షా త్వరలోనే వెళ్ళవలసి వచ్చింది. గోవిందసింహుడు షాను అనుసరించాడు. ఈ విధంగా సంప్రదింపులు

పదిమాసాలు కొనసాగాయి. కాని నాందేడ్‌లో పాదుషా విడిసినప్పుడు ఈ సంప్రదింపులు విఫలమైనట్లు కనబడుతోంది. ఆర్తులై అనేక కష్టాలు పడుతున్న లక్షలాది హిందూ ప్రజలకు సుఖశాంతులు కలుగజేయాలనేది అతని కోరిక. దానికై అతడు చేసిన ప్రయత్నాలు వమ్మయినాయి. అందు వలన గురుగోవిందుడు మళ్ళీ యుద్ధ ప్రయత్నాలు చేయవలసి వచ్చింది. సెప్టెంబరు ఆఖరు వారంలో షాను గురుగోవిందుడు నాందేడ్‌లో విడిచి వెళ్లాడు. ఇక్కడే ప్రప్రథమంగా గోవిందసింహుడు మాధవదాసును కలుసు కొన్నాడు.

మహంత్ జైత్‌రామ్ మునుపు తనను హెచ్చరించినప్పటికీ, మాధవ దాసునుగూర్చి గోవిందసింహునికి వేరే అభిప్రాయముండేది. అందుచేత జైత్‌రామ్ హెచ్చరికను లెక్కచేయకుండా అతడు ఆ బైరాగి నివాసానికి దారితీశాడు. అక్కడ చేరిన సమయానికి మాధవదాసు ఆశ్రమంలో లేడు. అక్కడనున్న ఒకే ఒక మంచంపై గోవిందసింహుడు విశ్రమించాడు. శిష్యులు అతని భోజనంకొరకు మాంసం వండసాగారు. బైరాగి వైష్ణవుడు. అతడు, అతని శిష్యులు శాకాహారులు. కాని ఆశ్రమంలో శిక్కులు మాంసం వండటం బైరాగి శిష్యులకు చాలా అవమానకరంగా తోచింది. తక్షణం వారు తమ గురువు వద్దకు పరుగెత్తి వెళ్ళి ఆశ్రమంలో ప్రవేశించిన వింత వ్యక్తులను గూర్చి, వారు చేస్తున్న దురాచారాన్ని గూర్చిచెప్పారు. బైరాగి తోక త్రొక్కిన త్రాచులా లేచాడు. కోపంతో బుసలు కొట్టాడు. తన తల్పాన్ని ఇంకో వ్యక్తి ఆక్రమించటం తన తాంత్రిక శక్తులకే ఒక సవాలని, తన నివాసంలో మాంసం వండటం తన ఆచారాలకు తీవ్రమైన ఆఘాతమనీ అతడు తలచాడు. ప్రతీకారం తీర్చుకొనటం కోసం, తన అధీనంలో నున్న దుష్ట తాంత్రి శక్తులను, తుచ్ఛమైన యుక్తులను ఉపయో గించి ఒక్కసారిగా తల్పాన్ని తలక్రిందులుగా చేసి గోవిందసింహుని పడ వేయాలని ప్రయత్నించాడు. కాని గోవిందసింహుని మనోదార్ఢ్యం ముందు

ఈ శక్తులన్నీ ఏమీ పనిచేయలేకపోయాయి. దాని వలన బైరాగి ప్రయత్నమంతా బూడిదలో పోసిన పన్నీరైంది. అతనికి గర్వభంగమైంది. దానితో అతనిలో రోషం పెరిగింది. వెంటనే గోవిందసింహునిపై బడి పగ తీర్చుకుందామని పరుగు పరుగున ఆశ్రమానికి వచ్చాడు. కాని, గురుగోవిందుని చూస్తూనే మంత్ర ముగ్ధుడై తన అపజయాన్నంగీకరిస్తూ తలవంచాడు.

గోవిందసింహుని సమక్షంలో నిలబడ్డ మాధవదాసు అతనితో గౌరవపురస్సరంగా మాటలాడక తప్పలేదు. బటాలానివాసియైన అహమ్మద్ షా, ఆనాడు ఆ బైరాగికీ గురుగోవిందునికీ మధ్య జరిగిన సంభాషణను ఒక సందర్భంలో ఈ విధంగా పేర్కొన్నాడు:

మాధవదాస్ :- ఎవరు మీరు?

గోవిందసింహుడు :— నీకు తెలిసినవాడనే.

మాధవదాస్ :- నాకేమీ తెలుసు?

గోవిందసింహుడు :- ఒకసారి ఏకాగ్రతతో ధ్యానముంచి ఆలోచించు. నేనెవరినో నీకే గుర్తుకు వస్తుంది.

మాధవదాస్ :— (ఒకక్షణం ఆగి) ఓహో! మీరుగోవిందసింహులా!

గోవిందసింహుడు :- అవును.

మాధవదాస్ :- మీరు ఏమి ఆశించి యిక్కడకు వచ్చారు?

గోవిందసింహుడు :- నిన్ను నా శిష్యునిగా చేసికొందామని వచ్చాను.

మాధవదాస్ :- ప్రభూ! నన్ను నేనే మీకు సమర్పించుకుంటున్నాను. ఇకనుంచి నేను మీ "బందా" (బానిస)ను.

అహంకారియై అజేయుడుగా చలామణీ అవుతున్న ఆ బైరాగి నమ్రతాపురస్సరంగా గోవిందసింహుని చరణకమలాలచెంత మోకరిల్లాడు. వాదోపవాదాలు అవసరం లేకుండానే గురు గోవిందుని పంథాను స్వీకరిం

చాడు. నిజానికి గోవిందసింహుని చూచిన క్షణంలోనే ఆ గురువుకు అతడు శిష్యుడైనాడు ఆ మహనీయుని పాదధూళి శిరస్సున తాకగనే అతని హృదయం పులకించింది. స్వాప్నిక జగత్తులో ప్రవేశించినట్లు తనకు తెలియకనే ఏదో భావావేశం కలిగినట్లు అతడు ఒక క్రొత్త అనుభూతిని పొందాడు. తుచ్ఛమైన తాంత్రిక శక్తులతో పాప భూయిష్టమైన ఆ బైరాగి శరీరం ఆ క్షణంలో పవిత్ర శిక్కు సంప్రదాయంలో బందాగా మారి బంగారంవలె మెరిసింది. పంథా మార్పుకొరకు అవసరమైన సంస్కారాలు సలిపి అతడు సంపూర్ణుడైన శిఖ్కుగా మారాడు. గోవిందసింహుడు బైరాగికి ఆనాడే బందాసింగ్ అనే పేరును పెట్టాడు. తర్వాత అతనే "బందా" గా, "బందా బహదూర్"గా సామాన్య ప్రజానీకంచేత వ్యవహరింపబడుతూ వచ్చాడు. అతడు ఆనాడే తన ఆశ్రమాన్ని విసర్జించి, తన నూతన ధ్యేయాన్ని సంపూర్తి చేయడానికి గురువు ననుసరించి వెళ్ళాడు. అతడు శిక్కుల చరిత్రను క్షుణ్ణంగా పఠించాడు. వారిమీద మొగలాయీలు చేసిన అత్యాచారాలను తెలుసుకున్నాడు.

ఆ దినాల్లోనే సర్‌హింద్‌కు చెందిన ఒక పఠాన్ గోవిందసింహుని గాయపరచాడు. ఈ క్రూరకృత్యం చేయించినవాడు సర్‌హింద్ పరిపాలకుడైన వజీర్‌ఖాన్. ఈ వజీర్‌ఖాన్ గోవిందసింహుని పసిబాలకులను నిర్దాక్షిణ్యంగా చంపించాడు. శిక్కులపై ఎనలేని ఘోర కృత్యాలను జరిపించాడు. తమ చక్రవర్తి బహదూర్ షాతో గోవిందసింహుడు అప్పట్లో సంప్రదింపులు జరుపుతున్నాడని ఖాన్‌కు తెలిసింది. అంతేగాక షాకు యుద్ధంలో గోవిందసింహుడు సహాయం చేసినట్లుకూడా విన్నాడతడు. ఇది అతనికి చాలా ఆశ్చర్యం, బాధ కలిగించాయి. గోవిందసింహునిపట్ల తన చర్యలకు చక్రవర్తి శిక్ష విధిస్తాడేమోననే అనుమానంకూడ అతనిలో కలిగింది. దీనికి పరిష్కారం ఒక్కటే తోచిందతనికి-గోవిందసింహుని హతమార్చటం. దీనికోసం యిద్దరు పఠానులను నియోగించాడు ఖాన్.

వారు దక్షిణదిశగా ప్రయాణంచేసి నాందేడ్ చేరారు. గోవిందసింహుని అనుచరులతో కలిసి తిరగటం ప్రారంభించారు. వారిని ఎవ్వరూ అనుమానించలేదు. సరియైన సమయంకొరకు వారు వేచియున్నారు. ఒక సాయంత్రం గోవిందసింహుడు ప్రార్థనల అనంతరం విశ్రమించాడు. దురదృష్టవశాత్తు అతని అంగరక్షకుడు కూడా అప్పుడు మగత నిద్రలో నున్నాడు. ఇదే అదనుగా కని పెట్టిన ఒక పఠాను గోవిందసింహుడు నిద్రిస్తున్న గదిలో దొంగతనంగా ప్రవేశించాడు. నిద్రిస్తున్న ఆ పురుషపుంగవుని తన కైజారుతో పొడిచాడు. హంతకుడు తక్షణమే పట్టుబడ్డాడు. అతనికి సరియైన శిక్షకూడా విధించారు. ఈ విషాదవార్త ఎల్లరినీ శోక సముద్రంలో ముంచింది. అది విన్న బందా కోపం మిన్నుముట్టింది. పంజాబువెళ్ళి రాక్షసత్వానికి ప్రతీకములైన ఆ ముస్లిం రాజులను పదవీచ్యుతులను చేసి వారిని తగిన విధంగా శిక్షించుటకు తనకు అనుమతి నీయమని గురువును కోరాడు.

తానే పంజాబుకు తిరిగి వెళ్ళవలెననే ఉద్దేశ్యం గురుగోవిందునిలో ఉండేది. 1707 అక్టోబరు మధ్యలో పంజాబులో ఉన్న తన అనుచరులకి వ్రాసిన ఉత్తరాలలో ఈ విషయం ప్రస్తావించాడతడు. కాని ఈనాడు కలిగిన ప్రమాదం వలన తన ఉద్దేశ్యం నెరవేరే సూచన కనబడలేదతనికి. బందా పంజాబుకు తాను వెళతాననే కోరిక వెలిబుచ్చి అనుమతిని కోరినపుడు గోవిందసింహునికి మరోమార్గం కనిపించలేదు. శిక్కులకు తన తర్వాత ఇంకో గురువును నియమించే ప్రసక్తి లేనేలేదు. గురు పరంపర తనతో ముగుస్తుందని తానే నిర్ణయించి ప్రకటించాడు. అందువలన బందాసింహునికి పంజాబు పోవుటకు అనుమతి నిస్తూ అతనికి శిక్కుల యొక్క సైన్యాధిపత్యమును కూడ అనుగ్రహించాడు. తన తర్వాత శిక్కులందరూ బందాసింహునే నాయకుడుగా, రక్షకుడుగా స్వీకరించవలెనని గోవిందుడు ప్రకటించాడు. మొగలులతో పోరాటాన్ని కొనసాగించటానికి బందాను పంజాబుకు పంపాడు. అతనికి శిక్కులపై రాజకీయ

అధికారానికి చిహ్నంగా తన ధ్వజమును, ఢంకాను, తన విజయ ఆకాంక్షకు గుర్తుగా తన తూణీరంలోని అయిదు బాణాలను ప్రసాదించాడు. బందాకు సహాయార్థం పంచప్యారా పరిషత్తును కూడా గోవిందసింహుడు నియమించాడు. అందులోని అయిదుగురు సభ్యులు-బినోద్ సింహుడు, కహాన్ సింహుడు, బాజ్ సింహుడు, దయా సింహుడు, రామ సింహుడు-మరి యిరువదిమంది శిక్కు శిష్యులనుకూడా బందాను అనుసరించమని చెప్పాడు. బందా పంజాబుకు పయనమయ్యే తరుణ మాసన్నమైంది. గోవింద సింహుడు బందాను కొన్ని ప్రమాణములు చేయవలసినదిగా కోరాడు. పవిత్రశీలము కలిగివుండుట, పరస్త్రీలను తాకకుండుట, మనసా, వాచా, కర్మణా, నిజాయితీ కలిగియుండుట, ఖాల్సాలకు తాను కేవలము సేవకుడవనే భావన కలిగియుండుట, ఖాల్సాయే యికముందు గురువు అని భావించుట-అను నియమముల కంగీకరించి, తన గురువు ఆజ్ఞాపించినట్లు వ్యవహరిస్తానని బందా ప్రయాణం చేశాడు.

ఈ విధంగా ఖాల్సా సైన్యాధిపత్యం వహించి బందా ఉత్తరానికి బయలుదేరాడు. ఢిల్లీ పరిసర ప్రాంతాలలో మొగలులు తనను అనుమానించకుండా చాల జాగ్రత్తగా వ్యవహరించాడు. ఖర్ఖండ్ పరగణాలోని సెహ్రి, ఖండాలను సమీపించాడు. అక్కడనుంచి పంజాబులోని ముఖ్యులైన శిక్కులకు బందాతో చేరవలసిందనే గురుగోవిందుని ఆజ్ఞా పత్రాలను పంపించాడు. దుష్టులైన పాలకులను తాను శిక్షింప వచ్చినట్లు బందా వారికి తెలియజేశాడు. నాందేడ్ నుండి అతనితో వచ్చిన యితర శిక్కులు తమ మిత్రులకు వేలాది ఉత్తరాలు వ్రాస్తూ బందాసింహునితో వచ్చి కలువవలసిందిగా తెలియజేశారు. ప్రజలలో తిరిగి చైతన్యాన్ని కలిగించటంకోసం వజీర్ఖాన్ మొదలుగా గల ముస్లిము రాజులు శిక్కులపై జరిపిన అత్యాచారాలను గుర్తుకు తెచ్చారు. బందాసింగు నాయకత్వాన శిక్కులు వేలాదిగా చేరారు. శిక్కు వ్యవసాయదారులందరూ మరల ఆయుధాలు చేత ధరించారు.

పరకీయ పరిపాలననంతమొందించి, దేశాన్ని స్వతంత్రం చేయడానికి బందాసింహునికి నిర్దుష్టమైన పథకాలుండేవి. అత్యాచారాలకు లోనవుతున్న హిందువులను సంరక్షించటం, గురుగోవిందుని కుమారులను, ఆయన తండ్రి తేజ్‌బహదూర్‌ను చంపిన నేరానికి ముస్లిములపై ప్రతీకారం తీర్చుకోవటం-ఇవి తప్పక నెరవేర్చవలసి యున్నప్పటికీ అంతకన్నా ముఖ్యమైన విషయాలున్నాయని అతడు గుర్తించాడు. విదేశీయుల పరిపాలననుండి, దౌష్ట్యాలనుండి దేశాన్ని సంపూర్ణంగా విముక్తం చేయటమే తన ప్రముఖ కర్తవ్యంగా అతడు నిశ్చయించుకున్నాడు. గురుగోవిందుడు తన తండ్రి కుమారుల హత్యలకు పగతీర్చుకొనుటకే బందాసింహుని తన వారసునిగా నియమించాడని విదేశీ చరిత్రకారులు వ్రాశారు. కానీ జరిగిన చరిత్రలో ఒక్క సంఘటనకూడా ఈ విపరీత వాదనను సమర్థించేదిగా లేదు. గురుగోవిందునికి ప్రతికారం తీర్చుకోవాలనే కోరిక ఎన్నడూ లేదు. ఔరంగజేబు తనను, తదితర హిందువులను అమితంగా బాధించినప్పటికీ అతని పుత్రునికి గోవిందసింహుడు సహాయం చేశాడు. మీదు మిక్కిలి వజీర్‌ఖాన్ మరణంలో బందాసింహుని ఆశయం పూర్తికాలేదు. తర్వాతకూడా అతని కార్యక్రమం కొనసాగింది. ఇదేకాక మొట్టమొదటనుండీ బందాసింహుడు వివిధ ప్రాంతాలను ఆక్రమించుకొని అక్కడి విదేశీ పాలకులను తొలగించి, వారి స్థానాల్లో స్వజాతీయులను నియమించసాగాడు గురుగోవిందుకన్న బందా యీవిషయంలో ముందడుగు వేశాడు. శిక్కు గురువు లెవరూ యిట్టి పనిని చేయలేదు.

తమ ధ్యేయానికనుగుణంగా బందాసింహుడు, పంచప్యారాలు సర్‌హింద్ ఆక్రమణ తమ ప్రప్రథమ లక్ష్యంగా ఎన్నుకొన్నాడు. ప్రారంభంలో బందాసింహునివద్ద ధనం కాని, ఆయుధాలు కాని, మందుగుండు సామాగ్రికాని లేవు. శిక్కుల అచంచల విశ్వాసం, ధ్యేయనిష్ఠలే బందా

సింహుని వద్ద గల శక్తులు. తమ సంఘటిత ప్రయత్నాల వల్లనే శిక్కులు విజయం సాధించాలి. స్వాతంత్ర్యం కోసం వారు చేసే ప్రయత్నాలు ఈ విజయాలవల్ల పటిష్టమౌతాయి. శిక్కుల హృదయాలలో లోతుగా నాటుకొనియున్న పెక్కు శల్యాలను కదిలించే పెక్కు సంఘటనలకు సర్ హింద్ చిహ్నంగా నిలిచి వుంది. ఇక్కడే సర్ హింద్ పాలకుడైన వజీర్ ఖాన్ ఆజ్ఞానుసారం గురుగోవిందుని కుమారులు - ముక్కుపచ్చలారని పసిపిల్లలు – దారుణంగా హత్య గావించబడ్డారు. ఈ వజీర్‌ఖానే ఆనందపూర్‌లో గోవిందసింహుని అనేక కష్టాలపాలు చేసాడు. చమ్‌కౌర్‌లో అతనిపై దాడి సలిపి అతని పెద్దకుమారులిద్దరి మరణానికి కారకుడయ్యాడు. ముక్తసర్‌దాకా గురువును వెంటనంటాడు. ఈ ముక్తసర్‌లోనే నలభై మంది ప్రముఖ శిక్కు నాయకులు ప్రాణాలు పోగొట్టుకోవలసి వచ్చింది. ఈ వజీర్‌ఖాన్ దూతలే గురు గోవింద సింహుని నాందేడ్‌లో హత్య చేశారు. ఇట్టి సర్‌హింద్ ప్రాంతాన్ని ఆక్రమించటానికి శిక్కులందరూ సర్వసాధారణంగా అత్యుత్సాహంతో ముందడుగు వేస్తారు. అందువలననే ఆ ప్రదేశమే ప్రప్రథమ లక్ష్యంగా వారిచే ఎన్నుకోబడింది.

కావలసినంత మంది చేరగనే బందాసింహుడు సర్‌హింద్ దిక్కుగా పయనం సాగించాడు. మార్గ మధ్యంలో అనేక ముఖ్యమైన ముస్లిము స్థానాలను నాశనం చేసి దోచుకున్నారు. 26-11-1709 ఉదయం జలాలుదీన్ స్వస్థానమైన 'సామానా'పై బందా విరుచుకు పడ్డాడు. పూర్వం గురు తేజ్ బహదూర్‌ను చంపటానికై నియమించబడినవాడీ జలాలుద్దీనే. ఆనాటి సూర్యాస్తమయానికి ఆ నగరంలోని మహలులన్నీ నేలకలిసాయి. పదివేల మంది ముస్లిములు అక్కడ ఆనాడు నశించినట్లు చెబుతారు. చాల ధన ధాన్యాదులు శిక్కుల వశమైనాయి.

పిమ్మట సామానాలో కొద్ది రోజులే ఉన్నాడు బందాసింహుడు. సర్‌హింద్‌కు వీలైనంత త్వరలో వెడదామని అనుకున్నాడతడు. కాని

వజీర్ ఖాన్‌తో ముఖాముఖి యుద్ధం తలపెట్టడానికి తగినంత సైన్యం లేదు. అపారమైన శక్తిని అతడు సమకూర్చుకోవాలి. సాహసవంతులై ఆత్మార్పణ చేయగల వీర యువకులను అతడు సంఘటిత పరచాలి. మఝ, దోఆబల లోని శిక్కులు సట్లెజ్ నది దాటివచ్చి అతనితో చేరితే అతని కోరిక నెర వేరుతుంది. మఝ వాస్తవ్యులైన పంచప్యారాల వద్దనుండి ఈ సమాచారం అందగానే అక్కడి శిక్కు వీరులు బందాసింహుని కలుసుకోవటానికి బయలు దేరారు. కాని మాలేర్ కోట్లవద్దనున్న పఠాను సైన్యమొకటి వీరిని అడ్డగించింది. వీరు వచ్చి కలిసేవరకు బందాసింహుడు కొంత వ్యవధి ఇవ్వవలసి వచ్చింది. అందువల్ల సామానా నుండి తూర్పు దిక్కుగా సట్లెజ్ తూర్పు తీరాన వున్న కిరాట్‌పూర్ పట్టణానికి బయలుదేరాడు. అక్కడే మఝ. దోఆబలకు చెందిన కొందరు శిక్కులు సమావేశమై యుండిరి.

ఘరమ్, తసాకు, మహోబాద్, ముస్తఫాబాద్‌లు ఎక్కువ ప్రయత్నం లేకనే బందాకు లోబడినాయి. తర్వాత కాపూరి పట్టణాన్ని ముట్టడించాడు. ఆ పట్టణంలోని మొగలు సైన్యాధిపతి కాదముద్దీన్. ఇతని భోగవిలాసా లను, దండయాత్రలను గూర్చిన కథలు రెండు వందలయేండ్ల తర్వాత యిప్పుడు కూడా పంజాబులో చెప్పుకుంటూ ఉన్నారు. అట్టి కాదముద్దీను నివసించుచుండిన కాపురి పట్టణాన్ని ముట్టడించి దాన్ని అగ్నికి ఆహుతి చేసాడు బందా.

ఆపైన అతని దృష్టి సాఢౌరా మీద పడింది. ముస్లింల దౌర్జ న్యానికీ, అత్యాచారాలకు ఇది మరో ప్రముఖ కేంద్రం. అక్కడి హిందు వులకు తమలో చనిపోయిన వారికి దహన క్రియలు జరిపించటానికి కూడ అనుమతి లభించేది కాదు. ఇతర ధార్మిక ఉత్సవాలను చేయాలని ఊహిం చటానికి కూటా వీలుండేది కాదు. గోవులు వందలాదిగా హత్య చేయబడు తుండేవి. చాల మంది హిందువులు బలవంతంగా పట్టణం నుండి బైటకి

పంపబడ్డారు. ఈ పట్టణ పాలకుడు ఉస్మాన్‌ఖాన్. పూర్వం భంగానీవద్ద జరిగిన యుద్ధంలో గురుగోవిందునికి సహాయం చేసాడనే నేరానికి సయ్యద్ బదుద్దీన్ (ఇతని మరో పేరు బుధుషా) అనే ముస్లిం సాధువును ఈ ఉస్మాన్‌ఖాన్ చిత్రహింసలుబెట్టి చంపించాడు. ఈ విషయం తెలిసిన శిక్కులకు వాని పేరు తలచుకొన్నకొలది ఉద్రేకం పెచ్చుపెరిగింది. సాధౌరాపై దాడి జరిగింది. ఇంతకాలం బాధపడుతూన్న బీద ప్రజానీకం ఇదే అవకాశంగా తీసుకొని బందా సైన్యంలో చేరి పట్టణంపై విరుచుకు పడ్డాడు. భవనాల నన్నింటినీ అగ్నికి ఆహుతి చేశారు. అందిన ముస్లిం లందరినీ కత్తికి ఎరచేశారు. అప్పటి నుండి ఆ ప్రదేశానికి కతల్‌గడి అనే పేరు వచ్చింది. సాధౌరాను వశపరచుకొన్న తర్వాత శిక్కులు సమీపము లోనున్న ముఖలిస్‌గఢ్ అనే కోటను ఆక్రమించుకొన్నారు.

ముఖలిస్‌గఢ్‌పై విజయం సాధించి, బందా సైన్య సమేతుడై ఈశాన్య దిక్కుగానున్న కిరాట్‌పూర్‌వైపు కదిలాడు. ఇంతలో రూపార్ వద్ద తమనడ్డగించిన మాలేర్ కోట్ల పఠాను సైన్యాన్ని మరుభ్, దో అబల శిక్కులు ఓడించారు. వీరి విజయానికి ముఖ్య కారణం బందా సైన్యంలో చేరడానికి స్వయం స్ఫూర్తితో ఉత్తరం నుండి బయలుదేరిన శిక్కులు క్రితం రోజు రాత్రి సమయంలో వచ్చి కలవటమే. తమ దగ్గరవున్న యుద్ధ సామాగ్రి చాలా తక్కువైనా ప్రాణాలొడ్డి, సాహసవంతంగా పోరాడి వారా యుద్ధంలో జయించారు. కాని, తమకు చాల స్వల్ప బలగం ఉందని వారికి తెలుసు. అందుచేత వారు శత్రువును వెంటనంటి సంపూర్ణంగా నిర్మూలించలేదు. కేవలం సట్లెజ్ దాటి బానూర్‌వద్ద బందాను కలుసుకున్నారు. సాహసవంతులైన ఆ యువకులు సాధించిన విజయానికి బందా మహానందపడ్డాడు. కొన్ని మైళ్ళదాకా ఎదురేగి వారిని ఆహ్వానించి తీసుకువచ్చాడు.

అప్పటికి శిక్కుసైన్యం బాగా బలంపుంజుకుంది. సర్‌హింద్ పట్టణంపై చేయనున్న పవిత్ర యుద్ధం కోసం ఆత్రుతతో వారు ఎదురు చూడ సాగారు ఆ నగర పరిపాలకుడైన వజీర్‌ఖాన్‌ను వధించటానికి ప్రతివారూ పోటీ పడసాగారు. ఈ నగరంలోనే ఆ క్రూరుడు గురు గోవిందుని పసిబాలురను హత్యచేయించాడు. ఎంతటి ఆత్మస్థైర్యమా జోరావర్‌సింహ్, ఫతేసింహులది? ఇస్లాం మతాన్ని స్వీకరించక ఆ వీర కిశోరము లెంత ధైర్యంగా ప్రతిఘటించారు! నవాబు యివ్వజూపిన అన్ని సంపదలనూ, సుఖాలనూ తృణీకరించి తమ మతంపైన అచంచల విశ్వాసాన్ని ప్రకటించిన ఆ బాలుర ధైర్యమేమని చెప్పవలెను! ఇంతకీ ఆనాటికి వారి వయస్సెంత! కేవలం తొమ్మిది, ఆరు సంవత్సరాలే కదా? ముక్కు పచ్చలారని పసివారిని ఎంత అమానుషంగా చంపారు ఈ కిరాతకులు? ఆ బాలుర చేతివ్రేళ్ళను ముందుగా మందుగుండు సామాగ్రితో పేల్చివేసారు. వారికోసం తయారయిన ఒక గోడలో చుట్టూ ఇటుకలు పేర్చికట్టారు. ఏమి చేసినా చలించలేదు ఆ బాలురు. దాంతో వజీర్‌ఖాను కోపంతో రెచ్చిపోయాడు. అగ్నిలో ఆజ్యం పోసినట్లు అతని కోపాన్ని సర్‌హింద్ హిందూ మంత్రియైన సుచానంద్ మాటలు ప్రజ్వలింప జేసాయి. "పామును మాత్రం చంపి, దాని సంతానాన్ని విడిచి పెట్టడం బుద్ధిమంతుల లక్షణం కాద" న్నాడు సుచానంద్. చమకౌర్ యుద్ధంలో గోవిందసింహుని ఎదిరించి గతించిన వారిలో మాలేర్‌కోట్ల నివాసియైన షేర్ మహమ్మద్‌ఖాన్ బంధుమిత్రులెందరో ఉన్నారు. వారి మరణానికి ప్రతీకారంగా గోవిందసింహుని కుమారులను చంపవలసిందిగా వజీర్‌ఖాన్ షేర్ మహమ్మద్‌ఖాన్‌ను నియమించాడు. తాను పసిబాలురను చంపవలెననే భావనరాగానే షేర్ ఒక్కసారిగా భయభ్రాంతుడై ఆ దుర్మార్గానికి సమ్మతించలేదు. 27-12-1704వ తేదీన ఇతరులు ఆ బాలుర నిద్దరినీ వధించారు. ఆనాటి సంఘటనను ఇంకా శిక్కులు విస్మ

రించలేదు. నీచుడైన వజీర్‌ఖాన్‌పై పగ తీర్చుకోటానికి శిక్కు వీరులందరూ ఆవేశంలో కత్తులు నూరసాగారు. ఈ యుద్ధంలో పాల్గొటనం తమ పవిత్ర ధర్మంగా భావించారు. ఎక్కువ సంఖ్యలో శిక్కు వీరులు సంఘటిత మయ్యారు. కాని వారి వద్ద ఫిరంగులు లేవు; ఏనుగులు లేవు: కనీస కావలసినన్ని గుర్రాలు కూడా లేవు. వజీర్‌ఖాన్ తనకు కావలసిన బలంగాన్ని సమకూర్చుకున్నాడు. స్వంత సైన్యం కాకుండా దక్షిణంలోని హిస్సార్ తదితర ప్రదేశాల నుండి, ఉత్తరాన లాహోర్, ఎమినాబాద్ నుండి సైన్యాలను తెప్పించి సమీకరించాడు. మొత్తం సైన్యం కనీసం యిరవై వేలకుపైగా ఉంటుంది. ఇదిగాక ఖాన్‌వద్ద ఫిరంగులు, శతఘ్నులు పెద్ద గజబలం కూడా ఉండేది.

చప్పార్-చిరి మైదానాల్లో 12-5-1710న రెండు సైన్యాలు తలపడ్డాయి. మొదటి సంఘర్షణలోనే ధనం కోసం, దోపిడి చేయడం కోసం మాత్రమే చేరిన భీరువులు కొందరు బందా సైన్యం నుండి పారిపోయారు. దుర్మార్గుడైన సుచానంద్ అన్న కుమారునిచే రహస్యంగా బందాసైన్యంలో చేర్చబడిన వేయిమంది సైనికులు కూడ పారిపోయారు. ఈ సంఘటనలు తన మిగతా సైన్యాన్ని నిర్వీర్య పరచకుండా బందాసింహుడు యుద్ధ రంగంలోకి స్వయంగా దుమికాడు. సైన్యాన్ని స్వయంగా ముందుండి నడిపించసాగాడు. రెండు సైన్యాలు ముఖాముఖి ఢీకొన్నాయి. శిక్కులు తమ అగర్భ శత్రువులైన ముస్లింలను ఎదుర్కొన్నారు. శత్రువులు దూరాన ఉన్నంత వరకు కాల్పులు జరిపారు. వారు దగ్గరకు రాగానే తుపాకులు పారవేసి ముష్టియుద్ధానికి తలపడ్డారు. వజీర్‌ఖాన్ అతని అనుచరులు కూడా వీరోచితంగా పోరాడారు. వందలాది శిక్కు వీరుల శరీరాలు నేలకొరుగుతున్నాయి. వారి రక్తంతో భూమి ఎర్రబడింది. ఆఖరుకు ముస్లిం సైన్యాన్ని వారు సంపూర్ణంగా సర్వనాశనం చేశారు. వజీర్‌ఖాన్ పంచప్యారాలలో ఒకడైన బాజ్ సింహుని ఎదుర్కొన్నాడు. ఖాన్ 'నీచ

శునకమా! జాగ్రత్త' యనుచు, అతనిపైకి ఒక వాడియైన శూలాన్ని పట్టుకొని దూకాడు. బాజ్‌సింగ్ శూలాన్ని ఖాన్ హస్తము నుండి లాక్కుని అతని గుర్రాన్ని చావమోదాడు. ఇంతలో పొదిలోని బాణానొకదాన్ని తీసుకొని ఖాన్ బాజ్ సింహుని భుజంలో గుచ్చాడు. పైగా తన ఖడ్గాన్ని ఒర నుండి లాగి ఝుళిపిస్తూ బాజ్‌ను అంతం చేయడానికి ముందుకు ఉరికాడు. ఇంతలో దగ్గరలోనే ఉన్న ఫతేసింహుడు తన ఖడ్గంతో వజీర్ ఖాన్‌ను ఒక్కపోటు పొడిచాడు. భుజంలో నుండి దూసుకుపోయి ఆ ఖడ్గం ప్రక్క ఎముకలను పిండిచేసి వెలుపలకు వచ్చింది. ఖాన్ మరణించగానే, మిగిలిన ముస్లిం సైన్యంలో అల్లకల్లోలం బయలుదేరింది. పారిపోతున్న వారిని హతమారుస్తూ శిక్కువీరులు సర్‌హింద్ వరకు తరుమగొట్టారు.

యుద్ధరంగానికి సర్‌హింద్ పదిమైళ్ళ దూరంలో ఉంది. పట్టణాన్ని పట్టుకోటానికి దాదాపు రెండు రోజుల భీషణ సంగ్రామం చేశారు శిక్కులు. వారిలో దాదాపు అయిదు వందల మంది మరణించారు. నగరం సర్వనాశనం అయింది. పారిపోయినవారు, రహస్యంగా హిందువుల గృహాల్లో దాక్కున్నవారుతప్ప మిగత ముస్లింలందరూ అంతమొందారు. సుచానంద్‌లాగ దేశద్రోహం చేసిన హిందువులు సైతం తమవంతు శిక్షను అందుకున్నారు. ఈ దాడిలో వజీర్‌ఖాన్ సంపద దాదాపు రెండుకోట్లు, సుచానంద్ తదితరుల గృహాల్లో కొన్ని లక్షల ధనం బందా సింహుని వశమయింది.

కొందరు హిందువులు నగరాన్ని సర్వనాశనం చేయక రక్షించాలని బందాను కోరగా, అతడు దాగుకొని యున్న ముస్లింల నుండి పరిహారం స్వీకరించి అంతటితో నగరాన్ని వదలిపెట్టాడు. వారి కోరిక మేరకు శిక్కు సైనికులు నగరం సర్వనాశనం చేయలేదు. కాని ఆ సర్‌హింద్‌పై శిక్కుల ఆగ్రహాన్ని మనం ఈనాటికీ చూస్తుంటాం. శిక్కులెవరైనా ఆ నగరం దాటి ఉత్తరానికో దక్షిణానికో వెడుతున్నప్పుడు ఆ శిథిలా

లలో నుండి ఒకటి రెండు యిటుకలు తీసి సట్లైజ్ నదిలోనో, యమునా నదిలోనో వేయటం యీ నాటికీ కనిపిస్తూ ఉంటుంది. నగరాన్ని నాశనం చేయనప్పటికి, శిక్కులు సమాధులలోని శవాలను తీసిపారవేశారనీ, గర్భవతులైన స్త్రీలను చంపారనీ, పసిపిల్లలను గోడలకుమోది చంపారనీ, మసీదులను మట్టిలో కలిపారనీ చాలమంది విదేశీ ముస్లిము చరిత్రకారులు వ్రాసినది సత్యంకాదు. 1912లో డాక్టర్ నారంగ్ "నగరంలోని సుందరమైన కట్టడాలలో ఒకటైన అహమ్మద్ షా సమాధి యుద్ధానికి పూర్వం ఎలా ఉన్నదో ఇప్పుడూ అలాగే ఉంది" అని వ్రాశారు. ముస్లిం చరిత్రకారులవి అతిశయ కల్పనలనుటకు ఈ ఒక్క నిదర్శనంచాలు.

సర్‌హింద్, దాని పరిసర ప్రాంతాలు మొగలుల బానిసత్వంనుండి విముక్తి చెందాయి. త్వరలోనే వివిధ ప్రాంతాలకు బందా హిందూ పాలకులను నియమించాడు. సర్‌హింద్ పాలకుడుగా బాజ్‌సింహుడు, అతనికి సహాయకుడుగా సాలంది నివాసియైన అలీసింహుడు నియమింపబడ్డారు. ఇదే విధంగా సామనా ఫతేసింహునకు, థానేసర్ రామసింహ, బాబాబినోద్ సింహులకు అప్పగించబడ్డాయి. వివిధపరగణాలకు చెందిన రాజ ప్రతినిధులు బందాసింహుని శక్తి సామర్థ్యాలకు తలలొగ్గారు. ఈ విధంగా కర్నాల్ నుండి లూధియానావరకు విస్తరించి సంవత్సరానికి 30 లక్షలు ఆదాయం కలిగిన సర్‌హింద్ ప్రాంతమంతా శిక్కువీరులహస్తగతమయింది.

బందాసింహుని ప్రభావం కారణంగా ఊహాతీతంగా ఎందరో శిక్కులు మారారు. దగ్గరకు చేరిన ప్రతివారి హృదయాలను ఆకర్షించి అతడు వారిని తనవైపుకు తిప్పుకున్నాడు. పరిచయంలోనికి వచ్చిన ప్రతివ్యక్తి శిక్కు పంథాను పుచ్చుకున్నాడు. సరిహద్దులోని దిన్‌దార్‌ఖాన్ అనే బలవంతుడైన పాలకుడు దిన్‌దార్ సింహుడుగా మారాడు. సర్

హింద్‌లో ప్రభుత్వ విలేఖరి మీర్ నజీరుద్దీన్ మీర్‌నసీర్ సింహుడైనాడు. ఈ విధంగా అసంఖ్యాకులైన ముస్లిములు ఇస్లామును పరిత్యజించి శిక్కు-మతం స్వీకరించి బందాసింహునికి అండదండలుగా ఉంటామని ప్రతిజ్ఞలు చేశారు.

సాథౌరా సమీపంలోని ముఖలిన్‌పూర్ అనే మనోహరమైన పర్వత ప్రదేశం బందాకు కేంద్ర కార్యాలయమైంది. పాడుపడిన ఆ కోటను బాగు చేసి బందాదానికి లోహగఢ్ అని నామకరణం చేశాడు అతడు రాజ్యాధికారం స్వీకరించి గురుగోవిందసింహుని పేర నాణెములు ముద్రించాడు. నాణెములకు రెండువైపులా ఈ విధంగా ముద్రించాడు. "సత్య స్వరూపుడైన భగవంతుని కరుణా కటాక్షముతో ఇది ముద్రింపబడింది. నానక్ ఖడ్గము సర్వవర ప్రసాదిని. విజయము రాజాధిరాజైన గురుగోవింద సింహునిది." ఇదేకాక బందాసింహుడు ప్రభుత్వ పత్రముల అవసరార్థం అధికార ముద్రికను తయారుచేశాడు. తన గురువులపై గల విశ్వాసమును, అమితమైన భక్తి ప్రపత్తులను వెల్లడిచేసే మాటలను ఆ పత్రములలోను, ముద్రికలలోను పొందుపరిచాడు. సర్‌హింద్‌పై విజయం సాధించిన దినం నుండి తన రాజ్యాధికార సూచకంగా నూతన సంవత్సరం ప్రారంభించాడు. ఇవన్నీ బందాసింహుని నిస్వార్థ బుద్ధిని, జాతీయ దృక్పథాన్ని సూచిస్తాయి.

కాని ప్రభుత్వ యంత్రాంగాన్ని సువ్యవస్థితం చేసేందుకు అవసరమైన సమయం అతనికి చిక్కలేదు. అయినా అతడు ప్రవేశపెట్టిన ఒక పద్ధతిమాత్రం ప్రాముఖ్యం వహించి పంజాబు ఆర్థిక వ్యవస్థపై చాలా ప్రభావం చూపించింది. అతడు అప్పట్లో దేశంలోనున్న జమీందారీ పద్ధతిని తొలగించాడు. నాటి జమీందారులలో చాలామంది ప్రభుత్వోద్యోగులు. తమ అధికారంలో ఉన్న గ్రామాలకు సంబంధించిన భూమి శిస్తును, స్థిరమైన మొత్తాలలో ప్రభుత్వానికి వారు చెల్లించేవారు. రానురాను

వీరు తామే ఆ భూములకు సంపూర్ణ అధికారాన్ని స్వీకరించి గర్వోన్మత్తులై నారు. వ్యవసాయదారులను వారి వారి భూములనుండి తమ యిష్టానుసారం తరిమివేసేవారు. ప్రభుత్వంలోని పై అధికారులు కూడా తమకు భూమి శిస్తు సమయానికి అందుతున్నందువలన ఈ వ్యవహారాలలో జోక్యం కలిగించుకునేవారు కాదు. ఇట్టి పరిస్థితులలో రైతులు బానిసత్వంలో మగ్గి పోసాగారు. ఒకసారి సాధౌరా పరిసర ప్రాంతాలలోని రైతులు బందా సింహునివద్దకు వచ్చి తమ కష్టాలను, తనపై భూస్వాములు చేసే అత్యాచా రాలను విన్నవించుకున్నారట. తక్షణమే బందా, అట్లు తనతో విన్నవిం చినవారి నందరినీ కాల్చిచంపవలసిందిగా బాజ్‌సింహుని ఆజ్ఞాపించాడు. తమ విన్నపానికి బందా యిచ్చిన ఈ ప్రతిఫలానికి వారికి చాలా ఆశ్చర్యం వేసి, ఈ ఆజ్ఞ యివ్వటానికి కారణ మేమిటని బందాసింహుని అడిగారు. "మీరు ఈ శిక్షకే అర్హులు. మీరు ఇన్నివేల మంది ఉండి అల్పసంఖ్యాకు లైన జమీందారులవద్ద బానిసత్వం నెరపుతున్నారా? గురువు ప్రసాదించిన ఖల్సా సంప్రదాయాన్ని అనుసరించేవారు తమపై జరిగే అఘాయి యిత్యాలను ప్రతిఘటించి తొలగించుకోలేకపోతే ఎలా?" అని బందా చెప్పాడు. దీంతో రోషం తెచ్చుకున్న ఆ రైతులు జమీందార్లను పదవుల నుండి తొలగించి విజయం సాధించుకున్నారు. మిగతా ప్రాంతాలలోని రైతులుకూడా ఈ పద్ధతిని అవలంబించారు. దీంతో ఆ ప్రాంతంలో భూమిని దున్నేవారే భూస్వాములైనారు. ఏబది సంవత్సరాల తరువాత ఏర్పడిన శిక్కు మిసల్‌దారుల పరిపాలనలోను తర్వాత రంజిత్ సింహుని పరిపాలనలోను యీ జమీందారీ రద్దు అనే సంస్కరణ సంపూర్తిగా కొనసాగింది. ఉత్తర హిందూదేశం ఈనాటికీ జమీందారీలతో సతమతమవు తున్నా, పంజాబునుండి మాత్రం ఆ విధానం తొలగింపబడింది. దానితో చిన్న చిన్న రైతులకు పంజాబ్ స్వర్గధామం అయింది.

సర్‌హింద్ తర్వాత బందా మాలేర్ కోట్లవైపు బయలుదేరాడు. మాలేర్‌కోట్లకు పాలకుడు షేర్ మహమ్మద్‌ఖాన్. ఒకప్పుడు అతడు శిర్సా దాటి గోవిందసింహునిపై చేసిన దాడివల్ల అచట పెద్ద కలవరం చెలరేగింది. అప్పుడు గోవిందసింహుని గృహంలో పనిచేస్తున్న బీబీ అనూప్ కౌర్ అనే శిక్కు యువతి ఖాన్ చేతికి చిక్కింది. తన మానాన్ని, ధర్మాన్నీ కాపాడు కోవటానికి బాకును గుండెలో పొడుచు కొని ఆవిడ ప్రాణత్యాగం చేసింది. శిక్కుల ఆచారం ప్రకారం ఆమె శరీరాని దహనం చేయాల్సినప్పటికి, ముస్లిములు ఆవిడను ఒక గోరీలో పాతిపెట్టారు. ఆ దుఃఖమయగాథ విని బందా చలించిపోయాడు. గోరీలో పాతిపెట్టబడిన ఆ యువతి అవశేషాలను త్రవ్వితీసి సరియైన పద్ధతిలో అంత్య సంస్కారాలు జరుపవలసిందిగా ఆజ్ఞ యిచ్చాడు. సైన్యం మాలేర్‌కోట్లపైకి దాడి జరిపింది. కాని ఈ విషయం ముందే తెలిసి ఆ పట్టణవాసులంతా నివాసాలు వదలి పారిపోయారు. గోవిందసింహుని కుమారులను చంపనని షేర్ మహమ్మద్ ఖాన్ మునుపు చాలా దినాలు వాదించాడు. అందువల్ల ఆ నగరాన్ని నాశనం చేయకూడ దని నిశ్చయించారు శిక్కులు. బీబీ అనూప్ కౌర్ అవశేషాలను మాత్రం వెలికితీసి దహన సంస్కారాలు జరిపించారు. ఈ సంఘటనను చరిత్ర కారులు కొందరు సరిగా అర్థం చేసుకోలేదు. దానిని వారిలో కొందరు వికృతంగా చిత్రించారు.

విజయలక్ష్మి ప్రతి రణరంగంలోనూ శిక్కులను వరిస్తోంది. ముస్లిమేతరులంతా తమలో విశ్వాసం, ఉత్సాహం మళ్ళీ తెచ్చుకుని శిక్కులను తమ ధర్మానికీ, దేశానికి రక్షకులుగా పరిగణించసాగారు, దీంతో శిక్కువీరుల హృదయాలలో నూతనోత్సాహం ఉదయించింది. ఈ పవిత్ర భారతభూమిలో మొగలు రాజ్యాన్ని అంతం చేయాలని వారు సంకల్పించు కున్నారు. పీడిత ప్రజలు ప్రతి దినము తమకు తెల్పుకుంటున్న కష్టాలు వారిలో ఉత్తేజాన్ని కలిగించాయి. దాంతో మొగలు ప్రభుత్వంలో

ఉన్నతోద్యోగులు, జమీందారులు వారి ఆగ్రహానికి గురి అయారు. మొగలులపై ఆక్రమణే తమ ధ్యేయంగా వారు పెట్టుకున్నారు. శత్రువుల యొక్క సాధన సంపత్తులకు హానికలిగించే దోపిడీలు, దొంగచాటు యుద్ధాలు ధర్మవిరుద్ధములు కావని వారు నిశ్చయించుకున్నారు: జీవితంలో తాను ఏ పరిస్థితుల్లో ఉన్నా సరే, తన తోటివారికి తనను పరిపాలకుడుగా, రక్షకుడుగా విధి నిర్ణయించిందని ప్రతి శిక్కు వీరుడు అనుకోసాగాడు.

సర్‌హింద్‌పై విజయం దేశంలోని శిక్కులందరూ మొగలులపై తిరుగబడేటట్లు తోడ్పడింది. బందాసింహుడు తన ఆధ్వర్యంలో నడిపించిన ప్రముఖ సైనిక సంచలనాన్ని ముందుగా పరిశీలిద్దాము. ఆ రోజుల్లో దేవ బంద్ పరగణాలో శిక్కు మతంలోకి కొన్ని మార్పిడులు జరిగాయి. ఉనర్సా గ్రామంలో ఈ విధంగా శిక్కు మతంలోకి మారిన వారిని ఆ ప్రాంత మొగలు ఫౌజ్‌దార్ కారాగృహంలో బంధించి శిక్షించినట్లు బందా సింహునికి తెలియవచ్చింది. వెంటనే బందా సైన్యం యమున దాటింది జలాలాబాద్ మార్గంలో ఉన్న సహరన్‌పూర్‌పై పడ్డారు వారు. ఆ వూరి ఫౌజ్‌దార్ ఆలే హమీద్ ఖాన్ ఢిల్లీకి పారిపోయాడు. కాని తదితర సైనికులు శిక్కులపై బాణవర్షం కురిపించారు. తుపాకీగుళ్ళు గుప్పించారు. ఇవన్నీ లెక్కచేయక ఆ ప్రదేశాన్ని నిర్మూలించారు శిక్కులు. ఆ సైన్యంలో ఒక భాగం సహరన్‌పూర్‌కు ఉత్తరాన పదిహేడు మైళ్ళ దూరంలో ఉన్న చేహాత్‌పై పంపించబడ్డది. అక్కడి షేక్ జాదాలు హిందూ వ్యతిరేక ప్రవర్తనకూ, ముఖ్యంగా గోవధకూ ప్రఖ్యాతి వహించారు. అట్టి చేహాత్ శిక్కుల చేతుల్లో సర్వనాశనం అయింది. షేక్‌జాదాలు వధించబడ్డారు. అక్కడి నుండి మొత్తం సైన్యం దక్షిణాన ముప్పైమైళ్ళ దూరంలో ఉన్న జలాలాబాద్‌ను ముట్టడించడానికి సర్వసన్నద్ధమైంది. అప్పుడు బందాసింహుడు ఉనర్సా నుండి జలాలుద్దీను బంధించి తీసుకొని పోయిన శిక్కులను వదలివేసి ఖాల్సా సంప్రదాయం స్వీకరించవలసిందని



జమీందారీ దురంతాలకు గురైన రైతులకు కర్తవ్యాన్ని సూచిస్తున్న బందాసింహుడు

అతనికి జాబు వ్రాసాడు. జలాలుద్దీన్ పఠాన్ వీరుడు. అతడు బందా ఆజ్ఞానుసారం ప్రవర్తించటానికి నిరాకరించాడు. అంతేకాదు. ఈ వార్త తెచ్చిన శిక్కు దూతలను గాడిదమీద కూర్చోబెట్టి ఊరేగించి తరిమివేశాడు. ఇది శిక్కు సైన్యానికి చాలా ఆగ్రహం కలిగించింది. ఆ ఉద్రేకంతో వారు జలలాబాద్ వేపు హుటాహుటిని కదలి వెళ్ళారు. త్రోవలో అఛేహ్తాపై బడి పెద్ద మొత్తంలో ధనాన్ని దోచుకొని, యుద్ధసామగ్రినభివృద్ధి చేసికొన్నారు. 21–7–1710 న ననౌతా చేరారు. వారిని అక్కడి షేక్ జాదాలు తీవ్రంగా ప్రతిఘటించారు. కాని ఫలితం లేక పోయింది. షేక్ జాదాల వద్ద అష్టకష్టాలుపడ్డ గుజ్జరు హిందువులు శిక్కు పంథాను స్వీకరించి శిక్కులలో కలసిపోయారు. ఆ నగరవీధుల్లో భయంకరమైన యుద్ధం జరిగింది. శిక్కులు ననౌతాను నేలమట్టం చేశారు. షేక్ మహమ్మద్ అఫ్జల్ ఇంటి ఆవరణలోనే మూడు వందలమంది షేక్ జాదాలు చచ్చి పడ్డారు. ఆనాటినుండి ఆ వూరిని ఫూటా నగర్ (విరిగిన నగరం) అని అంటారు. శిక్కులు తర్వాత జలాలాబాద్‌ను ముట్టడించారు. సమీపంలోని రెండు మూడు గ్రామాలు ఆక్రమించుకున్నారు. ఇంతలో విపరీతమైన వర్షం కురిసింది. నదికి వరద వచ్చింది. దీనివల్ల ముట్టడి చేయటం చాలా కష్టమైంది. అంతేగాక, జలంధర్ దో ఆబ్‌లలోని అవసరాలదృష్ట్యా శిక్కు సైన్యం వెళ్ళిపోవాల్సి వచ్చింది. ఆయితే బందాసింహుని ఈ దాడివల్ల ఢిల్లీ కోట గోడల పునాదులు గడగడ వణికాయి. సర్‌హింద్ పైన, గంగానదీ మైదానముపైన జరిగిన శిక్కుల దాడులనుగూర్చిన సమాచారాలు ఢిల్లీ పాదుషాను కలవరపెట్టాయి. అప్పుడతను రాజస్థాన్‌లో ఉన్నాడు. తక్షణమే శిక్కులను నిర్మూలించటానికి సైన్యసమేతుడై ఉత్తరంగా బయలుదేరాడు.

సర్‌హింద్ విజయం తర్వాత అన్ని ప్రదేశములలోని శిక్కులు తాము సంపూర్ణంగా విముక్తిచెందే శుభదినం ఆసన్నమైనదని తలచారు. వెంటనే జలంధర్, దోఆబ్‌లలోని శిక్కులందరూ ఒక్కరుగా నిలబడి

మొగల్ నిరంకుశత్వాన్ని కాలరాచేందుకు విజృంభించారు. చిన్న చిన్న ముస్లిం అధికారులు పదవులనుండి తొలగింపబడి వారిస్థానే దేశీయులు నియమింపబడ్డారు. ప్రజలందరూ కలిసి జలంధర్ ఫౌజ్‌దారయిన షమస్‌ఖానుకు "తక్షణమే పరిపాలనలో కొన్ని సంస్కరణలు ప్రవేశపెట్టి ఖజానా యావత్తూ ఖల్సాలకు అందజేయా"లని జాబు వ్రాశారు. తాను మొదట లొంగి పోతున్నట్లు నటించి, ఆ ఫౌజ్‌దార్ పోరాటానికి సన్నద్ధమైనాడు. ఇస్లాంపేర శిక్కులపై జెహాద్ ప్రకటించవలసిందని అతడు ముస్లింలందరికీ విజ్ఞప్తి చేశాడు. దాంతో దాదాపు ఒకలక్షలమంది ముస్లిం మతోన్మాదులు గుమిగూడి ఆర్భాటంగా సుల్తాన్‌పూర్ నుండి బయలుదేరారు. ఇంత బలగంతోబాటు, షమస్‌ఖాన్ అయిదువేల అశ్వికదళాన్నీ, ముప్ఫైవేల కాల్బలాన్నీ సన్నద్ధపరచాడు శిక్కులకు ఇంత సైనిక సామర్థ్యం లేదు. దాంతో సుల్తాన్‌పూర్‌కు ఏడుమైళ్ళ దూరాన ఉన్న రాహోన్‌కు తరలి వెళ్లారు వారు. అక్కడనుండి గంగా దోఆబ్‌లో నున్న బందాసింహునికి త్వరగా పంజాబుకి రమ్మని కబురంపారు. రాహోన్‌లో శిక్కులు ఎన్నో రోజులు మొగలు ముట్టడిలో కట్టుబడి పోయారు. కాని శత్రు సైన్యము చాల విపరీతంగా ఉందని భావించి, వారు ఒకనాటి చీకటి మాటున తమ స్థలాలనుండి వెలుపలికివచ్చి ముట్టడినుంచి నేర్పుగా తప్పించుకొని పోయారు. పిమ్మట షమస్ ఖాన్ సుల్తాన్‌పూర్‌కు వెడుతూ రాహోన్‌లో కొద్దిగా సైన్యాన్ని మాత్రమే ఉంచాడని తెలుసుకొని శిక్కులు మళ్ళీ రాహోన్ వేపు అతి వేగంగా వెళ్ళి అక్కడి ముస్లిం పటాలాన్ని 12-10-1710 నాడు తరిమి కొట్టారు. జలంధర్, హోషియార్‌పూర్‌లు ఎక్కువ శ్రమ లేకుండానే శిక్కులకు పట్టుబడ్డాయి ఈ విధంగా స్వల్ప కాలంలోనే జలంధర్ దోఆబ్ ప్రాంతం మొత్తం శిక్కుల వశమయింది.

ఈ సమయంలోనే మఝు, రియార్కిలతో నేర్పడిన మధ్య పంజాబు ప్రాంతం మొగలులనుండి విముక్తి చెందింది. ఇక్కడకూడా శిక్కులు

లేవదీసిన విప్లవం విపరీతంగా అతివేగంగా ప్రజా బాహుళ్యానికి ప్రాకి వారికి ఆనందం కలిగించేదిగా జరిగింది. దీనికి తట్టుకొనలేక జెహాద్ పేరిట అన్ని విధాల యుద్ధానికి దిగారు ముస్లిం సర్దారులు. అప్పుడు మఝు, తదితర ప్రాంతాలలోని ఖాల్సా వీరులు దాదాపు ఎనిమిదివేల మంది అమృతసర్‌లో కలిసారు. త్వరలో సంప్రదింపులు ముగించి మధ్య పంజాబు ప్రాంతాన్ని ఒక్కుమ్మడిగా ఆక్రమించుకున్నారు. ముస్లింల శక్తి కేంద్రాలైన లాహోర్, కసూర్ పరగణాలను తాత్కాలికంగా వదలివేసి బటాలా, కలనౌర్‌లపై బడి ఆక్రమించుకొని, మొగలు ప్రభుత్వ అధికారులను తరిమివేసి, తామే స్వంతంగా ఠానాలు, తహశీలులు స్థాపించుకున్నారు. కొందరు శిక్కునాయకులు ఉత్తరంగా వెళ్ళి పఠాన్‌కోట పరగణాను పట్టుకొన్నారు. శిక్కు సైన్యంలో ముఖ్యమైన భాగం లాహోర్ దరిదాపులకు చేరింది. అక్కడి ముస్లిం పాలకుడు, సయ్యద్ అస్లంఖాన్ భయకంపితుడైనాడు కాని నగరంలోని ముల్లాలు నగర నాయకత్వం తమ హస్తగతం చేసుకున్నారు. హైదరీధ్వజం అనే ఆకుపచ్చని జండా నీడల్లో శిక్కులపై జెహాద్ ప్రకటించారు. వాడు మేల్కొల్పిన ఈ మతోన్మాదంతో ముస్లిములలో చాలమంది ధనికులు, వ్యాపారులు, సామాన్యులు తమ సర్వస్వం అమ్మి యుద్ధానికి కావలసిన ధనాన్ని సమకూర్చారు. కొందరు హిందూ అధికారులుకూడా వారితో చేతులు కలిపారు. శిక్కులు అప్పుడు లాహోర్ సమీపంలోని భగవంత్ రాయ్ కోటలో ఉన్నారు. ఆ కోటను ముట్టడించారు ముస్లిములు వీరోచితంగా శిక్కులు చాలాదినాలు ఈ అపార సైన్యాన్ని ఎదుర్కొన్నారు. కాని తమకు కావలసినంత శక్తి లేనందువల్ల ఒకరాత్రి శత్రువ్యూహాన్ని ఛేదించుకొని బైటబడ్డారు. శిక్కువీరులు తమ చేతులనుండి జారిపోయినందుకు ముస్లిములు దుఃఖిస్తూ లాహోర్‌కు తిరిగి వచ్చారు. కాని తమ ఆగ్రహాన్ని అక్కడి హిందువులపై ప్రదర్శించి వారిని అవమానపరచారు. కోట్లాబేగమ్‌వద్ద నున్న శిక్కులను ఓడించటానికి పంపబడ్డ మరో

ముస్లిం పటాలంగూడా వట్టి చేతులతో తిరిగి వచ్చింది. గాజీలు లాహోరుకు తిరిగి వస్తుండగా, భిలోవల్ వద్ద శిక్కులు వారిమీదపడి వారిని చీల్చి చెండాడి, అపారమైన నష్టాన్ని కలిగించారు. ఈ దాడులలో ఇదే అంతిమ యుద్ధం. దీంతో మరు, రియార్కి ప్రదేశమంతా శిక్కుల హస్తగత మయింది.

అప్పటికి లాహోర్‌కు తూర్పున ఉన్న పంజాబు ప్రాంతమంతా శిక్కుల ఆధిపత్యంలోకి వచ్చింది. చరిత్రకారుడైన ఇరాదత్‌ఖాన్ "ఆనాడు వారిపై(శిక్కులపై)దాడిచేసే సాహసం కల ముస్లింసైన్యాధికారి ఒక్కడుకూడా ఢిల్లీలో లే"డని వ్రాసాడు. "నిజానికి 1710 లో బహదూర్‌షా దక్కను వదలి రాకుండా ఉన్నట్లయితే హిందూస్తాన్ మొత్తం శిక్కులు వశపరచు కొని ఉండేవారు" అని మరియొక చరిత్రకారుడు మాల్కం వ్రాసాడు.

పంజాబులోని శిక్కుల దండయాత్రల సమాచారం అందినవెంటనే 27-6-1710 న పాదుషా అజ్మీర్ వదలి ఉత్తరంగా బయలుదేరాడు. ఢిల్లీ, ఔథ్‌ల సుబేదారులను, మొరాదాబాద్ అలహాబాద్‌ల ఫౌజుదార్లను, నజీములను, బర్హాయందలి సయ్యద్‌లను సైన్య సమేతంగా పంజాబువైపు నడచిరమ్మని ఆజ్ఞాపించాడు. శిక్కులంటే ఎంతో భయపడి పోయిన అతడు జుట్టూ, గడ్డమున్న ప్రతివారిని అనుమానించసాగాడు. 8-9-1710 నాడు అతడు ఒక ఆజ్ఞను జారీచేస్తూ ప్రభుత్వ కార్యాలయాల్లో పనిచేసే హిందువులందరూ గడ్డం గీయించుకోవాలని శాసించాడు.బందాసింహుని గూర్చి అతడు వింటున్న కథలు అతనిలో మరింత కలవరం కలిగించాయి. ఆ శిక్కు నాయకుడు మంత్ర తంత్రాలు చాలా తెలిసినవాడనీ, అతని నోటినుండి అగ్నిజ్వాలలు వెలువడతాయనీ, ఏ ఆయుధాలైనా అతణ్ణిగాని, అతడి అనుచరులనుగాని గాయపరచలేవనీ ప్రజలు చెప్పుకునేవారు. అట్టి వార్తలువించే ఎవరికైనా గుండె దిటవు పోతుంది గదా!

బహదూర్ షా బ్రహ్మాండమైన సైన్యంతో శిక్కులపై నడిచాడు. థానేసర్, సర్‌హింద్ వదలి లోహగఢ్ వద్ద స్థావరం ఏర్పరచుకున్నారు శిక్కులు. ముస్లిం సైన్యాలు [illegible] నాటికి ఆ ప్రాంతానికి చేరుకున్నాయి. [illegible] జరిగిన ఆ దాడిలో చనిపోయిన, చనిపోతున్న ముస్లిముల సంఖ్యను చూస్తే ఒక్క క్షణం వారు ఓడిపోయారనే భ్రమ కలిగింది. కాని, [illegible] లోపల కొత్త సైన్యాలు వచ్చి మొగలులతో చేరడంతో, శిక్కులు వెనకకు తగ్గి లోహగఢ్ కోటవేపు వెళ్ళిపోయారు.

60,000 అశ్వికదళం, కాల్బలం బందా సైన్యాన్ని [illegible]. అందులో బుందేల్‌ఖండ్ వంటి ప్రాంతాలకు చెందిన రాజపుత్ర సైనికులు కూడా ఉన్నారు. ఆ లోహగఢ్ కోటను బాగా కట్టుదిట్టం చేయటంవల్ల పాదుషా ధైర్యంతో ముందుకు సాగలేకపోయినాడు. కోటలోపల ఉన్న శిక్కులవద్ద వస్తుసామగ్రి చాలా తక్కువగా ఉంది. ఈ ముట్టడిని ఎక్కువ దినాలు ఎదుర్కొనటం కష్టం అని వారు తెలుసుకున్నారు. నిశ్శబ్దంతో శత్రువ్యూహాన్ని ఛేదించుకొని బైట పడాలనికూడా వారు నిశ్చయించుకున్నారు. ఆ స్థితిలో శిక్కు సైన్యాలకు జీతాలిచ్చే గులాబ్ సింహ్ అనే అధికారి స్వధర్మంకోసం తన ప్రాణాలను సైతం త్యాగం చేస్తానన్నాడు. బందాలాగా దుస్తులు ధరించి అతని ఆసనంలో కూర్చున్నాడు. డిసెంబర్ 1[illegible] ముస్లిం సైన్యాలను ధైర్యంతో చీల్చుకుంటూ వెలుపలికి వచ్చి, సమీప పర్వతాంతర్భాగానికి మాయమయ్యాడు. మరునాటి ఉదయమే కోటను పట్టుకున్నాడు మొగల్ సైన్యాధికారి మునీమ్‌ఖాన్. కాని బందా అక్కడ లేడు. అతని అనుచరుడు మాత్రమే దొరికాడు. పాదుషా దుఃఖానికి అంతులేదు. తక్షణమే హమీద్

ఖాన్ అనే సర్దారును పిలిచి, పర్వతాలలోనికి తప్పించుకొనిపోయిన బందాను అనుసరించి వీలైతే సజీవంగా బంధించి తీసుకొనిరమ్మని, అలా వీలులేక పోతే నహాన్ రాజైన బర్ఫీరాజాను బంధించి తీసుకొని రమ్మని ఆజ్ఞాపించాడు. కాని బందాసింహుడు వారిచేతి కందకుండా తప్పించుకుపోయాడు. అందువల్ల నహాన్ రాజైన రాజా భూపప్రకాష్‌ను, గులాబ్ సింహ్‌ను బోనులో బంధించి హమీద్ ఖాన్ ఢిల్లీకి తీసుకువెళ్ళాడు.

బందా సింహుడు, తదితర శిక్కులు లోహగఢ్ కోటను ఖాళీచేసి ముస్లిం చేతికి అందకుండా పారిపోవటం అపజయంగా భావించనవసరం లేదు. నిజానికి ఇది పాదుషాకే తీరని అపజయం. ఆ శిక్కు నాయకుణ్ణి ఎట్లా అయినా బందించాలని చక్రవర్తియొక్క అఖండ సేనావాహిని చేసిన ప్రయత్నాలు వమ్మయినాయి. పైగా మిక్కిలి బందా ఖడ్గధారియై అరవై వేల సైన్యాన్ని చీల్చి చెండాడుకుంటూ వెళ్ళిపోయాడు. సైన్యం అల్పమవటంతో వారు కోటను ఖాళీ చేయవలసి వచ్చింది. పానిపట్ నుండి లాహోర్ వరకు పంజాబు ప్రాంతాన్ని అతడు ఆక్రమించుకొని ఉండవచ్చు. కాని అది సైనిక విజయమే. అతని వద్దనున్న కొద్దిపాటి సైన్యం అతడు ఆక్రమించిన ప్రదేశాలను సంరక్షించటం కోసం వివిధ ప్రాంతాలలో విభజింపబడి ఉండిపోయింది. ఇదిగాక సర్‌హింద్ ఆక్రమణతో మొదలుకొని లోహగడ్ ఖాళీ చేయటం వరకు ఒక సంవత్సరం లోపునే జరిగాయి. ఇంత తక్కువ సమయంలో ముస్లిముల ముట్టడిని ఎక్కువ కాలం ఎదుర్కొటానికి కావలసిన సాధన సంపత్తిని సమకూర్చుకోవటం అతని శక్తికి మించిన పని. అంతటి విపరీత పరిస్థితులలో కూడ శిక్కులు ముస్లిముల ముట్టడి నుండి తప్పించుకొని బయటపడ్డారు. లోహగఢ్, అందులోని విలువైన శత్రువు చేజిక్కటం బందాకు ఓటమి గాదు. అతనిలోని అజేయమైన ఖాల్సా సేనలతో ఉంది. లోహగఢ్ యుద్ధం [illegible]

తక్షణం శిక్కులందరూ పోరాటానికి తయారు కావాలని అతడు ఆజ్ఞలు జారీ చేశాడు. తమ నాయకుని ఓటమి, పాదుషా విజయం శిక్కు వీరులను నిరుత్సాహ పరచలేదు. అన్ని ప్రదేశాల నుండీ తండోతండాలుగా వచ్చి వారు కిరాత్‌పూర్‌వద్ద అతన్ని కలిశారు. వీరి సహాయంతో గోవింద సింహుని బాధ పెట్టిన కొందరు హిందూ సర్దారులపై దాడి జరిపాడు బందా. అతని దృష్టికి మొట్టమొదట స్ఫురించినవాడు ఖాలూర్ రాజు భీమచంద్. శిక్కులకు లొంగిపొమ్మని అతనికి వర్తమానం అలవాటు ప్రకారం పంపబడ్డది. కాని భీమచంద్ పోరాటానికే సిద్ధమయ్యాడు. దాంతో శిక్కులు అతడి రాజధానియైన బిలాస్‌పూర్‌పై విరుచుకుపడి అతని సైన్యంలో అధికభాగం నాశనం చేశారు. ఇది గమనించి మిగతా రాజులు పోరాటంచేసే ధైర్యంలేక లొంగిపోయారు. మండీరాజు సిద్ధశయన్ గురు నానక్ శిష్యుడుగా తన్నుతాను ప్రకటించుకొని, బందాకు కులూరాజునకు గల భేదాభిప్రాయాలు సరిదిద్దాడు. ఛంబారాజు ఉదయసింహుడు బందాతో చేతులు కలిపాడు. తన వంశంలోని ఒక తరుణిని అతనికిచ్చి వివాహం చేశాడు. ఈ వివాహం వలన బందాకు అజయ్‌సింహ్ అనే కుమారుడు ఉదయించాడు.

కొంతకాలం వరకు ఉత్తరాన ఉన్న పర్వతాల్లో నివాస మేర్పరచుకొన్నాడు బందాసింహుడు. మైదానాల్లోకి అప్పుడప్పుడు తన ప్రభావం ఎక్కువ చేసుకోటానికి వచ్చేవాడు. 4-6-1711న బహ్రాంపూర్‌లను ఆక్రమించుకున్నారు శిక్కులు. కాని తర్వాత కలనౌర్, బటాలాలు వశమయ్యాయి. ఈ ఆక్రమణలన్నీ తాత్కాలికములు. పాదుషా సైన్యాధిపతులు మహమ్మద్ అమీద్‌ఖాన్, రుస్తుమ్ దిల్‌ఖాన్ వెంటనంటడంతో బందా మాటిమాటికీ జమ్మూవైపు తిరోగమించవలసి వచ్చింది. ఈ సమయంలోనే ముస్లిములు చేతులకు చిక్కిన శిక్కులను బాధించారు. ఎవరైనా శిక్కులు బంధింపబడగానే వారిని మొగల్ సైన్యాలకు వేతనాలకు బదులుగా యిచ్చే

వారు. వారు లాహోర్‌లోని గుర్రాల బజారులో వారిని అమ్మేవారు. పంజాబు, మధ్యప్రాంతములోని శిక్కులను, వారిని ప్రోత్సహ పరచే వారిని కూడా చాలా అవమానించి బాధలు పెట్టేవారు. కనపడిన శిక్కులందరినీ చంపివేయమని ప్రభుత్వాధికారులందరికీ పాదుషా ఆజ్ఞ యిచ్చాడు. దీని ఫలితంగా శిక్కులు, వారి మీద కనికరం కలవారు నిర్దాక్షిణ్యంగా నరికి వేయబడ్డారు. శిక్కులతోబాటు సామాన్య హిందువులు కూడా ఈ హింసా కాండకు గురికాకుండా వారందరూ గడ్డాలు గీయించుకొని శిక్కులకన్న భిన్నంగా కనపడాలని పాదుషా ఫర్మానా జారీచేశాడు.

బహదూర్ షా 12-2-1712న ఆఖరుసారిగా దర్బారుకు వచ్చాడు తరువాత వారం తిరుగకుండానే 18-2-712న మరణించాడు. అతని కొడుకు శక్తి విహీనుడైన జహందర్ షా అనేవాడు తరువాత రాజ్యాని కొచ్చాడు. కాని 1712 ప్రారంభంలో అతన్ని ఫరూక్షియర్ అనేవాడు పదవీచ్యుతుణ్ణి చేశారు. రాజవంశం అంతఃకలహాల్లో మునిగి ఉన్న ఈ సమయం బందాకు తిరిగి శక్తిని పుంజుకొని కోల్పోయిన ప్రదేశాలను తిరిగి పట్టుకొనేందుకు మంచి అవకాశాన్నిచ్చింది. ఉల్కలాగా అతడు శర వేగంతో బయలుదేరి సాధౌరాను జయించాడు. లోహగఢ్ మరల అతని రాజధానియై శిక్కులకు శక్తి కేంద్రమయింది.

ఫరూక్షియర్ లాహోర్ పాలకుడుగా అబ్దున్ సమద్ ఖాన్‌ను, జమ్మూకు ఫౌజుదారుగా అతని కుమారుడు జకరయా ఖాన్‌ను నియమించి అన్ని స్థానాల నుండి బందాసింహుని తొలగించవలసిందిగా ఆజ్ఞాపించాడు. 1713 అక్టోబరులో శిక్కులు సాధౌరా, లోహగఢ్‌లను ఖాళీ చేయవలసి వచ్చింది. తిరిగి బందా జమ్మూ పర్వతాల్లో తలదాచుకున్నాడు. అక్కడే రెండోమారు వివాహం చేసుకొని "దేరాబాబా బందాసింహ్" అనే పేరుతో ఒక స్థావరం ఏర్పరచుకొన్నాడు. మొదట సాధించిన ఈ విజయాలకు

మురిసి అబ్దుస్ సమద్ ఖాన్‌ను, అతని కుమారుణ్ణిపాదుషా సత్కరించాడు. శిక్కులను అన్ని ప్రాంతాలలోను ముఖ్యంగా గురుదాస్‌పూర్ ప్రాంతంలోని పఠానులు పదేపదే తరుమసాగారు. 1715 ప్రారంభంలో తిరిగి బందా సింహుడు మైదానాల్లో ప్రవేశించాడు. కలనౌర్, బటాలాలను భీషణ సంగ్రామం చేసి స్వాధీనపరచుకొని వానికి పాలకులుగా శిక్కు అధికారులను నియమించాడు. దీంతో ఫరూక్షియర్ మండిపడ్డాడు: అబ్దుస్ సమద్ ఖాన్ యొక్క అలసత్వాన్ని అసహ్యించుకున్నాడు. లాహోర్‌లో సైన్యాలను పటిష్ఠం చేయటానికి మొఘల్ హిందూ సర్దారులను చాల మందిని సైన్యాలతో వెళ్ళవలసిందిగా ఆజ్ఞాపించాడు. కాంగ్రా పాలకుడైన కాటొచ్ రాజా, జసోతారాజు ధ్రువదేవుని కుమారుడు హరదేవుడు లాహోర్ సైన్యాలకు అండగా నిలిచారు. సురక్షితమైన స్థానంలో స్థిరపడి పోక ముందే బందాపై సమదఖాన్ బలాలు పడ్డాయి. కానీ తనస్థానాలుచక్కగా రక్షించుకుంటూ మొదట జరిగిన పోరులో బందా అత్యుత్తమ పరాక్రమం ప్రదర్శించి పాదుషా సైన్యాలు ఓడిపోతాయేమోననే భ్రమ కలుగజేసాడు. కాని బలమైన స్థావరాలు లేకపోవటంవల్ల బందాయే వెనుకకు తగ్గవలసి వచ్చింది. శత్రు సైన్యాలను హడలగొడుతూ, గురుదాస్‌పూర్‌కు నాలుగు మైళ్ళు పశ్చిమాన ఉన్న గురుదాస్ నంగల్ గ్రామానికి వచ్చాడు బందా. భాయీ దునీచంద్ ప్రాంగణంలో తన సైన్యాలను నిలిపి చుట్టూ వీలైనంత మంచి రక్షణ కట్టుదిట్టాలు ఏర్పాటు చేసుకున్నాడు. చుట్టు కందకం త్రవ్వి అందులోకే గ్రామం ప్రక్కనే ప్రవహిస్తున్న కాలువనీరు మళ్ళించాడు. శత్రువులు దగ్గరకు రాకుండా బురదనేలను తయారు చేసాడు. ఈవిధంగా రక్షణ ఏర్పాటు చేసుకొని శిక్కులు అక్కడే ఉండి ముట్టడి నెదుర్కొన సాగారు. ముస్లిం సైన్యాలు అతి సమీపములో ఉండి చుట్టుముట్టినందు వలన ఒక గడ్డిపోచగానీ, ఒక ధాన్యపు గింజగానీ లోపలికి ప్రవేశించే అవకాశమే లేకపోయింది. ఈ పోరాటాన్ని కన్నులారా తిలకించిన మీర్జా

మహమ్మద్ ఖాసిం తన "ఇబ్రత్‌నామా" అనే పుస్తకంలో ఈ విధంగా వ్రాసాడు. "వీరోచితములు అలౌకికములు అయిన శిక్కుల సాహస కార్యాలు చాలా విస్మయాన్ని కలుగజేసాయి. ప్రతి దినం రెండు మూడు పర్యాయాలు 40,50 మంది ఒక్కసారిగా వెలుపలికి వచ్చి తమ పశువు లకు కావలసిన గడ్డి కోసుకునేవారు ముస్లిం సైనికులు ఎవరైనా అడ్డ గించటానికి వస్తే వారిపై బాణాలు, తుపాకీ గుళ్ళు, చిన్న చిన్న ఖడ్గాలు ప్రయోగించి చంపేసేవారు. తర్వాత తాము ప్రోగుచేసుకున్న గడ్డితో మాయమయేవారు. శిక్కులన్నా, వారి నాయకుని మంత్రతంత్రాలన్నా ముస్లిములు హడలిపోసాగారు. పాదుషా సైన్యాధికారులు భగవంతుడిని తలుచుకొని, బందాసింహుడు ఏదో విధంగా తమను మోసగించి పారిపో యేలా అనుగ్రహించమని ప్రార్థించేవారు."

తమకు తాముగా బందాసింహునికి పారిపోయే అవకాశం యిస్తే, ఆ విషయం పాదుషాకు తెలుస్తుంది. తమ ప్రాణాలు పోతాయి. బందా సింహుడు పారిపోకుండా ముట్టడిని కట్టుదిట్టంగా కొనసాగిస్తే, రోజురోజుకూ శిక్కులనుండి ప్రమాదం పెరిగిపోతోంది. కాబట్టి తమ ప్రమేయంలేకుండా తమను మోసగించి బందా ఎటైనా పారిపోతే బాగుండునని మొగలు అధి కారులు, సైనికులు భావించేవారు. అటువంటి విచిత్ర పరిస్థితులలో బందా సింహుని స్థావరాలను ముట్టడించే, లోపలనున్న శిక్కులు ఆకలితో మాడేలా చేయటం తప్ప వేరేమీ చేయలేకపోయాయి మొగలాయిసైన్యాలు. త్వరలోనే తనవద్దనున్న ఆహారపదార్థాలు అయిపోవటంతో శిక్కుసైన్యాలు ఆకలివల్ల బాధపడసాగాయి. అప్పుడు బందాసింహునకు, బినోదసింహునకు భవిష్యత్తును గూర్చిన ప్రణాళికరచన విషయమై భేదాభిప్రాయాలు రావ టంతో పరిస్థితులు విషమించాయి. శత్రువ్యూహాన్ని ఛేదించుకొని బయట పడాలని బినోదసింహుడు వాదించాడు. బందా దానికి అంగీకరించలేదు. ఉన్నచోట అలాగే ఉండిపోవాలన్నాడు. వారిమధ్య వాదన తీవ్రరూపం

దాల్చింది. ఇద్దరూ కయ్యానికి దిగబోతుండగా, బినోదసింహుని కుమారు డైన కహన్ సింహుడు మధ్యవర్తిత్వం వహించి, తన తండ్రికి బందాకు ఘర్షణ జరుగకుండా అడ్డుపడ్డాడు. వారిద్దరిలోను ఒకరు ఆ ప్రదేశం విడిచి వెళ్లాలని అతడు ప్రతిపాదించగా, బినోదసింహు డందు కంగీకరించి, స్థావరాన్ని వదలి శత్రుసైన్యాలను చీల్చుకుంటూ వెళ్ళిపోయాడు. దాంతో వారిరువురి మధ్య రేగిన ఘర్షణ సమసిపోయిందిగాని పరిస్థితి మాత్రం యింతకు మునుపటివలెనే ఉండిపోయింది. ధాన్యం లేకపోవటంతో బందా సైనికులుగుర్రాలను గాడిదలను ఇతర పశువులను చంపి ఆ మాంసం తినటం ప్రారంభించారు. మాంసం వండటానికి వంటచెఱకు లేకపోవటంతో చివరకు పచ్చి మాంసాన్నే తినసాగారు. వారిలో చాలామంది రక్త విరేచనాలతోనూ, ఆకలితోనూ చనిపోయారు. చివరకు వారు గడ్డి, ఆకులు, చెట్ల వేర్లుతింటూ, ఎంతో దయనీయమైన పరిస్థితి ననుభవిస్తూ, చాలా పెద్దదైన మొగలు సైన్యాన్ని ఎదుర్కొని యుద్ధం చేస్తూ ఎనిమిది నెలలు గడిపారు. కాని ఎంత కాలమని అలా గడపగలరు! చివరకు వారిలో దాదాపు ఎనిమిది వేల మంది మరణించారు. మిగిలినవారుకూడ అస్థిపంజరాలై పోయారు. ఇట్టి పరిస్థితుల్లో శత్రువు నెదిరించటం వారి శక్తికి మించిన పని. ఆ అదను కనిపెట్టిన మొగలాయి సైన్యాలు 7-12-1715 న శిక్కుల స్థావరాన్ని ప్రవేశించి, బందాను అతని అనుచరులను బందీలుగా చేసారు. వారిలో రెండు మూడు వందల మందిని కాళ్ళు చేతులు బంధించి చిత్రవధ చేశారు. శిక్కు సైనికులు బంగారునాణాలు మింగారనే నెపంతో కొందరి శరీరాలు చీల్చారు. కొందరి తలలను గడ్డిలోచుట్టి శూలాలకుగుచ్చారు.

పిమ్మట గురుదాస్ నంగల్ నుండి బందాను, అతని అనుచరులను, అబ్దుల్ సమద్ ఖాన్ లాహోర్ కు తీసుకువెళ్ళాడు. లాహోర్ వీధుల్లో అతనిని అత్యంత అవమానకరంగా ఊరేగించి అటుపిమ్మట ఢిల్లీకి పంపాడు. బందాసింహుడు ఖైదీయై ముస్లిం సైన్యాల అధీనంలో ఉన్నప్పటికి, అతని

మంత్రశక్తులంటే మొగలాయి లందరికీ చాలా భయం ఉండేది. అతడు గాలిలో ఎగిరిపోతాడేమోననే భయంతో, అతని శరీరంలో నాలుగుచోట్ల యినుపగొలుసులతో బంధించి, ఒక బోనులో ఉంచారు అతను తప్పించుకు పోవటానికి ప్రయత్నించేస్తే పొడిచి చంపవలసిందిగా ఆజ్ఞయిచ్చి, వేరొక మొగలు అధికారినిగూడా బందాతో కలిసకట్టివేసి ఆ బోనును ఒక ఏనుగు మీద ఎక్కించారు. బందా అనుచరులలో దాదాపు రెండు వందల మంది యినుప గొలుసులతో బంధింపబడ్డారు. ఈ బందీలను ఢిల్లీ చేర్చేందుకు నియమింపబడిన జకీరయాఖాన్, ఇంత తక్కువ సంఖ్యలో శత్రువులను పాదుషాకు అప్పగించటం బాగుండదని భావించి యుండవచ్చు. అందు వలన మార్గమధ్యంలో గ్రామాలలో దొరికినవారి నందరిని బంధించాడు. ఈ విధంగా బందీలైనవారి సంఖ్య 740. శూలాల మీద నిలబెట్టబడినవారి సంఖ్య రెండువేల వరకు పెరిగింది. అంతేగాక దాదాపు ఏడువందల బండ్లు శిక్కుల శిరస్సులను నింపుకొని వారి వెనుకగా నడిచాయి.

ఢిల్లీకి మెల్లమెల్లగా సాగింది శిక్కుఖైదీల సమూహం. 29-2-1716న వారంతా అఘూరాబాద్ చేరుకున్నారు. అక్కడకూడా బందా, అతని అను చరులు నగర ముఖ్యవీధులలో ఊరేగింపుగా నడిపింపబడ్డారు. దాని తరువాత జరిగిన తతంగం శివాజీ కుమారుడైన శంభాజీకి జరిగినటువం టిదే. ఆ ఊరేగింపులో మొట్టమొదట రెండువేల వెదురుగడలపై శిక్కుల శిరస్సులుంచబడ్డాయి. గాలికి ఆ తలలకున్న కేశాలు నాట్యాలు చేస్తు న్నాయి. వీరితో పాటు ఎత్తైన కఱ్ఱకు ఒక పిల్లిని గ్రుచ్చారు. గురుదాస్ నంగల్‌లో కంటికి కనబడిన ప్రతి ప్రాణినీ, ఆఖరికి పిల్లులను సైతం, తాము నిర్మూలించామనటానికి నిదర్శనంగా దానిని ప్రదర్శించారు. ఆ ఊరేగింపులో తరువాత నున్నవాడు అభాగ్యుడైన బందా. ఏనుగుపై నున్న ఒక బోనులో ఉన్నాడతను. ఎగతాళిగా, అతన్ని వింత దుస్తులతో అలంకరించారు ముస్లిములు. బంగారు జరీకల ఎర్రని తలపాగ చుట్టారు.

ఎర్రటి జరీ అంచుతో బంగారపు పూవులుగల కంచుకాన్ని తొడిగారు. అతని వెనుకనే మహమ్మద్ హమీద్‌ఖాను అనుచరుడొకడు కవచం ధరించి, కత్తి చేతబట్టి నిలబడ్డాడు. తరువాత ఆ ఏనుగు వెనకనే వస్తున్నారు మిగిలిన శిక్కు ఖైదీలు. వారిలో యిద్దరిద్దరిని ఒకటిగా కట్టి, వారిని జీనులులేని ఒంటెలమీద కూచోబెట్టారు. వారి తలలపై గొర్రె బొచ్చుతో తయారై, గాజు పెంకులతో అలంకరింపబడ్డ వికృతమైన టోపీలను పలు ఆకారాలలో ఉంచారు.

అఘూరాబాద్ నుండి ఢిల్లీలోని లాహోరు ద్వారం దాకా వున్న మార్గం రెండువైపుల మెగలు సైనికులతోను ఖైదీలను చూచి సంతోషంతో కేకలు వేస్తూ, హాస్యాస్పదమైన శిక్కుల వేషాలను చూచి వెక్కిరించే జన సమూహంతోను క్రిక్కిరిసిపోయింది. ఇదంతా కనులారా వీక్షించినఖాసిం, తన "ఇబ్రత్ నామా"లో ఈ విధంగా వర్ణించాడు. "బజారులోని చిన్న చిన్న వీధుల్లోకూడ, ఆనాడు క్రిక్కిరుసినంత జనసమూహాన్ని మరెన్నడు గాని చూడటం అరుదు. ఆ దృశ్యం చూచి మహమ్మదీయులు సంతోషంతో ఉక్కిరి బిక్కిరై పోయారు. కాని అట్టి నీచస్థితిలో పడిపోయినా దురదృష్ట వంతులైన శిక్కులుమాత్రం చాలా సంతృప్తులైనట్లగుపడ్డారు. వారి ముఖాలపై విచారంగాని, అవమానంగాని యిసుమంతైనా లేదు. నిజానికి చాలామంది, తమ ఒంటెలపై కూర్చుని. హాయిగా, హుషారుగా ధార్మిక గీతాలను పాడుకుంటున్నారు. గుంపులోనుండి ఎవరైనా తురకలు 'మీరు చేసిన దుర్మార్గాలే మీ యీ స్థితికి కారణం' అంటే తక్షణమే వారు 'భగవంతుడు మమ్మల్ని కష్టాలనుభవించమన్నాడు. అతని కోరిక ప్రకారమే మాకు బందిఖానా, దురదృష్టం కలిగా'యని జవాబిచ్చేవారు. ఇంకెవరన్నా, వారితో 'ఇప్పుడు మిమ్మల్ని చంపివేస్తా'రని అంటే "చంపనివ్వండి. అయినా మరణానికి మేము భయపడేనదెప్పుడు? మేము పిరికి వాళ్ళమే అయితే మేతో యిన్ని యుద్ధాలు ఎలా చేస్తా మనుకున్నారు? కేవలం ఆకలి

వలన, లేమివలన మీచేత చిక్కాంగాని, లేకుంటే మేమెంతటి సాహస కృత్యాలు చేయగలమో మీకుబాగా తెలుసు" అని చెప్పేవారు.

ఆ ఊరేగింపు రాజధానిలోని పాదుషా కోట సమీపానికి చేరింది. బందాను, బాజ్ సింహుని, భాయి ఫతేసింహుని తదితర నాయకులను త్రిపోలియాలో బంధించమని ఇబ్రహీ ముద్దీన్ ఖానుకు ఆజ్ఞ జారీచేయ బడింది. బందా సింహుని భార్యను, అతని ఐదేండ్ల కుమారుడు అజయ సింహుని, వాని దాదిని అంతఃపురంలో చేర్చారు. మరణబండన విధించి, మిగిలిన శిక్కులను కొత్వాల్ సర్బ్రా ఖానుకు అప్పగించటం జరిగింది.

౬-3-1716న చబుత్రా కొత్వాలికి ఎదురుగా ప్రస్తుతం హార్డింజి గ్రంథాలయాన్ని ఆనుకుని ఉన్న ప్రదేశంలో శిక్కులను చంపటం ప్రారంభమయింది. అక్కడే ప్రతిదినం వందమంది శిక్కులను చంపేసే వారు. వారిలో ఎవరైనా ఇస్లామును స్వీకరిస్తే వదలిపెట్టాలని నిర్ణయించు కున్నారు. కాని చివరి శిక్కు బలి అయ్యేదాకా అక్కడున్న ఏ ఒక్కరూ యిస్లాములోనికి మారలేదు. నూతనంగా వివాహమైన నవయువకు డొకడు అందులో ఉన్నాడు. భర్తృవిహీనయైన అతని తల్లి పాదుషా దగ్గరకు వెళ్ళి, తన కుమారుడు శిక్కు కాదనీ, బందా సైనికుల చేతిలో బందీగా వున్నాడని చెప్పుకుంది. పాదుషా ఆవిడపై కరుణ వహించి, ఆ యువకుని వదలివేయమని ఆజ్ఞ యిచ్చాడు. తల్లి పాదుషా ఆజ్ఞా పత్రాన్ని కొత్వాలు వద్దకు తీసుకొని వచ్చింది. కొత్వాలు ఆ యువకుడితో "నీవు విముక్తి చెందావు వెళ్ళు" అన్నాడు. కాని విడుదల కావటానికాయువకుడేమాత్రము అంగీకంచలేదు. "నా తల్లి అసత్యమాడుతోంది. నేను మనసా, వాచా, కర్మణా శిక్కును. నా గురువును భక్తితో అనుసరించే వ్యక్తిని. నన్ను త్వరగా నా స్నేహితులతోబాటు పంపించండి" అంటూ వధ్య స్థలానికి

పరుగు పరుగున వెళ్ళాడతడు. అక్కడే అతని శిరశ్ఛేదనం జరిగింది. ఈ సంఘటనను గురించి ప్రఖ్యాత బ్రిటిష్ చరిత్రకారుడు "ఇర్విన్"- "ఈ మారణహోమం తిలకించిన భారతీయులకును, యూరోపియనులకును తమకు విధి విధించిన ఈ శిక్షలకు లోనవుతున్నప్పుడు ఆ శిక్కు వీరుల ఓరిమి, పట్టుదల, ధైర్యములు అమిత ఆశ్చర్యం కలిగించాయి" అని తన చరిత్ర గ్రంథంలో వ్రాసాడు. అంతేకాక తమ నాయకునిపైన తమ మత ముపైన వారికి గల భక్తి ప్రేమలు అపూర్వములై ప్రశంసాపాత్రములై ఉన్నాయి. వారికి మరణమన్న భయమేలేదు. తమను ఉరితీసే వ్యక్తిని వారు 'ముక్త్" అని సంభోధించేవారు: 'ముక్త్' అంటే భవబంధాల నుండి విడిపించేవాడని అర్థం. వధ్యశిలను చేరేటప్పుడు కూడా వారు సంతోషం పట్టలేక, గట్టిగా "ఓ ముక్త్! నన్ను ముందు ఉరితియ్య"మని కేకలు పెట్టేవారు. ఈ విధంగా చనిపోవడంలో గూడా ప్రథమస్థానం అలంకరించాలని వారిలో వారు పోటీపడేవారు. ఈ మారణకాండ ఒక వారం పదిరోజులదాకా నడిచింది. బందీలందరూ చంపబడ్డారు. ఏరోజు కారోజు రాత్రివేళలందు వారి కళేబరాలను బళ్ళలో తరలించి నగరం వెలుపలనున్న చెట్లకు వ్రేలాడదీసేవారు.

ఈ హత్యాకాండ ముగిసిన తర్వాత దాదాపు మూడు మాసాలు శాంతియుతంగా ఉంది. ఈ సమయంలో బందాను అతని వద్ద గల పెద్ద అధికారులను చంపకుండా ఉంచారు. బందా, అతని అనుచరులు దాచిన నిధులను గూర్చిన సమాచారం ఎట్లాగైనా తెలుసుకుందామని వారు ప్రయత్నించారు.

బందా మృత్యు ముఖంలో ప్రవేశించాల్సిన దినం రానే వచ్చింది. 9-6-1716నాడు బందాను, అతని అనుచరులను యిరవై యారు మందినీ ఢిల్లీ వీధులలో ఊరేగింపుగా కుతుబ్ మినార్ వద్ద గల క్వాజా కుతుబుద్దీన్ భక్త్యార్ కాకే పవిత్ర స్థలానికి తీసుకు వెళ్ళారు. అక్కడ పాదుషా బహ

దూర్‌షా సమాధి చుట్టూ త్రిప్పారు. అప్పుడు చక్రవర్తి ఫరూక్షియర్ ఆజ్ఞానుసారం మహమ్మద్ హమీద్ ఖాన్ బందాను ఇస్లాం మతం స్వీకరించమనీ అలా చేయకపోతే చంపేస్తామనీ బెదిరించారు. బందా ముస్లిం అవటానికి తిరస్కరిస్తూ "నన్ను చంపటానికి మీరెవరు ? అయినా మీరు చంపుతున్నదెవరిని ? ఆత్మ శాశ్వతమైనది. అందువల్ల మీరు నన్ను చంపలేరు. నా భౌతికదేహాన్ని హింసించ కలరేమోకాని నన్ను కాదు" అని సమాధానం చెప్పాడు. పాదుషా తదితర ముస్లిం అధికారులు కూడా శిక్కులు ఎంత విశ్వాసంతో ధైర్యంతో మరణాన్ని ఆహ్వానిస్తారో ప్రత్యక్షంగా చూచే ఉన్నారు కాబట్టి బందా ప్రవర్తన ఇంకోరకంగా ఉంటుందని వారు ఆశించలేదు. అయినా మరో విపరీతపరీక్ష పెట్టాలనుకున్నారు. అతని ఐదేండ్ల కుమారుణ్ణి తీసుకువచ్చి అతని ఒళ్ళో కూర్చోబెట్టారు. తర్వాత ఆత్మ శాశ్వతమైతే ఈ బాలుడిని పొడిచి చంపమని బందాతో చెప్పారు. అతడు నిశ్చలంగా ఉండి ఆ పని చేయటానికి నిరాకరిస్తూ "ఈ అమాయక బాలుడిని చంపటానికి నేనెవరిని ? నా మరణాన్ని గురించేకాని, మరే యితర మరణాన్ని గురించి కాని చివరకు నా కుమారుని గురించి కాని నాకు భయం లేదు. అలాగని యీ బాలుడిని చంపవలసిన అవసరం లేదు. అలా చెయ్యటం భగవంతుని ఇచ్ఛకు వ్యతిరేకం. ఐతే యింతవరకు అన్యాయాన్ని ప్రతిఘటించటంలో నేను చేసినదంతా భగవంతుని ఆజ్ఞ ప్రకారమే" అన్నాడు. ఉరితీసే వ్యక్తి ఆ బాలుడిని వెంటనే ముక్కలు చెక్కలుగా నరికాడు. అతడి హృదయాన్ని వెలికితీసి బందా నోట్లో కూరాడు. అయినా విగ్రహంవలె నిశ్చలంగా నిలిచిపోయాడు బందా. అతడు సర్వం భగవంతునికి వదలివేశాడు. ప్రక్కనే నిలబడి ఇదంతా చూస్తున్న మహమ్మద్ అమీన్‌ఖాన్ ఉదాత్తుడైన ఆ మహనీయుని ఓరిమిని ప్రశంసించాడు. "ఉన్నతమైన వ్యక్తిత్వము, ఉదాత్తమైన మనస్తత్వము గల ఇట్టి వ్యక్తియే ప్రపంచాన్నింత కష్టాలలో ముంచటం అనూహ్యము"

అని అతనితో అన్నాడు. ''మానవులలో హద్దులను మీరిన దుర్నీతి పెరిగి నప్పుడల్లా వారిని దండించటానికి నా వంటి సాధనాలు భగవంతుడు కల్గింపజేస్తాడు. అంతా భగవదేచ్ఛ కాబట్టి నాకాబాధేలేదు.'' అన్నాడు బందా.

అతన్ని వధించినతీరు వర్ణనాతీతం. మొదట ఎడమ కన్ను ఊడ బెరికారు. తరువాత కుడి కన్ను, ఆ తర్వాత చేతులు, కాళ్ల తెగనరికారు. శరీరంలో మాంసాన్ని కణకణలాడే శ్రావణాలతో గుచ్చి తీసారు. ఆఖరు నకు తలను చెండివేశారు. ఆఖరు నిముషం వరకు ఓర్పుతో, శాంతితో అన్ని కిరాతకాలనూ సహించాడు బందా. "ఆ కాలంలో జరుగుతున్న అన్యాయాలనూ ఆక్రమాలనూ అరికట్టడానికి భగవంతునిచే పంపబడ్డ ఆ సాధనానికి అట్టి సహనం, ఓర్పు గర్వకారణం" అని ఎల్ఫిన్స్టన్ అనే చరిత్రకారుడు వ్రాసాడు. తర్వాత ఢిల్లీలోని కొందరు శిక్కు వ్యాపారస్తులు పాదుషా అనుజ్ఞను పొంది బందాసింహుని శరీర అవశేషాలను తీసుకొని బారాపులావద్ద అంత్యక్రియలు చేశారు. మిగిలిన ఖైదీలను మొగలులు మరుసటిరోజు వధించారు.

ఆనాటి పర్షియన్ చరిత్రకారులచే అత్యధికంగా ద్వేషింపబడినవాడు బందాయేనేమో! ఇతనికంటె చాలా పూర్వమే శిక్కు గురువులు మొగలుల మీద విప్లవాన్ని ప్రారంభించి ఉండవచ్చు. కాని శిక్కులను చక్కగా సంఘటితపరచి, తద్వారా ఏర్పడిన శక్తిని రాజకీయ అవసరాల కోసం, మొగలు సామ్రాజ్యాన్ని కూలద్రోయటానికి ఉపయోగించి, తన ప్రదేశా లకు స్వాతంత్ర్య జీవనముయొక్క రుచిని ముందుగా చూపించినవాడు బందా. ఎవరి చేతుల నుండి రాజ్యాన్ని వశపరచుకోటానికి బందా ప్రయ త్నించాడో, ఆ శత్రువులు అతనిపట్ల నిష్పక్షపాతంగా వ్యవహరించారని చెప్పలేము. "వారిలో కొందరు అధికార విలేఖరులు, మరికొందరు మొగల్ చక్రవర్తుల ఆదరణలో ఉన్నవారు. అందుకని వారి వ్రాతలపై విశ్వాస

ముంచటం కష్టం. రక్తపిపాస గల క్రూరునిగా ముస్లిం చరిత్రకారులు అతనిని వర్ణించారు. ఒకవేళ బందాసింహుడే మహమ్మదీయుల పక్షం వహించి, వారి దృష్టిలో నాస్తికులయిన వారిని, కాఫిరులైనవారిని, బాధ పెట్టి ఉంటే, అతనిని పొగడటానికి వారేమాత్రం వెనుకాడేవారు కారు" అని థారన్‌టన్ అనే తరువాతి కాలపు చరిత్రకారుడు వ్రాశాడు.

చారిత్రకమైన దృష్టితో పరిశీలిస్తే ఆతడంత నిర్దయుడుగా కన బడడు. శత్రువులతో కూడా అతడు చాలా ఉదాత్తుడుగా ప్రవర్తించాడు. తన తర్వాత రాజకీయ వారసునిగా బందా సింహుని ఎన్నుకోటంలోనే గురుగోవిందుని చాతుర్యము తెలుస్తుంది. ఖాల్సాగా గురువువద్ద ప్రతిజ్ఞ స్వీకరించిన నాటినుండీ శరీరం ముక్కలు ముక్కలై చనిపోయినదాకా గురువు ఆశయాలలో బందా తీవ్రమైన నిష్ఠ, విశ్వాసము కలిగి ఉన్నాడు. తాను తయారు చేసిన ముద్రికలపై, నాణెములపై అధికారానికి మూలాధా రులు గురునానక్, గురుగోవింద సింహులని అతడు ముద్రించాడు శిక్కు పంథాలో ఆచరించవలసిన విధులన్నీ సక్రమంగా నిర్వర్తించాడు. ఎన్నడూ కేశాలను సంస్కరించుకోలేదు. పరస్త్రీని కన్నెత్తి చూడలేదు. యుద్ధం, ఎదురులేని తన అధికార స్థితి, తన శత్రువులు కలిగించిన ఉద్రేకం— వీటన్నిటివలన కలిగే ఆకర్షణలకూ, లోభాలకూ లోను కాకుండా అతను పవిత్ర శీలాన్ని నిలబెట్టుకొన్నాడు.

తన మతాన్ని ప్రచారం చేయటంలో అతడు ప్రదర్శించిన ఉత్సుకత రణరంగంతో అతని రణకౌశలం పరస్పరం పోటీ పడ్డాయి. పలువురు ముస్లిములను అతడు శిక్కులుగా మార్చాడు. కాని ఎవరినీ అత్యాచారాలకు గురిచేసినట్లు చరిత్రలో ఆధారాలు లేవు. కొందరు వ్యక్తులు విజయశీలి యైన ఆ వీరుడిని సంతృప్తి పరచాలనే కోరికతోనో, లేక తమ్ము తాము రక్షించుకోవాలనే ఉత్సుకతోనో శిక్కు పంథాని స్వీకరించి ఉండవచ్చు.

అంతమాత్రాన బందాసింహుడు వారిని భరింపరాని కష్టాలకు గురిచేసి మతం మార్చాడనటం అసత్యం. ఏప్రిలు 1711లో ఒక అధికార వార్తా విలేఖరి పాదుషా అయిన బహదూర్ షాకు ఒక నివేదిక పంపించాడు. కలనౌర్‌లో విడిసినప్పుడు బందాసింహుడు అక్కడి ముస్లిముల వ్యవహారాల్లో జోక్యం కలుగజేసుకోననీ, ఎవరైనా తన సైన్యంలో చేరితే సరియైన జీతబత్తములు ఏర్పాటు చేస్తాననీ, వారికి మత విషయంలో–నమాజ్ చేసుకోవడంతో సహా సంపూర్ణ స్వాతంత్ర్యం ఉంటుందనీ హామీ ఇచ్చినట్లు ఆ నివేదికలో పేర్కొన్నాడు. దాని ఫలితంగా దాదాపు ఐదువేల మంది ముస్లిములు బందా సైన్యంలో చేరారని, రోజూ ఆ సంఖ్య ఎక్కువవుతోందని మరో నివేదికలో తెలియజేయబడింది.

బందా సింహుడు గురుగోవిందుని సిద్ధాంతాన్ని తప్పక పాటించాడనటంలో సందేహంలేదు. కాని ఈనడుమ కొందరు శిక్కు గ్రంథకర్తలు రతన్‌సింహ్ భంగును అనుకరిస్తూ శిక్కుల మధ్య విబేధాలకు అనవసర ప్రాముఖ్యం ఇచ్చారు. నిజానికి ఈ విబేధాలన్నీ బందా మరణం తర్వాతే ఎక్కువగా ఏర్పడ్డాయి. అతని రాజనీతిలో కాని, ప్రవర్తనలో కాని విబేధాలు కలిగించే అంశాలున్నట్టు మచ్చుకైనా అతని జీవిత కాలంలో కనుపట్టదు. అతడు వ్రాసిన ఉత్తరాలలో అతడెప్పుడూ తననొక గురువుగా, గురుస్థాన మలంకరించినవాడిగా ఎన్నడూ తలంచలేదు. పైపెచ్చు తనను బందా అనీ గురువుయొక్క బానిస అనీ అందరూ పిలవాలని ఎంతో సంబరపడేవాడు. శిక్కులందరూ మహనీయుడైన గురువును అతని ఆజ్ఞలను అనుసరించాలనేవాడు. అతని ఆధ్వర్యంలో శిక్కులందరూ సంఘటితమైనారు. వారి సంఘటిత శక్తిని దేశంలోని బీదవారిని, నిమ్నస్థితిలో వారినీ రక్షించటానికి, న్యాయం అమలు జరపటానికీ, కల్మష హృదయులై ప్రజలను దోపిడీ చేస్తున్న వారిని తీవ్రంగా శిక్షించటానికీ, ఒక సాధనంగా తయారు చేశాడు. పుణ్యగ్రంథాల ప్రకారం పాలకులు చేయ

గల దైవపూజ ప్రజలపట్ల న్యాయంగా ప్రవర్తించడమేనని అధికారులకు చెబుతుండేవాడు. మిమ్మల్లను మీరు శిక్కులుగా భావించుకుంటే పాపాన్నీ ధర్మవిరుద్ధ కార్యాలనూ, అన్యాయాన్ని ఎప్పుడూ చేయవద్దు. శిక్కుమత భావాలను విస్తృతపరచి, ఎవరు దీనికి వ్యతిరేకిస్తారో వారిని శిక్షించ"మని కూడా అతడు చెప్పేవాడు. న్యాయాచరణకు, తప్పుచేసిన వారిని దండించ డానికి అతడు ప్రవేశపెట్టిన విధానాలు నిర్దాక్షిణ్యంగా వుండేవి. ఆ కష్ట కాలంలో ఇలాంటి విధానాలు ప్రవేశపెటడం వలననే,బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తూ, అనవసరమైన క్రూరకృత్యాలతో ప్రజల నణచివేసే అధికా రుల దుర్నిర్ణయాలు త్వరలోనే సమసిపోయాయి.

బందా ఆకాంక్ష ఒక్కటే- పరకీయులైన మొగలాయిల పాలన నుండి తన దేశాన్ని విముక్తం చేయటం. మొగలాయిల పరిపాలన గురునానక్ కాలంలోవలెనే (దానిని బెబ్బులుల, వేటకుక్కల పరిపాలనగా నానక్ వర్ణించాడు.) నిర్దాక్షిణ్యంగా, కరుణారహితంగా ఉండేది. ఆ స్థితిలో శిక్కు ఉద్యమము జాతికి జ్ఞానదీపికగా వెలుగొందింది. ప్రప్రథ మంగా ప్రజల్లో ధైర్యాన్ని ఉత్సాహాన్ని రేకెత్తించింది. వారిలో రాజకీయ జ్ఞానాన్ని కలిగించి, ఐక్యతఏర్పరచి, హింసను, దౌర్జన్యాలనూ ప్రతిఘ టించేలా చేసింది. తమ హక్కులను రక్షించుకొనే విప్లవ శక్తిగా వారిని శిక్కు గురువులు సంఘటితం చేశారు. శిక్కులుచేసే ప్రతిజ్ఞ. వారిఆరవ, పదవ గురువుల బోధనలు వారికి తెలియజేసింది ఒక్కటే- మొగలుల క్రూర ప్రభుత్వాన్ని దానిద్వారా ఉత్పన్నమైన భీకర పరిస్థితులను ఎదు ర్కొని యుద్ధరాంగంలో పోరాడమని. కాని వారి లక్ష్యం కేవలం ఆత్మ రక్షణ కావటంతో దేశాన్ని ఆక్రమించుకోవటం, శత్రువులను ఖైదీలుగా చేయటం, వారి ధనాన్ని దోచుకోవటం వంటి చర్యల వల్ల కలిగే ప్రలోభా లకు లోను కాకుండా వారు ధర్మ ద్రోహులను ఎదిరించలిగారు. కాని రాజకీయమైన సామ్రాజ్యాన్ని స్థాపించాలని ఆలోచించిన శిక్కులలో

బందాసింహుడు ప్రథముడు. కేవలం మొగలులను అశక్తులను చేయటమే కాక వారి అధికారాన్ని కూకటి వేళ్ళతోసహా పెకిలించివేయాలనే ఉద్దేశ్యంతో అతడు యుద్ధాలు చేశాడు. అందుకనే పాదుషా నియమించిన అధికారులను తొలగించి వారిస్థానే తనవారిని నిలిపాడు. జమీందారీ విధానాన్ని నిర్మూలించి దున్నేవానిదే భూమి అనే సంస్కరణను ప్రవేశ పెట్టాడు. అప్పటి వరకూ జరిగిన ఆర్థిక సంస్కరణలలో ఇది ఉత్తమోత్తమ మైనదిగా ఈనాటికి గుర్తింపబడుతోంది. అతడు ప్రచండమైన విజయాలు సాధించాడు. దీంతో ప్రజలు తమదేశంలో ఒక మహాసేనాని జ్ఞానీ ఉద్భవించాడనీ శతాబ్దాలుగా జరిగిన క్రూరకృత్యాలకు ప్రతీకారం చేసి నూతన జీవనవిధానాలను ప్రవేశపెడతాడనీ తననుగూర్చి భావించేలా చేయగలిగాడు.



కాని అతడెదుర్కొన్న సమస్య అతని శక్తికి సాధనలకూ అతీతమయినది. మొగల్ రాజ్యం అప్పటికి దేశంలో వేళ్ళు తన్నుకొని నిలిచిపోయింది. వారి శక్తి ఎంతకూ క్షీణించలేదు. అన్ని సాధన సంపత్తులను సమకూర్చుకొని శిక్కులను అణగించగలిగిన శక్తి సామర్థ్యాలుగల అబ్దుస్ సమద్ ఖాన్ పంజాబులో ఉండడం మొగలుల అదృష్టమయింది. బందాకు అంత సాధన సామగ్రులు లేవు. కాని ధైర్యసాహసాలతో కూడిన అజేయమైన ఆత్మవిశ్వాసం ఎంత పనైనా చేయగలదు. కాని అన్నీ అదే పూర్తి చేయాలంటే దుస్సాధ్యము. కావలసిన బలగం, వస్తుసామగ్రి దానికి తోడుగా ఉండాలి. కాని ఈ విషయంలో బందా మొదటి నుండి కొరతబడి ఉన్నాడు.



అతడు సాధించిన విజయాలన్నీ కేవలం యుద్ధరంగానికే పరిమితం కాలేదు. దేశచరిత్ర సాధారణంగా గమనించనిదొకటి ఉంది. ప్రజల మనస్సులలో కలిగిన విప్లవాత్మకమైన మార్పు. అతనివలన సామాన్య ప్రజా

నీకంలో ఒక ప్రబలమైన సంకల్పం కలిగింది. క్రూర పరిపాలనను ఎది రించాలనీ, ఒక జాతీయ ఆశయ సాధనకై జీవించాలనీ, దాని కోసం అవసరమైతే ప్రాణాలర్పించాలనీ వారు సదా భావించసాగారు. బందా సింహుని, అతని అనుచరుల యొక్క ఆత్మార్పణ ఈ విషయంలో ప్రజ లకు మార్గదర్శకమయింది. వారి జీవితాలు భావిభారతానికి ఆశాజ్యోతుల య్యాయి. చాలా దినాలుగా మరుగునపడి విస్మరించబడిన కోర్కె- ఈ దేశంలో జాతీయ ప్రభుత్వం ఉండాలనే ఆకాంక్ష- నిత్యనూతనమైన లక్ష్యమయింది. ఆ సమయానికి తాత్కాలికంగా ఈ కోరిక ఎనలేని దౌష్ట్యానికి గురియై అణచివేయబడినప్పటికీ, లోలోన రగులొ్కనే అగ్నియై రహస్యంగా అది పనిచేసింది. దీని ప్రభావం నలభై సంవత్సరాల తర్వాత మొగల్ అధికారం ఇంకా బలహీనమైనప్పుడు ప్రస్ఫుటంగా పైకి వచ్చింది. అప్పుడు పంజాబునుండి మొగల్ పరిపాలనను పూర్తిగా అంత మొందించారు శిక్కులు. అంతేకాదు ఆ సమయంలో ఉత్తరం నుండి పలు మారులు మొగల్ పాదుషాపై దాడి చేసి, దోపిడీలు చేసిపోయిన అఫ్ఘని స్థాన్ పాలకుడు అహమ్మద్ షా అబ్దాలీని ఎదిరించి నిలువగల ధైర్య సాహసాలను జాతిగా అది కలిగించింది. ఆఫ్ఘాన్ పాలకుడినిఎదిరించటమే కాక శిక్కులు అతడిని ఓడించి పంజాబును పరకీయుల పాలన నుండి సంపూర్ణంగా విముక్తం చేశారు. తర్వాత పందొమ్మిదవ శతాబ్దపు ప్రారంభంలో రంజితసింగు నాయకత్వాన పంజాబు ఇతర పరిసర ప్రాంతాలలో, చాలా పటిష్టమైన జాతీయ శిక్కు ప్రభుత్వమేర్పడింది.

* * * *